# ఆంధ్రసచిత్ర వారపత్రిక



Founder
K. Nageswara Rao

స్థాపితము
1908



సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్



సంపుటము 53
సంచిక 46

19-8-59

వికారి శ్రావణ బహుళ ప్రథమ



విడిప్రతి వెల 25 న. పై.
సంవత్సర చందా 13-0-0



ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1.


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:

అసోసియేటెడ్ సినీ ఎంటర్ ప్రైజెస్ వారి "వీరపాండ్యకట్టబ్రహ్మన" చిత్రంలో

పద్మిని





# ఉత్తరాలు

## అతిశయోక్తి ఎవరిది?

నౌషద్ మీద వ్యాసాన్ని అతిశయోక్తి అని ఆక్షేపిస్తూ "సంగీత ప్రపంచంలో రామ్‌చంద్ర చితల్కర్ తరవాతే ఎవరన్నా," అని ఎస్. శేషగిరిరావు గారు యథాశక్తిగా ఇంకో అతిశయోక్తి విసిరారు. రష్యన్ సారస్వతం గోగోల్ "కోటు" లోంచి, తెలుగుసినిమా సంగీతం రాజేశ్వరరావులోంచి వచ్చినట్లు, హిందీసినిమా సంగీతం నౌషద్‌లోంచి వచ్చిందనటం న్యాయోక్తికాని అతిశయోక్తికాదు. ఆమాటకొస్తే శంకర్ జైకిషన్, బర్మన్, మదన్ మోహన్ ఇత్యాదుల మాటేమిటి? అందుకనే "ఎందరో మహానుభావులు, అందరికీ వందనములు."

టి. వి. రావు-బొంబాయి.

* * *

## బాలసాహితి

"బాలసాహితి" పిల్లల శీర్షిక చాలా బావుంది. కాని రెండు మూడు పేజీలతోనే ఆ శీర్షిక ముగిస్తున్నారు. అలాగాకుండా మరికొన్ని ఆ శీర్షిక పుటలు పెంపొందిస్తే, బాలల అందరి హృదయాలను "ఆంధ్రపత్రిక" ఆకర్షిస్తుంది. ఈ సలహాను తప్పక పాటిస్తా

## హాస్యనటులు

హాస్యనటులపై వ్యాసాలు చదువుతుంటే ఎప్పుడో ఇరవయ్యేళ్ళ కిందట నూజివీడులో చదువుకునే రోజుల్లో టెంట్ సినిమాల్లో వరసగా చూసిన చాప్లిన్ చిత్రాలు జ్ఞాపకంవచ్చి మధురస్మృతులలోకి వెళ్ళిపోయాను. చాప్లిన్, మార్క్సు బ్రదర్స్, లారెల్ ఎండ్ హార్డీ, చిత్రాలు చూడని తెలుగుసినిమా నిర్మాతలుండరనుకుంటాను. ఆ చిత్రాలు చూస్తూ ఈ నిర్మాతలు హాయిగా నవ్వుకోలేదా, చూసిన తరవాత అలాంటి చిత్రాలుతీసి తెలుగువారిని నవ్వించాలనే తాపత్రయమైనా కనీసం వారికి కలగలేదా, కలిగితే కుండెడు కన్నీళ్ళు బండెడు పాదధూళితో మిళాయించిన చిత్రాలు ఎలా తీయగలుగుతున్నారా, చెప్పుకోదగిన హాస్యచిత్రం (ఘరానా హాస్యనటులుండి కూడా) ఒక్కటి ఎందుకు (ఎవ్వరికీ జ్ఞాపకంలేని "శాదు మారు" మినహాయించి) తీయలేక పోయారా అని ఆశ్చర్య విచారం కలుగుతోంది. 'హాస్య చిత్రాలు జనానికి నచ్చవు' 'డబ్బురాదు' 'సెంటిమెంటు ముఖ్యం' లాంటి క్లాసికల్ సాకులు కాక మరో సమాధానం ఏదైనా ఏ తెలుగు నిర్మాత అయినా మీ పత్రికా



# రాజధాని కబుర్లు

ప్రవీణ్

## "విద్యయొసగును వినయంబు..."

అన్నాడు భర్తృహరి అనే పెద్దమనిషి ఒక సారి. అన్నదేదో, ధీమాగానే అన్నాడు. కాని, అతని జీవితకాలం నాటికి ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ ఇంకా అవతరించలేదు. అతను మనవిద్యాశాఖను చూస్తే తన అభిప్రాయాలను మార్చుకుంటాడా లేదాఅనేది సమాధానం లేని ప్రశ్నగా మిగిలిపోతుంది—ఎల్లప్పటికీ!

ఈ వాక్యాలు చదివి, మన విద్యాశాఖాధిపతుల వద్ద వినయం అనేది కనపడదని నేను భావిస్తున్నానని వీరు అనుకుంటే పొరపాటు! ఉన్నదే వినయం మన విద్యాశాఖ వద్ద—విద్య కాదు.

విద్యాశాఖను అందరూ అదేపనిగా దుందుకు ఆడిపోసుకుంటారో తెలియదు అర్థం కాదు—నాకూ, విద్యాశాఖాధికారులకూ కూడా! కట్టెల వెంకటాపురం సంగతి జ్ఞాపకము ఉండికదా? స్వతంత్ర శాసన సభ్యుడు శ్రీ బసవ మానయ్య మెదక్ జిల్లాలోని కట్టెల వెంకటాపురం అనే గ్రామములో ప్రజలు పాఠశాల కావాలని మహజరు పెట్టుకున్న మాట వాస్తవమేనా అని ప్రశ్న పంపాడు గత సంవత్సరం. ఒక శాసన సభ్యుడు ప్రశ్న పంపితే—ఫైల్సు వెతుక్కుంటూ ఆలస్యం చేస్తే బాగుంటుందా? మెదక్ జిల్లాలో అసలు కట్టెల వెంకటాపురం అనేదిలేదని సమాధానం పంపించారు ఆ జిల్లా విద్యాశాఖాధికారి—ఎంగు కయిశా మంచిదని!

భారత స్వాతంత్ర్య జనకుడు

మద్రాసు, ఇలియట్స్ రోడ్ బీచ్‌లో ప్రతిష్ఠించిన మహాత్మాగాంధీ [illegible]

# ★ రాజధాని కబుర్లు ★

చరిత్ర పుటల్లో పచార్లు చెయ్యడానికి వెళ్ళిపోయింది హైదరాబాదు ప్రభుత్వం–1956 వ సంవత్సరంలో! మీరూ నేనూ ఐతే ఆ ప్రభుత్వాన్ని అప్పుడే మరచిపోయేవాళ్ళం. కాని డి. పి. ఐ. శాఖ మొన్న మొన్నటివరకు 'హైదరాబాదు ప్రభుత్వం' అని నుదుటిమీద రాసుకు చిరాంగలీగల్లీ కూచుంది. రాజధాని కబుర్లలో ప్రస్తావించాంగదా ఆ విషయం? ప్రస్తావించిన తర్వాత – కొత్తబోర్డు రాయించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంలో భాగంగా మారింది. విద్యాశాఖవద్ద వినయం లేదని, అదిపొరపాట్లు సరిదిద్దుకోదని భర్తృహరి గర్భశత్రువులు కూడా అనడానికి వీల్లేదు.

ఉదాహరణకి వినండి, పూర్వం మదరాసు ప్రభుత్వం రోజుల్లో విద్యాశాఖ ఏదైనా మార్పులు చేస్తే – మార్పులు అమలు జరపడానికి మూడు సంవత్సరాల గడువు ఇచ్చేది. విశ్వవిద్యాలయాలు అధమం రెండు సంవత్సరాలు గడువు ఇచ్చేవి. అంత జాగ్రత్త వహించడం ముసలితనపు లక్షణాలని, సరదాగా ఉండాలంటే చకాచకా మార్చెయ్యాలని మన విద్యాశాఖ గమనించింది. మార్చినది బాగుండకపోతే – మళ్ళీ మార్చెయ్యొచ్చుగదా? అది బాగుండలేదని మరెవరైనా అంటే – మళ్ళీ మార్చెయ్యవచ్చు. ఈ పద్ధతి చాలా సరదాగా ఉంటుంది. తండ్రీ. కొడుకూ, గాడిదకథ జ్ఞాపకం ఉందికదా?

విశ్వవిద్యాలయాలు నిర్వహించే ప్రీయూనివర్సిటీ పరీక్షకు నిర్ణయింపబడిన భాషావాచకాలే పన్నెండవ తరగతికి వర్తిస్తాయని విద్యాశాఖ పాఠశాల లన్నింటికీ ఒక సర్క్యులర్ పంపింది. హిందీ పుస్తకాల విషయంలో – 'మీరు పాఠాలు చెబుతూండండి. ఆ పుస్తకాలలో కొన్ని పాఠాలు సిలబస్‌లో ఉండవు. ఆ వివరాలు తరువాత పంపిస్తాం' అంది విద్యాశాఖ. విద్యాశాఖ చెప్పిన తర్వాత తప్పుతుందా? రాజధాని నగరంలో పాఠశాలల అధికారులు ఆ హిందీ పుస్తకాలు–ప్రోజా, పొయిట్రీ, నాన్‌డీటేల్డు–మూడూ నిర్ణయించారు. పిల్లలందరూ పుస్తకాలు కొన్నారు. పాఠాలు ప్రారంభమయ్యాయి. కొన్ని పాఠశాలల్లో మాసిక పరీక్షలుకూడా పూర్తయ్యాయి. ఇప్పుడువిద్యాశాఖ మళ్ళీ ఈ ఉత్తర్వులు జారీ చేసింది! 'ఆ పుస్తకాలు కాదు. ఈ పుస్తకాలు కొనండి' అంటూ. విద్యార్థులకి ఆరేడు రూపాయలు ఖరీదుచేసే పుస్తకాలు నష్టం! ఉపాధ్యాయులకి ఒక నెల జీతం నష్టం–అదే జీతంతో మళ్ళీ చెప్పాలిగదా సిలబస్ అంతా? కాని–ప్రచురణకర్తలు కొందరు, విద్యాశాఖలో కొందరు బాగుపడతారు. విద్యాశాఖ పొరపాట్లు దిద్దుకోదని ఎవరు అనేది?

ఒక మగవాడుగాని, ఒక ఆడదిగాని మీకు రాజధాని నగరంలో కనపడి, మిమ్మల్ని 'మలయాన్ కమ్యూనిటీ'ని గురించో, 'ఆస్ట్రేలియన్ కమ్యూనిటీ'ని గురించో ప్రశ్నిస్తే మీరు పరిహసించకండి. అతడుగాని, ఆమెగాని రాజధానినగరంలో ఉపాధ్యాయవృత్తిలో ఉండి, ఉన్నత తరగతులకు 'సోషల్ స్టడీస్' బోధించవలసిన దురదృష్ట పరిస్థితికి లోనుకావలసి వచ్చిన వ్యక్తి కావచ్చు. కన్నీరంటే కార్చండి! పదకొండు పన్నెండవ తరగతులకు సోషల్ స్టడీస్ సిలబస్ నిర్ణయించిన విద్యాశాఖ, పుస్తకాలు నిర్ణయించడంగాని సూచించడంగాని మరచిపోయింది. ఈ సిలబస్‌లో 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' సేకరించిన విషయాల కంటె ఎక్కువున్నాయి. పాఠశాలల విద్యార్థుల విద్యాప్రమాణాలు పెంచాలిగదా మరి?

తొమ్మిదవ తరగతి విషయంలో సోషల్ స్టడీస్ పుస్తకాలు రెండున్నాయి. ఇంగ్లీషుకు ఒకటి, తెలుగుకి మరొకటి. రెండింటికీ సంబంధం లేదు. బాలమేధావుల వ్యవస్థ–విద్యాశాఖ– కార్యక్రమ నిర్వహణాపద్ధతి చూసి ఆనందించండి. వచ్చే వారాల్లో–ఇంకా ఇంకా ఆనందిద్దాం.

## హోసూరు-మైసూరు

రాష్ట్ర శాసన సభ ప్రతీ సమావేశానికి ఒక ప్రత్యేకత ఉంటుంది. గత జూలై 27 తేదీన ప్రారంభమైన సమావేశానికి గవర్నర్ల సమావేశం అంటే ఒక విధంగా ఉచితంగా ఉంటుంది.

గవర్నరు శ్రీ పచార్ ఈ సమావేశం ప్రారంభించారు– సహజంగానే! గవర్నర్ బూర్గుల నివేదికపై కేరళలో కేంద్రం జోక్యం కలిగించుకున్నందుకు నిరసనగా దాదాపు 94 గురు ప్రతిపక్ష సభ్యులు శాసన సభనుంచి నిష్క్రమించారు. గవర్నర్ గాడ్గిల్ అయాచితంగా నాగార్జునసాగర్ డామ్‌ఎత్తును గురించి ఇచ్చినసలహా శాసన సభ్యులకు ఆందోళన కలిగించింది. గవర్నర్ పటాస్కర్ అడిగినాకూడా హోసూర్ విషయంలో ఇవ్వని తీర్పునుగురించి శాసన సభ్యులు తమ నిరసన తెలియచేశారు.

హోసూరులో తెలుగువారు అధిక సంఖ్యాకులు. వేపనపల్లి ఫిర్కా హోసూరులో ఉంది. అది కృష్ణగిరి తాలూకాలో నాలుగు దశాబ్దాల క్రితం చేర్చబడింది. ఈవంకపై ఆంధ్రప్రదేశ్‌కి హోసూర్‌కి మధ్య ఆంధ్రేతర ప్రాంతాలున్నాయని మదరాసు అబద్ధమాడింది. ఈ అబద్ధం ఎంతవరకు అబద్ధమో శ్రీ కళా వెంకటరావు పటాస్కర్‌కు నిరూపించారు. ఐతే హోసూరు త్రిభాషా ప్రాంతం అనే వంకతో మైసూరుతో మాట్లాడ్డం

వచ్చే వారం:

**అధికారి (కథ)**

రచన: రాచకొండ విశ్వనాథశాస్త్రి.

పడలేదుగదా అని తీర్పు చెప్పడానికి శ్రీ పటాస్కర్ నిరాకరించారు.

మదరాసుతో నైనా, మైసూరుతో నైనా, ఒరిస్సాతో నైనా పరిహద్దుల విషయంలో ఆంధ్రులు నష్టపోతున్నారే అన్న బాధ శాసనసభ్యుల ఉపన్యాసాల్లో వ్యక్తమైంది. శ్రీయుతులు డి. రామబ్రహ్మం, ఎస్. వి. వెంగళ్వరాయనాయుడు వావిలాల గోపాలకృష్ణయ్య ప్రవేశపెట్టిన సవరణలతో సరిహద్దు సంఘాలను నియమించాలనే తీర్మానాన్ని ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి ఉత్సాహంతో సమర్థించారు. శ్రీ సంజీవరెడ్డి సమర్థిస్తే, సాధ్యం కాని కార్యం ఉండదు.

# శ్రీకృష్ణ జన్మస్థానం చెప్పిన కథలు

"పునర్ పునర్ పునర్ పునర్వివాహం చేసుకున్న వాడి కథ చెప్పు!" అంది నృసింహజన్మస్థానం. "ఏమిటా తొందర?" అని గదమాయించింది శ్రీకృష్ణ జన్మస్థానం. ప్రతీ వారం దొంగల పేర్లు వినగానే భయపడ్డం, భయపడినందుకు సిగ్గుపడ్డం నృ. జ. స్థా. కి అలవాటు. ఈమారు సిగ్గుపడుతూ, సిగ్గుపడిన సంగతి శ్రీకృ. జ. స్థా. కనిపెడుతుందేమోనని భయపడింది.

అందువల్ల నృ. జ. స్థా. ఏమీ మాటాడలేదు. శ్రీకృ. జ. స్థా. మరో కథ ప్రారంభించింది.

## నాలుగో కథ

"మహమ్మద్ అలీ ఉరఫ్ పాషా ఉరఫ్ మహమ్మద్ సిద్దిఖ్ ఉరఫ్ శంకర్ పేర్లలో ఏ పేరూ నువ్వు వినుండవు. చిన్న మొత్తాల కోసం పదిహేను పదహారు హత్యలు చేశాడు. పేదవాళ్ళను ముసలివాళ్ళను రాయిపెట్టి తల బ్రద్దలుకొట్టి చంపేయడం అలవాటు అతనిది. పది పదిహేను రూపాయలకోసం అన్ని హత్యలు చేశాడు. ఇప్పుడు పాపఫలం అనుభవిస్తున్నాడు. జీవితాంతం మనదగ్గరే ఉండాలని న్యాయస్థానం తీర్పు ఇచ్చింది.

"ముప్పై సంవత్సరాల ఈ యువకుడు ఇక్కడే జన్మించాడు. పది సంవత్సరాల క్రితం మోతీమహల్ టాకీసువద్ద ఉండేవాడు. జేబులు కొట్టేయడంలో ప్రావీణ్యం సంపాదించుకున్నాడు. పెళ్లిళ్లలో నృత్యం చేస్తూండేవాడు. 1950 లో అలంకరించుకోడానికి ఇచ్చిన 'తుస్సీ' అనే ఆభరణం దొంగిలించి, రెండు వందల రూపాయలకు అమ్మేశాడు. ఆరు సంవత్సరాల శిక్ష అనుభవించాడు. వరంగల్ వెళ్ళి, దొంగతనం చేసి, పట్టుబడి, మూడు నెల్లు మనింట్లో కాపరం పెట్టాడు. విడుదలై, రైళ్లలో దొంగతనాలుచేసి, మరో మూడు నెల్లు మనింటికి వచ్చాడు. తరువాత టికెటు లేకుండా రైలెక్కి బొంబాయి వెళ్లాడు.

"బొంబాయిలో అనుమానంపై అరెస్టు చేశాడు పోలీసు కమీషనర్. రెండు సంవత్సరాలకాలం అసలు బొంబాయికి రావద్దని ఆజ్ఞాపించాడు. కళ్యాణీవరకు సాగనంపితే, మళ్లా రహస్యంగా బొంబాయి చేరాడు పాషా. వైకుల్లాలో ఉండగా, ఐదు రోజుల్లో అరెస్టయ్యాడు. పేరడిగితే— శంకర్ అన్నాడు. బొంబాయిలో రెండు మార్లు శిక్షపడింది—ఆరునెలలు ఒకసారి; తొమ్మిది నెలలు ఒకసారి.

"1956 డిసెంబర్ 17 వ తేదీన జేబులు దొరుకుతాయేమో కొట్టేయడానికని దబీర్‌పూర్ లోని క్షయాసుపత్రికి వెళ్లాడు. ఊపిరితిత్తుల్లో నొప్పిగా ఉందని వంకపెట్టి ఎక్స్‌రే కూడా తీయించుకున్నాడు. పక్కన కూచున్న ఒక ముసలాడివద్ద రెండు పదిరూపాయల నోట్లు కనపడ్డాయి. వినయ విధేయతలు ఉట్టిపడుతూ క్షేమసమాచారాలు కనుక్కున్నాడు. 'నీ క్షయవ్యాధి ఈ ఆసుపత్రిలో ఎలా నయమౌతుంది? మియాన్‌మిస్కి మసీదు దగ్గర ఒక మందువేసేవాడు ఉన్నాడు.

పాషా

మాత్రలిస్తాడు. నాతో రా' అన్నాడు. ఆరాత్రి ఆ మసీదులో ఒక పెద్ద రాయిపెట్టి, ఆ ముసలి తల పగలకొట్టి చంపేశాడు. ఇరవై రూపాయలు కాజేశాడు."

"ఇంక చెప్పకు" అంది నృ. జ. స్థా. చెవులు మూసుకుని. అని, తన పని భయం సంగతి గుర్తుకొచ్చి, "చెప్పు" అంది. శ్రీకృ. జ. స్థా. చెప్పింది:

"అంతకుముందు నగరపాలక సంఘం ఆఫీసువద్ద డెభ్భైఏళ్ళ ముసలి ఫకీరు కనపడ్డాడు. అతని జోలిలో ఇరవై రెండు రూపాయలు కనపడ్డాయి. రహస్యంగా అతన్ని వెంటాడాడు. ఆ రాత్రి ఆ ఫకీరు ఒక కూరగాయల దుకాణం ముందు పడుకున్నాడు. వీడు దగ్గర్లో ఒక ధాన్యం వర్తకుడి దుకాణంముందు పడుకొని, రాత్రి పన్నెండుగంటలకి లేచి, ఒక రాయితో ఫకీరుతల మోదాడు. ఫకీరు స్పృహతప్పిపడిపోయాడు. 22 రూ. లు తీసుకుని మాయమయ్యాడు. అతడు బ్రతుకున్నాడో, చనిపోయాడో తెలియదు.

"ఈవిధంగా ఆడాళ్ళని, మగాళ్ళని ఎంతమందినో హత్యచేశాడు పాషా. అందరినీ రాతితో మోది చంపడమే. అన్ని హత్యలూ పదిపదిహేను రూపాయల లాభానికే! వెయ్యిరూపాయలు దొంగిలించి సంపాదించాలని అతని జీవితాశయమట. కాని, ఆశయం నెరవేరలేదు. మనదగ్గరే ఉంటాడు. ఇది మన దురదృష్టం: ప్రజల అదృష్టం!"

"పునర్ పునర్ పునర్ పునర్వివాహం చేసుకున్నవాడి విషయం వింటావా" అంది. శ్రీ కృ. జ. స్థా. "చెప్పు" అంది నృ. జ. స్థా. 'వచ్చేవారం' అంది శ్రీ కృ. జ. స్థా. "ఆ. వినవలసిందే! ఈవారం విన్నాంగా?" అంది నృ. జ. స్థా. ఉపశమింపుగా! "పాసీ-షాకీలా 420—వహీదా కథ విను" అంది

తండ్రి కూతురుతో!

"అమ్మా నన్ను నిష్ఠూర్య పెట్టి లాభం లేదు. ఇప్పటికే మీ ఆయన నాకు మూడు వేల పై చిల్లర ఇవ్వాలి. నేనింకా యేమాత్రం ఇచ్చేస్థితిలో లేను. అది త్వరలో తీరుస్తే సంతోషిస్తాను."

వెంటనే కూతురు ఇలా అన్నది.

"నాన్నా- ఆ బాకీ తీర్చాలన్నా మళ్లీ ఎక్కడో చెయ్యాల్సిందే కదా. అందులోనూ మీ అల్లుడికి బయట అప్పులు చేయడం మహా చెడ్డ అసహ్యం. అందుకే గొడవ..."

# ఋణానందలహరి

(గతవారం తరువాయి)

ఎంత స్నేహం అయితేమటుకు ఇలా సర్వగ్రామాలదాకా తరిమి తరిమి అప్పుల డుగుతారుటోయ్. ఇదెక్కడి స్నేహం. అన్నారు మునసబుగారు వారం రోజులు ఆలోచించి.

గుర్నాథం మందహాసం చేశాడు.

హు. నాన్నా నీకేం తెలుసు అప్పారావుసంగతి అంది అనవ్వు. అప్పారావు ఒక మనిషితో పది నిముషాలసేపు మాటాడితే చాలు దమ్మిడీ అప్పు అడక్కుండా వెళ్ళిపోయి ఎదటివాణ్ణి చితక్కొట్టేసిన సందర్భాలున్నట్టు చరిత్రలో దాఖలాలున్నాయి. పది నిముషాలూ మాటాడి కేవలం ఒక్క దమ్మిడీయే అప్పుచ్చుకు అవతలివాణ్ణి చిత్తుచేసిన రోజులూ ఉన్నాయి. అతను ఎప్పుడు ఎవర్ని ఎంత అడుగుతాడో ఎవరి దగ్గర ఎంతా ఎలాపుచ్చుకు చక్కాపోతాడో అతనికే తెలియాలి. అతనికి తెలియదేమో కూడా. ఆ ఋణలీల మనకి అర్థంకాదు. మనకేముంది. మనమంతా నిమిత్తమాత్రులం కేవలం అప్పిచ్చే క్వాలిఫికేషన్ ఉంటే చాలు. ఒక్కొక్కసారి అదీ లేకపోయినా సరే, ఆ సదుపాయంకూడా అతడే చేసిపెడతాడు. నాన్నా! నీకు తెలుసో తెలీదో గాని ఇండియా గవర్నమెంటు వాళ్ళు, ఇంకా చిన్న చిన్న సర్కార్లవాళ్ళు, రిజర్వు బ్యాంకువాళ్లు, దేశం మీదా విదేశాల మీదా అప్పులు నోల్లుకోవాలంటే బాంకిలవాళ్లు డిబెంచర్లు ఫ్లోట్ చెయ్యాలంటే ఓం ప్రథమంగా ఇతన్ని ముందు సలహా అడిగి గాని మరోకపని చెయ్యరట. ఫోరు రాక్ ఫెల్లరు, జెబి షేలరు, సి. డీ. దేశముఖ్ వీళ్ళంతా కూడా ఇతనికి ఉత్తరాలు రాస్తారుట. రొండోకంటికి తెలీకుండా ఇతని రూముకివచ్చి సలహా చెప్పమని అడిగి విని పోతారుట. అప్పారావు కొత్త రూపాయ నోటులా ఫెళఫెళ లాడుతూ ఉంటాడు. కాలదోషం పట్టిన దస్తావేజు లాంటి మాసిన గుడ్డలూ, ఖడిపంతులుగారి చేబదుళ్ళలా చిందర వందరగా ఉండే జుట్టూ, అప్పు తెచ్చిన విచ్చు రూపాయలా మెరిసే పత్తికాయల్లాంటి కళ్లూ అప్పులివ్వగల వాళ్ళందరినీ చేపల్లా ఆకర్షించగల ఎరలాంటి చురుకైన చూపులూ అతనూ, బాకీలవాళ్ళకి కోపిష్టివాడి జవాబులా పొట్టిగా టూకీగా వుంటాడు. మొత్తంమీద అతని మొహం ముప్పావలా అరణాలా ఉంటుందని అతనికి ఎప్పుడూ అంతే అప్పు ఇచ్చే మిత్రుడు అభివర్ణిం

అప్పారావుకి అప్పులు చేయడం ఉగ్గుపాలతో పెట్టిన విద్య. అతని పుట్టకలోనే, వాళ్ళనాన్న ఉగ్గు పొరుగింట అప్పు తెచ్చి పట్టించాడు. ఏడేళ్ళొచ్చేసరికే వాళ్ళనాన్న బళ్ళోవేస్తూ పలకలూ ఎక్కాల బుక్కులూ కొంచి పెట్టబోయేసరికీ, ఎవరో వచ్చి ఎందుకయ్యా ఇంత ఖర్చు అన్నాడట.

నేను గబగబా చదివేసి పెద్ద పోలీసు వాణ్ణయిపోయాకా నేనూ బోల్డు రూపాయలు సంపాయించి అప్పు తీర్చేస్తానుగా అన్నాడు అప్పారావు.

పువ్వుపుట్టగానే పరిమళించింది అని సరస మాడారు అప్పారావు జనకుడు అప్పుల స్వామి మిత్రులంతా.

అయితే అందాకా ఈ బాకీ తీరదా ఏవిటి అన్నాడు ఆనాటికి అప్పుల్స్వామికి అప్పు సర్దినాయన బిక్క మొహం పెట్టి

* * *

అయితే ఇంతకీ వాడు నాయుడుట పడ జేం—చెప్పు. అలా ముసి ముసి నవ్వులు నవ్వుకుంటే ఎలా అన్నారు మునసబుగారు.

## ముళ్ళపూడి వెంకటరమణ

ఇంత సేపూ ఆయన స్టేజిమీద జనాంతికం డైలాగు చెబుతున్న వాడి పక్కవాటు డిలా ఏం చెయ్యడానికీ పాలుపోక చుట్ట కాలుస్తూ కూచున్నాడు.

గుర్నాథం చిరునవ్వునవ్వాడు. 'నాన్నా అప్పారావేగనక నీఎదటపడి అడగడం జరిగితే మనిద్దరం ఇలాముణ్ణాళ్ళు ఇద్దామావద్దా అని ఆలోచించడానికి తెరిపి ఉండేది కాదు. అతను సుడిగాలిలా వచ్చిపడి అడుగుతాడు. అతను వెళ్ళిపోయాక గాని, మనమతనికి ఇందాకళ్ళ అప్పిచ్చావనీ, ఇంతమొత్తం ఇచ్చావనీ నీకు తెలీనే తెలీదు. అంచేత అతను రానందుకు ఆనందించు నాన్నా అంది గుర్నాథం చిర్నవ్వు.

ఎక్కడో అసాధ్యుడల్లే ఉన్నాడే. ఇలాంటివాళ్లు నీకెలా తెలిసవడ్డారోయ్ అంది మునసబుగారి (పాగ) కింది నిట్టూర్పు.

ఇవన్నీ తండ్రికి కొడుకు చెప్పేవి కావు. చెబితే పదారు మాటలకోమాటు భానుమతి మాట రాకతప్పదు. అసలు. గుర్నాథం ఫోర్త్ బియ్యే చదువుతున్నపుడు మాటిమాటికీ ఈమాటే వచ్చేది.

అప్పట్లో అప్పారావు ఆడుకోకపోతే

కుసేవాడే. కాలేజీలు తెరిచిన కొత్తల్లో ఇంకా అప్పుడే సెకండియర్ స్టూడెంట్లంతా ఫస్టియర్లో (ప్రేమలేఖలన్నిటికీ తరువాయిలు రాస్తూ సశేషాలు సాగదీస్తూ ద్విగుణీకృత ఉత్సాహాలతో జరిగిన కథలను కొనసాగిస్తున్నారు. సీతలూ సరోజలూ కనబడగానే లాస్టియర్ మీరు కాలేజినించి బస్టాండుదాకా పాయింటిచ్చిన వాడిని అంటూ పరిచయాలను తిరిగి గుర్తుకు తెస్తున్నారు. ఒక సాయంకాలం వేళ అందరు అధ్యాసలో ఉండగా ఎక్కణ్ణించో అప్పారావు బయల్దేరి వీరాభిమన్యుడులా ముందుకుపోతున్నాడు. ఒకొక్కణ్ణే పలకరించి ఒక హలో (రెండు రూపాయిలు) హలో హలో (నాలుగు) హలో కులాసా (ఆరు) అంటూ లెక్క ప్రకారమే లెఖ్ఖనందుకుంటూ ఒక వరస పూర్తిచేసి చివరకొచ్చే వరకూ–అప్పారావుకి అప్పిచ్చిన మహాగుప్తుడొకడు క్రూరంగా కర్కశంగా కఠినంగా ఆపళంగా అతన్ని నిల్చునపళంగా వంటి నున్న డబ్బంతా వొలిచేసుకుని పొమ్మన్నాడు,

అప్పారావు నిరుత్సాహపడ్డాడా? లోకంమీద అందరిలా అతన్ని తిట్టుకున్నాడా, శపించాడా, ఆఖరికి అతనిమీద నిల్చున్నపళంగా – "క్రూర అప్పులవాడు" అనే ఒక లావుపాటి సాంఘిక నాటకం గాని, దమ్ము షంభావన ఓ తెలుగు సినిమా (పిరుమాళ్ళు మార్కు) డైలాగు గాని రాసి పారేశాడా? లేదు. వాటన్నిటికీ టైము లేదు. అర్జెంటుగా అట్నించటే లవర్స్ డెన్ లాడ్జిలోకి పోయిపడ్డాడు. అక్కడ జనాభా అంతా కాలేజికి సెలవుపెట్టి మరీ ఫీలవుతూ నేపథ్యపాటలు పాడుకుంటున్నారు.

హలో కులాసాకి అన్నడు అప్పారావు ఉత్సాహంగా కళ్ళు చికిలించి.

ఎవరూ కులాసాగా లేరుగా ఇది పని గాదనుకుని, అక్కడున్న అక్కడలేని వాడి సిల్కు చొక్కా (చొక్కాఉండీ, అందులో వాడ్లేదని గ్రహించ ప్రార్థన)లో ఎక్కిపోయి వీధినపడి ఒకగొప్పవాడి దగ్గర అప్పడుగబోయాడు హడావుడిగా. దారిలో ఇంకో బాకీలవాడు కనబడే సరికి తప్పించుకునేందుకు మార్గాంతరం తోచక 'మార్గాంతరాన్ని బట్టి పరుగెత్తాడు కొంతదూరం పోయేసరికి జేబులు తడుముకుని అరె నా దగ్గర డబ్బుందే అప్పెందుకుటా అనుకుని ఆశ్చర్యపడి లేచి ధారాళంగా దానధర్మాలూ యజ్ఞయాగాలూ

లవక్ స్డెన్‌లో గుర్నాథం స్నానంచేసివచ్చి లాగుబనీను తొడుక్కొని నా చొక్కా ఏది రోయ్ వాట్ హెపర్డ్ వ్యేర్ అని గావుకేక పెట్టాడు. రూమ్ మేట్స్‌అంతా ప్రేమ పీమలోంచి ఒక్కసారి జారిపడ్డారు గదిలోకి ఎవరో వల్లటి పొట్టివాడు హడావుడిగా వచ్చి తొడుక్కుపోయినట్టు లీలగా గుర్తు అని, ప్రేయసిని ఏమంత గాఢంగా ప్రేమించలేని వాడొకడన్నాడు. అంతలోకే ఇంకోమిత్రుడు అద్దె సైకిలుమీద హడావుడిగావచ్చి గుర్నాథమూ గుర్నాథమూ ఎవడో నీడొక్కా మోకాళ్లదాకా తొడిగేసుకు మరీ, అంగులోని డబ్బంతా తగలబెట్టేస్తున్నా...డు...రో...య్ అని, ఓ నిముషంమూర్ఛపోయితిరిగి వచ్చాకభానుమతి మిడ్‌లాండ్ కెళ్తోంది అని కష్టంమీద చెప్పి, పోయాడు. గుర్నాథం గుండె గుభేలుమంది. ఇపుడెలాగా కొంప మునిగింది. భానుమతి మిడ్‌లాండ్‌కి వెళ్ళినపుడు తనువెళ్లకపోతే ఇంకేముంది! చొక్కా లేదు. ఈ పాటికి అంగిలో డబ్బూ ఉండదు. నీరుగారిపోయాడు. ఎవరైనా ఓ చొక్కా రెండ్రూపాయలూ అప్పివ్వండన్నాడు. చొక్కాలున్నాయి కాని, ఎవరిదగ్గరా డబ్బు లేదు. ఇళ్ళ దగ్గిర్నించి మనియార్డర్లొచ్చి అప్పుడే మూడు రోజులు అయింది: ఇంకా యెక్కడ డబ్బుట.

గుర్నాథం హడావుడిగా కంటికి వదులుగా ఉన్న రెండుమూడు చొక్కాలు తొడుక్కొని అప్పారావుకోసం బయల్దేరాడు. డబ్బులేకపోయినా చొక్కాముఖ్యం అది లక్కీషర్టు. అదివేసుకున్నప్పుడే భానుమతి తొలిసారి నవ్వింది. "ఆసిల్కు చొక్కా అబ్బాయిలేడూ" అని ఎవరితోనో అంటూ ఉండగా తనువిన్నాడు.

పార్కు దగ్గిర దొరికాడు అప్పారావు. ఎవరో గుడ్డివాడికి రూపాయి దానమిచ్చి భోరునవిడ్చే పుణ్యంగడించాలన్న ఆధ్యాత్మిక చింతనకొద్దీ, తనదగ్గరమిగిలినది రెండు రూపాయలనోటు అయినందువల్ల "మీదగ్గిర రూపాయుందా?" అని అడిగాడు.

అప్పుడుగుడ్డివాడన్న అపోహతో అతను తలతాటించాడు. అలాకాదు ఫరవాలేదని ఇతను బలవంతంపెట్టాడు. గొడవయేసరి ఎవరో రౌడీవచ్చి గుడ్డివాడికి డబ్బు దోచుకుంటున్నావా అని కేకవేసి అప్పారావుచేతిలో రెండూ పట్టుకు ఉడాయించేశాడు.

గుర్నాథం నోరెత్తి ఒరేయ్ అనేలోగానే, అప్పారావు అప్పు వసూలు చేసినంత చురుగ్గా ఇదంతా జరిగిపోయింది.

గుర్నాధం అప్పారావుని తిట్టిపోశాడు. ఇపుడు సినిమా కెళ్లకపోతే ఎలా అన్నాడు. వెళ్లడంఎలా? అనికూడా అన్నాడు.

అప్పారావు అతన్ని ఓదార్చి, అతని చొక్కా అతనికిచ్చి, అతను తొడుక్కున్న చిన్నదాంటో తను సర్దుకుని పద్ చెబతా వని కొంచెం అసింటాఉన్న హోస్టలుకు దారితీశాడు. ఆ హోస్టలు గదుల్లో అప్పారావు మిత్రులు—అప్పులిచ్చేవాళ్ళు, ఇవ్వనివాళ్లూ చెల్లా చెదురుగ్గానో ఉంటారు. ఆ గదుల్లోనే అప్పారావు తన చొక్కాలు కొన్ని స్టాండులకి తగిలించి ఉంచుతాడు. వాళ్లు పరాగ్గానో చిరాగ్గా ఆ చొక్కాలు తొడుక్కొని వాటిలో వెళ్ళి ఎవరి దగ్గరేనా అప్పు చెయ్యవచ్చు. అలాటప్పుడు అప్పారావు డేగలా వాడిమీద వాలి ఇది నా చొక్కా రోయ్ అని గావు కేక పెట్టివున్న విళంగా అది ఇప్పుడు చక్కాపోయి నిమ్మళంగా జేబులో తడివిచూసుకోడం పరిపాటి. ఒక్కొసారి ఆయా నేస్తాలు డబ్బుతోఉన్న ఆ చొక్కాలను గదిలోనే స్టాండుకు తగిలించి ఉంచుతారు. అపుడు పరేసరి. డబ్బుమటుకు తీసుకుని చొక్కా అక్కడేపెట్టి చక్కాపోతాడు. ఇవాళ గుర్నాథాన్ని సినిమాకి తీసుకెళ్ళేబాధ్యత మీదవేసుకుని అతను హోస్టలులో ఒకరౌండు కొట్టి చూశాడు. తన చొక్కాలు నాలుగూ పత్తా లేవు. బహుశా డ్యూటీలో ఉండి ఉండాలి అని వివరించాడు అప్పారావు.

అఘోరించాయి అని విసుక్కొని పైపై పోతోంది అని చేతకానివాడి శివతాండవం ఒకటి చేశాడు గుర్నాథం.

ఇక లాభం లేదని, పద హోలుదగ్గిరకెళ్దాం ముందు అన్నాడు అప్పారావు.

గేటులో టిక్కెట్టు దొరక్క వచ్చేస్తున్న ఒక సుబ్బారావు కాలరు పట్టుకుని "అవునుగాని ఒరే సుబ్బా—" అనే వరకూ అతను జేబులో రూపాయీ ఇచ్చేసి రెంతే ఉంది బ్రదర్ అని తప్పుకు పారిపోయాడు చొక్కా చేతి మడతలో పది రూపాలకాగితాన్ని పరామర్శించుకుంటూ

ఒక ఉపన్యాసకుడు భూతదయను గూర్చి చెబుతున్నాడు.

"మనం పశుపక్ష్యాదులనే కాదు సూక్ష్మజీవులను కూడ, ఈగలు, చీమలు, వాటిని కూడ బాధించరాదు. ఒక్కచీమను చంపగలంగాని దాన్ని బ్రతికించ గలమా."

ఇంతలో ఆయన మెడమీద చుర్రున కుట్టిన దోమను చెళ్లున చేత్తోకొట్టి నలిపి అవతల పారేశాడు.

ఇంకో పదినిమిషాలలో మరో రెండు రూపాయలు తెచ్చాడు అప్పారావు.

ఎక్కడివిరా అన్నాడు గుర్నాథం. సీత ఇచ్చింది. సీతా? సీత నీకు తెలుసా!' అన్నాడు గుర్నాథం హుషారుగా.

నాకు పరిచయంలేదు. నీకు తెలుసుటగా. నీక్కావాలని చెబితే రెండూఇచ్చి, చాలా అనికూడా అంది పాపం అన్నాడు అప్పారావు వినయంగా.

గుర్నాధం హైజంప్‌లో పోల్ వాల్ట్ రికార్డు బద్దలుకొట్టేసేవాడేగాని అంతలో గేటులో భానుమతిని చూసి, తనసీత తలచుకుని దిగాలుపడి కుంగిపోయి స్తంభంచాటు బెంచిమీద కూలబడిపోయాడు.

అదేవిట్రా అశోకవనంలో సీతామ్మ వారి పోజూ నువ్వూనూ. లే. టికెట్టు కొందాం అన్నాడు అప్పారావు.

అంతలోనే రూపాయిపావలా గేటు దగ్గర కలకలం బయల్దేరి అక్కడి క్యూ దివాలా ఎత్తినవాడి పరువులా చితికి చెల్లా చెదరై పోయింది.

డబ్బున్నవాళ్లూ, భానుమతి కోసం కాక సినిమాకోసం వచ్చేవాళ్ళు పై టిక్కెట్టుకు ఎగబడున్నారు. భానుమతి అలవాటు ప్రకారం చెలికత్తెతో కలిసి రూపాయపద్నాలుగణాల వేపే రాజహంసలా, తారురోడ్డుమీద చెవర్లెకారులా, పట్టుదారంమీద ముత్యంలా, వీణమీద స్వరాలలా, బ్రహ్మదేవుడిదగ్గిర్నించి వరాలలా, సంగీతంలా వెళ్లిపోయి 'టూ ప్లీజ్' అంది.

గుర్నాథం, దిగులు పాటకి ఆర్కెస్ట్రాలా దుఃఖపడ్డాడు. పెద్ద టిక్కెట్లు రెండూ కొనడానికి డబ్బు చాలదు. తను ఒక్కడూ వెళ్ళటానికి ధైర్యంచాలదు.

అయినా కాకపోయినా ఆడపిల్లలు అంగులోనూ చదువుకుంటున్నవాళ్లు నవ్ ఫోర్‌ను కెళ్లడం ఏవిటికలియుగం ఎడ్యుకేషనల్ స్టాండర్డ్లు పడిపోయావంటే పడవు మరీ అన్నాడు అప్పారావు కోపంగా,

ధవ్ నోర్మూయ్. విధవ లెక్చర్లూ నువ్వూను. ఎవడిక్కావాలి నీ శాల్ట్ వీజో లెక్చర్లు అన్నాడు గుర్నాథం శాంతానికి చేతనైనంతవరకు అభినయం పడుతూ.

మనం ఇలా నా స్కాలర్‌షిప్ మీద చర్చించుతే ఇది పూర్తిఅయేలోగానే ఆ టిక్కెట్లుకూడా అయిపోతాయి. భానుమతి సినిమాకి మనం ఇంటికేను. కర్తవ్యం ఆలోచించుము అగ్గునా అన్నాడు అప్పారావు. ఆరుంబావైంది. ఆలోచనకి టైమూ చాలదు. దానికిముందు బుర్రెక్కడుందో జ్ఞాపకం చేసుకు తెచ్చుకోవాలి. ఎలాగూ.

(ఇంకా వుంది.)

# విధి నిర్ణయం

ఎదురుగ్గా సోఫాలో కూచుని, తలవంచుకుని ఒకొక్క ఆకునూ చీల్చుతున్న రమవేపు తదేకదృష్టితో చూస్తున్నాడు విశ్వం. సన్నగా తెల్లగా, పొడుగ్గావున్న ఆవేళ్ళ కదలికకు ముగ్ధుడైపోతున్నాడు. పక్కవాడి అతనిచేతి కందిస్తూ తనవేపే చూస్తున్న భర్తనుచూచి నవ్వుతూ "ఏమిటలా చూస్తున్నారు" అంది రమ.

"నీ అందాన్ని" విశ్వంకూడా నవ్వాడు.

మాట మారుస్తూ "అన్నట్టు ఎల్లుండేనామీ ఢిల్లీ ప్రయాణం...మళ్ళీ ఎప్పుడు తిరిగి రావటం?" తాంబూలపు పళ్ళేన్ని పక్కన పెట్టూ అంది రమ.

"ఆ...ఓ నాలుగురోజులు పడుతుందేమో—ఎంటంటరిగా వుండలేవా?" విశ్వం సన్నగా నవ్వాడు.

"బిక్కుబిక్కుమంటూ గడపాలి ఆ నాలుగురోజులూ" తోడక చేతిలో చీల్చిన తొడిమను గిల్లుతోంది రమ.

విశ్వం అలాగే ఆమెను చూస్తూ వుండిపోయాడు. ఉన్నట్టుండి "పోనీ నువ్వు రాకూడదూ నాతోబాటు...ఢిల్లీ చూసొద్దాం సరదాగా!" ఆమె అభిప్రాయంకోసం ముఖంలోకి చూచాడు విశ్వం.

## పవని నిర్మల ప్రభావతి

తలవని తలంపుగా వచ్చిన ఈ ప్రశ్నకు సమాధానం ఏమివ్వాలో అర్థంకాలేదు రమకు...మనసులో యేదో హాలాహలం రేగింది 'ఢిల్లీ' అనగానే. దాని తాలూకు విషజ్వాల బయటికి రాకుండా అణుచుకోటానికి విశ్వప్రయత్నం చేస్తోం దామె.

సోఫాలోంచి లేచి ఆమె భుజాలమీద చేతులుంచుతూ..."యేం వెడదామా?" అన్నాడు విశ్వం.

అతని ముఖంలో ప్రస్ఫుటంగా ప్రతిఫలించే ఉత్సాహాన్ని చూస్తుంటే-దాన్ని భంగపరిచే సాహసం రాలేదు రమకు.

"మరెక్కడ దిగుదాం?" అర్థరహితంగా అడిగిం దా ప్రశ్న.

విశ్వం గలగల నవ్వాడు.

"ఢిల్లీలో హోటళ్ళన్నీ ఈ మధ్య ఎత్తేశారా అమ్మాయ్?...కాకున్నా ఎక్కడో ఏమిటి మాపిన్ని కూతురూ, నీ చెల్లెలూ అయిన ఇందిరాదేవి—నాకు ప్రాణస్నేహితుడూ, తోడల్లుడూ అయిన మధూ అక్కడేవున్నారుగా. వాళ్ళింట్లో దిగుదాం. దాదాపు మూడేళ్లుగావస్తుంది మధుగాణ్ణి చూసి..." విశ్వం రమపక్కన సోఫాలోకూచున్నాడు.

'ఊఁ' అంది ముక్తసరిగా.

"...భగ్నప్రేమికుణ్నంటూ సన్యాసుల్లో కలసిపోతానని ఒక పేగోల వాడామున్న—ముక్కుకు తాడేసి లాక్కొచ్చి మీ ఇందిర నిచ్చి ముడేయించింది భవదీయుడే..." విశ్వం గర్వంగా చెప్పుకుపోతున్నాడు.

"...ఆ భగ్నప్రేమలూ...బండలూ ఇప్పుడేలాపోయాయో చూడాలి,"

అచేతనంగా వివర్ణమైన ముఖంతో తనకేసి చూస్తున్న రమను చూచి తుళ్ళిపడ్డాడు విశ్వం. "అదేమిటి అలా అయిపోయావ్?" చటుక్కున తనను తాచే సంబాళించుకుంటూ "ఉహూఁ ఏంలేదు. నిద్రొస్తోంది" రమ చివాలున లేచింది. ఆమె హృదయమెంగుకో బరువెక్కిపోయింది.

విశ్వంకూడా లేస్తూ 'అన్నట్టు మనక్కావలసిన సామానంతా రేపు సర్దిపెడ్తావ్ గదూ?...నేను వాడికో వైరిస్తాను మనం వస్తున్నట్టు" అన్నాడు.

"అలాగే!" పడకవేపు నడిచింది భారంగా.

పడుకున్న కాస్సేపట్లోనే విశ్వం గాఢనిద్రలో మునిగిపోయాడు. ఎవలేని హృదయవేదనతో పక్కమీద అటూ ఇటూ దొర్లుతుంది రమ. ఏమిటో, ఊహించినకొద్దీ భయం పుట్టోంది. భగవంతుడు తనను పరీక్షించడానికిగాను ఈ ఢిల్లీ ప్రయాణమనే ఉపద్రవ మొకటి కల్పించలేదుగదా? తప్పించుకోడానికి వీలుగాని సంకట పరిస్థితి ఎదురైందేమిటి? అందులోనూ మధూ వాళ్ళింట్లో దిగాలి...మధు అనగానే మనస్సు వెనక్కువెనక్కు పరుగెత్తింది...ఓనాడు తప్పకుండా అతన్నే వివాహం చేసుకుంటానని కలలు కన్నది తాను...అన్నీ విధి క్రూరచరణాల క్రింద విధ్వంసమైపోయాయి. విశ్వానికి తనకి వివాహమైంది. కొంతవరకూ అది తనఅదృష్టమనే అనుకోవాలి... విశ్వం—మధు...ఈ ఇద్దరూ ప్రాణస్నేహితులని తెలుసు.

## జయ భారతి!

ఎందులకీ కన్నీళ్లు
ఎదలు పొంగి పరవళ్లు?
కరిగిపోని ఒక చరిత్ర-!
గతమెందుకు తలపోత
ఎన్ని బ్రతుకుభారాలకు
ఎన్నిటి మమకారాలకు
తరతరాల గాథలలో
నరనరాల బాధలలో
పొరలివహించింది నేటి
ఉరవడి నీ కలంలోన!
నీ మధురాశ్రువు లన్ని
నీ మది పరవళ్లన్ని
గత చరిత్ర పండిందని
కమ్మని ఫల మిచ్చిందని-
గతం తలచుకొని తరించు-
వర్తమాన ముద్ధరించు-
భావిపథంలో భారత
ప్రణవశ్రుతి నవధరించు,
అద్వైతం అందుకొన్న
అగ్రజుని దూషించకు-
ప్రగతిపేరు చెప్పకొనే
సుగతులనే భూషించకు-
ఇది ఎన్నికలల పంట
కదనమ్ముల జయఘంట!
జీవితకాలాల విలువ
భావిఫలమ్ముల మధురిమ!
ఎందుకిపుడు నీలోనీ
కెందుకులే విచారణ-
స్వతంత్ర కవితాగీతిక
యతిప్రాసలకు పూరణ-
హృదయంలో ఆధ్యాత్మిక
దీపశిఖలు వెలిగించు
సంస్కారానికి నీలో
ఆస్కారం కలిగించు.

— శుభశ్రీ

# విధినిర్ణయం

కంటే ఎక్కువగా ప్రేమించిన రమ! ఇద్దరూ సన్నిహితులే! కానీ ఆ ఇద్దరి సాన్నిధ్యంలో తను వుండలేడేమో! ఇదంతా రమ పన్నాగం కాదు కదా? క్షమాపణ కోరుకుందామనే, సాకుతో ప్రయాణమై రావటం లేదు కదా? ఏమో... ఆడవాళ్ళు ఎంతకైనా తెగుదురు...హూ! విధి నిర్ణయం మరోలా జరిగిపోయి ఇందిర శారీరకంగా తనకు సహచారిణి అయింది... ఊహించలేని విషయాలు కూడా ఒక్కొక్కప్పుడు నిజమై ఊరుకుంటాయి మానవ జీవితంలో! ఎక్కడి ఇందిర...ఎక్కడి రమ... ఇద్దరిలో ఎంతో భేదం...ఇద్దరినడుమా పెద్ద అగాధం..స్నిగ్ధ సుకుమార కోమలత్వాన్ని నింపుకున్న మొగ్గ రమ. సహజ సౌందర్య శోభిత కుసుమం ఇందిర. నీళ్ళలో రాయి పడ్డప్పటి తరంగాల అందం రమది. ప్రశాంతమైన నీటిలో గంభీర నిశ్చలత్వం ఇందిరది. రమ సాన్నిధ్యంలో నరనరాల్లోను రక్తం పొంగుతూ ఉవ్వెత్తుగా నురుగులు క్రక్కుతుంది. ఇందిర ఎదుట అదేరకం ప్రశాంతంగా ప్రవహిస్తుంది..ఏమిటీ వర్ణన ఈరోజు! లోకందృష్టిలో తానూ ఓ గృహస్థు... ఇందిర ఓ గృహిణి: కాని ఇందిరలో రమను తాను చూడలేదు. హృదయమంతా ఇందిర విషయంలో ఖాళీగానే వుంది...బహుశా అది ఈ జన్మకు పూర్తి కాదేమో!

టంగున అరగంట కొట్టి తన పని తాను చూచుకుంటోంది గడియారం. ఉలిక్కిపడి వాచ్ కేసి చూసుకుని చటుక్కున ఏదో స్ఫురించినటయి పెద్దగా కేక పెట్టాడు మధు "ఇందిరా...ఇందిరా!" అంటూ:

తుఫాను గాలికి సుకుమార లతలా కంపించిపోయింది ఇందిర.

ఒంట్లోని శక్తి అంతా కూడగట్టుకు వచ్చి టేబిల్ కు కాస్త దూరంలో నుంచుంది.

టెలిగ్రాం కాగితాన్ని ఆమె చేతికిస్తూ "రేపు ఉదయం పదిగంటలు మెయిల్ కు మీ రమక్కయ్యా, విశ్వం వస్తున్నారట," సూటిగా అతని ముఖంలోకి చూసిఉంటే, అతని పెదవులు వణికిపోవడం బహుశా ఇందిర గమనించేదేమో!

మళ్ళీ పక్కనున్న కాగితాలు సర్దుకోడం మొదలెట్టిన మధును చూచి తనను పిలిచిన పని అయిపోయిందని గ్రహించి కుదుటబడ్డ గుండెతో గబగబ ఇవతలికొచ్చేసింది ఇందిర. అత్యంత ఆత్మీయులు రేపు తన దగ్గరకి రాబోతున్నారనే సంగతి తెలియగానే ఆమెలో ఇన్నాళ్ళుగా అణగారి వున్న ఆవేదన బయటికి పొంగిపోయింది. గబగబ పెంద

# విధినిర్ణయం

## 30

"రేపు వెళ్దాం రమా! నాకు శెలవు అయిపోయింది!" టిఫిన్ తెచ్చిపెట్టి వెళ్ళబోతున్న రమతో అన్నాడు విశ్వం.

వెడుతున్న రమ దగ్గరగా వచ్చి నిలబడింది. మధు లేకపోవటం తన ప్రాణాన్ని కెంత హాయిగావుందో, విశ్వానికంత కష్టంగా వుందనే సంగతి ఆమెకు తెలియకపోలేదు. వచ్చిన రెండు రోజులదాకా భగవంతుడిలాంటి వాతావరణాన్ని సృష్టించినందుకు ఎన్నో విధాల కృతజ్ఞత తెలుపుతుంది కానీ మధ్యాహ్నపు దృశ్యం మాటిమాటికీ కళ్ళముందు కనపడి మనసును గాయపరుస్తోంది. ఇందిర తన ఒళ్ళోవాలిపోయి హృదయ విదారకంగా ఏడుస్తూ మనోవేదనంతా వెళ్ళబోసుకుంది. అది విన్నతర్వాత మధువిషయంలో తానూహించిందంతా అబద్ధమని తేలి మనస్సు క్షుభితం అయిపోయింది.

"నే చేసిన ఏ నేరానికి శిక్ష అక్కయ్యా ఇది...!" అన్న ఇందిరమాటలు చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయ్! ఏమైనా కానీ మధును కలుసుకోవాలి. ఏనకు మార్చాలి. పరోక్షంగా ఇందిరకు తాను చేసిన అన్యాయానికి ప్రతీకారంగా దాని జీవితం బాగు చేయాలి, అనే దృఢనిశ్చయాని కొచ్చింది.

అందుకే విశ్వం వేపు తిరుగ్గా మాస్తూ "ఇందిర మరో నాలుగురోజు లుండమంటోంది..!" అంటూ గొణిగింది.

విశ్వం భగ్గుమన్నాడు. "నాకు లీవ్ లేదని చెప్పటం లేదూ? కావలిస్తే నువ్వుండిరా ఓ పదిరోజులు. నే మాత్రం రేపే వెళ్ళాలి!"

విశ్వానికి కోపం వచ్చిందని తెలిసీ కూడా దృఢంగా అందామె. "సరే! నేమాత్రం ఓ నాలుగురోజుల్లో వస్తాను!"

విశ్వం తలెత్తి చూచాడు. తనవేపు చూచే ధైర్యంలేక తలవంచుకు దోషిలా నిలబడ్డ రమను చూచి జాలేసింది. కోపాన్ని లోపలే అణుచుకుంటూ "నీ ఇష్టం" అన్నాడు.

* * *

విశ్వం వెళ్ళిపోయిన రెండు రోజుల తర్వాత మధు వైజాగ్ నుంచి తిరిగొచ్చాడు. రాగానే ఇందిరతో "మీ అక్కగార్వాళ్ళు వెళ్ళిపోయారా ఇందిరా?" అన్నాడు. అతని కంఠస్వరంలో ఏదో సంతృప్తి వుంది. ఇందిర సమాధానం చెప్పేలోపుగానే రమ అక్కడికి రానే వచ్చింది.

"వారుమాత్రం వెళ్ళిపోయారు!"

మధు స్తబ్ధుడైపోయాడు. రమను చూస్తూ అల్లాగే నిలాబడిపోయాడు. తలవని తలంపుగా లోపులో చిక్కుకున్న సింహంలా గిజగిజ

లాడాను. గృహస్థాశ్రమంలో అడుగెట్టి, పైనబడ్డ బాధ్యతల బరువువల్ల కాబోలు శారీరకంగా చాలామార్పు వచ్చిందామెలో! ఇంతకు ముందామె కళ్ళల్లో ఏదో చిలిపితనం తొణికిసలాడేది. నిండుగా కప్పుకున్న పమిట చెంగుతో ...గంభీర కంఠస్వరం .. ఒకనాటి రమేనా ఈమనిపి అనిపించిందతనికి. అల్లాగే నుల్లప్పగించి తనకేసి చూస్తున్న మధు చూపుల్నుంచి పక్కకు తప్పుకుంటూ మెల్లిగా అందిరమ "అవసరమైన పనులుండి వెళ్ళిపోయారు వారు!"

మధు తానుచేస్తున్న పొరపాటు గుర్తెచ్చుకుని, ఇందిర దృష్టిలో తాను దొంగై పోవడం ఇష్టంలేక, గొంతు పెగుల్చుకుని రమనుద్దేశించి అన్నాడు: "అయ్యో...వెంతాడనుకోలేదు...పోనీ నువ్వైనా వున్నావు ...బహుశా వాడికి బాగా కోపం వచ్చుంటుంది నామీద...!"

తడబడ్తూ, ముచ్చెమటలు పోస్తూ మాట్లాడుతున్న మధు అవస్థచూచి జాలితో గబగబ అవతలికెళ్ళిపోయింది రమ!

ఏమీ తెలీని ఇందిర, రమను వెంబడించింది.

* * *

సన్నగా తలుపుతట్టిన చప్పుడు విని ... ఆలోచనా వాహినికి అడ్డకట్ట వేసి...గబగబ వెళ్ళి తలుపుతీసి నిశ్చేష్టుడయాడు మధు.

మెల్లగా లోపలికివస్తూ "నీతో కాస్సేపు మాట్లాడుదామని వచ్చాను మధూ! అయిపోగానే వెళ్ళిపోతాను:"

ఆ మాటనుంచి మధు తేరుకోకముందే మంచానికి కొంత దూరంలో వున్న కుర్చీలో పోయి కూర్చుని దృఢంగా అంది రమ. "ఈ సమయంలో నిన్నూ నన్నూ, ఇలా చూస్తే ఎవరేనా...అందులోనూ ముఖ్యంగా ఇందిర ఏమనుకుంటుందోననే సందేహం నీలో వుంది కదూ మధూ! ఆ ప్రమాదమేమీ లేదులే... నిద్ర రాలేదంటుంటే స్లీపింగ్ టాబ్లెట్స్ రెండు ఇచ్చి నిద్రపుచ్చి మరీవచ్చాను...ఇక రేపు వుదయందాకా లేపినా లేవదు...ఇంకెవ్వరూ ఇంట్లో లేరు...సరేనా?" రమ అస్వాభావికంగా నవ్వింది.

మధుమనసు కొంత తేలికపడ్డా, ఏదో అర్థంకాని బాధ అతని హృదయంలో రేగింది. లైట్ వేసే ఉద్దేశ్యంతో స్విచ్ బోర్డుకేసి నడిచాడు.

"వద్దు మధూ ఎక్కువ లైట్ భరించలేను...!"

సన్నగా వెలుగుతూన్న ట్రాన్స్‌ఫారమ్ బల్బు కాంతిలో హుందాగా...తన జన్మహక్కు అన్నట్టుగా ఏలాటి సందేహమూ లేకుండా కూచుని వున్న ఆ ఉద్వేగపూరిత మూర్తిని చూస్తూ...ఆశ్చర్యంగా వచ్చి మంచంమీద కూచున్నాడు మధు. కొద్ది క్షణాలు ఇద్దరి నోటివెంట మాటలు రాలేదు. చివరకు ఆ భయంకర నిశ్శబ్దాన్ని చీలుస్తూ రమ అంది. "మధూ! నన్ను క్షమించమని అడగటానిక్కూడా నోరు రావటంలేదు నాకు. ఆనాడు, అంటే మన ఇద్దరి జీవిత గమనాల్ని మార్చివేసిన ఆనాటి పరిస్థితులు—నా నిస్సహాయస్థితి చెప్పినా, నువ్వు నమ్మవు...!" రమ పేలీకగా, ఆవేదనా పూరిత నయనాలతో అతనివేపు చూచింది.

అతనేమీ తొణకలేదు. నిశ్చలంగా ఆమెవేపు చూస్తున్నాడు. దోషిలా తలవంచుకుని మళ్ళీ మొదలెట్టింది రమ. "అమ్మా, నాన్నగారు విషంపుచ్చుకుని ఎదురుగా నిలబడ్డారు." అన్నయ్య మీ వంశంలో క్షయతో చనిపోయినవాళ్ళ లిస్టు చెపుతూ వచ్చాడు... దానికితోడు నీదగ్గర్నుంచి షుమారు రెండు నెలలుగా వుత్తరాలు రాలేదు..." రమ మాటలు మధ్యలోనే తుంచి హేళనగా,

"ఊఁ నువ్వూ ఓ పాయిజన్ బాటిల్ పుచ్చుకోలేకపోయావ్ ... మీ నాన్న డాక్టరేకదూ?"

అతని వ్యంగ్యపు మాటలకు ఉండేలు దెబ్బతిన్న పక్షిలా గిలగిలలాడింది.

"మధూ నువ్వూ అలాగే అంటున్నావా?" ఆక్రోశిస్తున్న ఆమె హృదయం ఒక్కసారిగా ఉద్రిక్తతచెంది తక్కున పక్కనున్న అతని చెయ్యి పట్టుకోబోయింది. పరిస్థితి ఊహించిన మధు తనచెయ్యి వెనక్కు లాక్కుంటూ కృత్రిమంగా నవ్వాడు.

"...మన మిప్పుడు పరాయివాళ్ళం రమా! జ్ఞప్తికి తెచ్చుకో!"

అవమానంతో, ఆత్మాభిమానంతో, తాను చేసిన పిచ్చిపనికి నిందించుకుంటూ, వాటన్నిటి తాలూకు అగ్నిని లోపలే అణుచుకుని తలవంచుకుని అన్నదామె! "నిజంగా నే తాత్కాలికంగా మర్చిపోయాను మధూ! పోనీలే! నేనూ విషంపుచ్చుకుందామనే అనుకున్నాను కానీ, ఏనాడైనా సరే ఈజన్మలో నిన్ను చూచి క్షమాపణ వేడుకుందామనే ఆశతో ఆ పని చెయ్యలేదు...పెళ్ళయిన తర్వాత తెలిసింది...నాకు నీ దగ్గర్నుంచి ఉత్తరాలు రాని ఆరెన్నెల్లూ నువు టి. బి. హాస్పిటల్లో వున్నావని!" అందాకా పొగిలి పోతున్న ఆమెహృదయం బద్దలయిందా అనిపించింది మధుకు.

కుర్చీలో అల్లాగే వెనక్కువాలి ముఖాన పమిటె కప్పుకుని ఏడుపు ఆపుకోవాలని వ్యర్థ ప్రయత్నం చేస్తోంది.

ఏదో అర్థంకాని బాధతో ఆమెను నొప్పించాననే సంగతి గ్రహించి చప్పున మంచందిగి దగ్గరకు వచ్చాడు మధు... మెల్లిగా ముఖాని కడ్డ తొలగించి, కన్నీళ్ళు తుడుస్తూ బాధగా "చూడు రమా! మిథ్యాభిమానంతో నీ మనసు నొప్పించాను...ఏడవకు రమా! నే భరించలేను!" అతని కళ్ళు కూడా చెమ్మగిలటం నీళ్ళునిండిన కళ్ళతో చూచింది రమ. చప్పున సరిగా కూచుంటూ "నువ్వలా మంచంమీద కూచో మధూ!" తానిందాక చేసిన పనికి నొచ్చుకుంటూ మెల్లగా వెళ్ళి మంచంమీద కూచున్నాడు మధు.

"విశ్వం నిన్ను బాగా చూస్తున్నాడా రమా!" చాలాసేపు మౌనం తర్వాత లేని ఉత్సాహాన్ని తెచ్చుకుంటూ అడిగాడు మధు.

"ఆ! చాలా బాగా చూస్తారు...! అన్నట్టు మధూ విధికి బానిసలం మనం. ఇప్పుడు చేయగలిగిందేమీలేదు. నే చేసిన నేరానికి వారెందుకు శిక్షనుభవించాలి. అందువల్లే వారినిగూడా నే సొంతగానే ప్రేమిస్తున్నాను!" రమ బరువుగా నిట్టూర్పు వదిలింది. రాతిబొమ్మలా ఆమెవేపే చూస్తున్నాడతను.

"నేనీరాత్రి ఇలా నీ దగ్గరకొచ్చింది ఎందుకో తెలుసా?"

"తెలియదు" అన్నాడు ఆశ్చర్యంగా మధు.

"వినుమధూ! విధి నిర్ణయం ప్రకారం మనిద్దరి జీవితాలూ ఈ జన్మకు సమాంతర రేఖలుగానే నిలిచిపోయాయి. మనిద్దరమూ కూడా శారీరకంగా మరొకళ్ళతో జీవితంలో బంధించబడ్డాము. కానీ ఆ ఆక్రోశంతో అవతలివాళ్ళ మనసుల్ని ఆక్రందింపచేస్తే... మన బ్రతుకు లెటూ బాగుపడవు...ఏమిటో మాట్లాడుతున్నా ననుకుంటున్నావ గాదూ?" ఉపహాసంచేస్తూ "రచయిత్రివికదూ? కొత్త మామూలుభావవాదుదూ నీ పుణ్యం వుంటుంది!" అన్నాడు మధు.

రమ గంభీరంగా ముఖంపెట్టి "నీకు తమాషాగానే వుంటాయ్ నా మాటలు... పోనీ నీయిష్టం. మొదట విను...ఒక్కసారి ఇందిరను పరకాయించి చూడు మధూ! ఎలావుందో! పెళ్ళయిన ఈ సంవత్సరం రోజుల్లో అది ఏమానందం అనుభవించింది? ఎంతగా కుమిలిపోతోంది. అదిచేసినతప్పేమి చెప్పు? నీలో ఓ గురభిప్రాయం వుంది... ఆడవాళ్ళకు ఆడంబరాలకంటే మరేం అక్కర్లేదని...అందుకనే దాని విషయంలో అతిశ్రద్ధగా అన్నీ అమర్చి హృదయాన్ని ప్రేమనూ మాత్రం నీ దగ్గర పదిలపరచుకున్నావ్! మధూ మనస్ఫూర్తిగా నే కోరే కోరిక ఒక్కటే! ఇందిరను ప్రేమించు. ఏనాడైనా నీ ఆదరణా అనురాగమూ లభిస్తాయనే ఆశతో శూన్యంలో చేతులు చాపుకు కూచున్న ఇందిరకు నీహృదయానికి దగ్గరగా రాగల అవకాశాన్ని ఇవ్వు మధూ... దాని ఆనందంలో నువ్వూ సంతృప్తి చెందటం అభ్యాసం చేసుకో...ఇదే మధూ నేకోరేది...

# విధి నిర్ణయం

నీనుంచి వేరుచేసే శక్తి ఇదొక్కటే మధూ!" అందామె ఉద్రిక్తంగా చెబుతున్న ఆమె కంఠం ఆర్ద్రమైపోయింది. కళ్ళనుంచి అశ్రుధారలు ప్రవాహం కట్టాయి:

సాటిస్త్రీకోసం ఆమెపడే ఆవేదనా, తన సుఖ ప్రేమను అణుచుకోవాలని చూచే ఆమె అభిమానమూ చూస్తూ మధు నివ్వెరపోయాడు. కంపించిపోతున్న రమ వేపు జాలిగా చూస్తూ బరువుగా "చూడురమా! నిజంగా ఇదే కనుక నీకోరికైతే తప్పక నెరవేరుస్తాను...సరేనా?" అతని కంఠం పట్టుకుపోయింది.

అంతదుఃఖంలోనూ, చిరునవ్వునవ్వుతూ "నాకు తెలుసు మధూ... నే చెబితే నువ్వు కాదనవు...సరే వచ్చిన పని అయిపోయింది. నే రేపు వెళ్ళిపోతాను...వారెంతో అవస్థ పడుతుంటారు!"

"నిజంగా రేపే వెళ్ళిపోతావా రమా!" హృదయంలోని ఆవేశమేదో నరనరాల్లో నిండి చటుక్కున మంచం దిగి రెండడుగులు వేశాడు మధు.

ఒక్క ఉరుకున కుర్చీలోంచి లేచి గది గుమ్మందాకా వెళ్ళి నిల్చుని మధు వేపు చూస్తూ నిశ్చలంగా అందిరమ "ఈ రాత్రి మనిద్దరి జీవితాల్లో మరుపురాని రాత్రి...దీనిని మలినపరచాలని ప్రయత్నించకు మధూ! జీవిత గమనాలే మారుతున్నాయి మనవి ఈ రోజునుంచి...ఉద్రేకపడబోకు, విధి నిర్ణయించిన బాటల్లో...బాటసారుల్లా-స్నేహితుల్లా హాయిగా ముందుకు సాగిపోదాం... నాకిచ్చినమాట నిలబెట్టుకుంటావు కదూ...!" గబగబ సాగిపోతున్న ఆమె పదన్యాసాలు వింటూ జడునిలా జీవచ్ఛవంలా కూర్చుండిపోయాడతడు మంచం మీద."

* * *

సిగ్నల్ ఇచ్చారు. ఇందిర, మధు కిందకు దిగారు. కంపార్టుమెంటులో రమ, దూరాన బెర్త్ మీద మరో యిద్దరు బెంగాలీ యువతులూ తప్ప మరెవ్వరూ లేరు.

"ఇదో ఈ లెటర్ మాత్రం విశ్వానికివ్వు రమా! వాడికి బాగా కోపమొచ్చి ఉంటుంది. అది పోగొట్టడానికి మా దంపతులం వస్తాంలే...!" మధు హుషారుగా ఇందిర వేపు చూచాడు.

భర్త ప్రవర్తనలో ఉదయం నుంచి అర్థంకాని మార్పును చూచి ఉక్కిరిబిక్కిరౌతున్న ఇందిర ఆచూపును తట్టుకోలేక తలవంచుకుంది మౌనంగా ఆ మార్పును గమనిస్తున్న రమ మనసు తేలిక పడింది.

(54-వ పేజీ చూడండి)

# కార్టూన్ పోటీలో గెలిచిన చిత్రం

[బహుమతి: రు. 12/—]




మీ ఛాతీ 60″ ఉందేమిటండీ!!!!?

చిత్రకారుడు: బి. వి. ఎస్. మూర్తి (రామచంద్రపురం)

## కార్టూన్ పోటీ నిబంధనలు:

1. కార్టూన్‌లను ఇండియన్ ఇంక్‌తో మాత్రమే డ్రాయింగ్ పేపరుమీదనే వేసి పంపాలి.

2. చిత్రం 10″ × 8″ సైజుకి మించకూడదు.

3. ప్రతి చిత్రానికి వెనుక భాగాన "కార్టూన్ పోటీ శీర్షికకు" అని వ్రాసి, చిత్రకారుని పూర్తి చిరునామా వ్రాయాలి.

4. కార్టూన్‌లోని విషయము, లేఖనము స్వతంత్రమైనవై ఉండాలి.

5. సాధారణంగా తెలుగు జీవితానికి, వాతావరణానికి సంబంధించిన విషయమే తీసుకుని వ్యంగ్య చిత్రం వేయాలి.

6. వ్యాఖ్యానం(కాప్షన్) లేని చిత్రాలయితే మంచిది. వ్యాఖ్యానం అవసరమైతే ఒకటి, రెండు పంక్తులకుమించకూడదు

7. ఈ శీర్షికపై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. నిరాకరించిన వాటిని తిప్పిపంపగోరేవారుతగిన స్టాంపులు పంపాలి.

8. ఒక్కొక్క చిత్రకారుడు ఎన్ని చిత్రాలయినా పంపవచ్చు. ప్రవేశరుసుము లేదు. బహుమతుల నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం.

9. ఈశీర్షికను చిత్రకారుల ఉత్సాహాన్నిబట్టి, చిత్రాలస్థాయినిబట్టి వారం వారంగాని, రెండువారాలకొకసారిగాని ప్రచురిస్తాము.

10. బహుమతిపొందని చిత్రాలలో ప్రచురణార్హమైన వాటిని మామూలు పారితోషికంతో ప్రచురిస్తూ ఉంటాము.




# కమలం - కనకం

మా మేనమామ కూతురు కమలా కుమారిని చనువుకల్ల నేను "కమలం" అని పిలుస్తాను. ఆమెతో నేనీ పల్లెటూరు రావడంవల్ల ఇక్కడి ప్రజలు మా గురించి ఏమనుకుంటారో నేను ముందే ఊహించకపోలేదు. నేనా అవివాహితుడిని. వయస్సులో ఉన్నవాడిని. ఆమె వితంతువు. పదహారు దగ్గర నుంచి నలభైలోపు ఆమె కెన్నేళ్లుంటాయో ఎవ్వరూ చెప్పలేరు.

మనిషి పీలగా, పొట్టిగా పసిమి కలిసిన చామనచాయలో ఉంటుంది. ముఖం నిండు చంద్రబింబం అని చెప్పడం నీచోపమానం లేవనే. జాబిలికింత సొగసైన కళ్ళేవి? ఆ ఎర్రని పెదవి ఏదీ? స్నానంచేసి జుత్తు ఆరబెట్టుకుంటున్నప్పుడామెని చూడాలి— బంగారు సూర్యోదయాన్ని కప్పిన చెట్లగుంపు సౌందర్యం ఏం గొప్ప అనిపిస్తుంది.

అలాంటి దేవత యీ బడిపంతులు కొంపలో వెన్నెలలా ప్రవేశించడం, పల్లె ప్రజలకి అసూయ కలిగిస్తుందని నాకు తెలుసు.

కాని కమలం లేకుండా నే బతకలేను— బతకలేనంటే కవిగా జీవించలేనన్నమాట. ఆమెకూడా పాత జీవితాన్ని భరించలేక నే నా సంరక్షణభారాన్ని వహించడానికి నా వెంట వచ్చింది.

* * *

కమలానికి నా చిన్నతనంలోనే పెళ్లయింది. తన యీ పెద్దకుమార్తె పెళ్ళిమాత్రం చూసి మా మామయ్య గతించాడు.

ఆ తర్వాతకూడా నేను మా మేనమామ వూరు తరచు వెళ్తూ ఉండేవాణ్ణి- సెలవుల్లో. కమలాన్ని అవూరే యిచ్చారు గనక నేను ఆమెని చూడకుండా ఆమె చేతివంట తినకుండా ఎన్నడూ రాలేకపోయేవాణ్ణి.

పువ్వుల సౌరభం, ప్రభాతపు సౌందర్యం కోకిల పాట— అన్నీ కలిసి కమలం రూపంలో ఆ యింటికి వచ్చాయా అనిపిస్తుంది నాకు. చమత్కారంగా, సరదాగా మాట్లాడుతూ నవ్విస్తూ వుంటుంది అందరినీ. ఆమె ఛలోక్తులాడుతూనే నవ్వుతూ వుంటుంది. ఆమాటలు ఆ నవ్వూ కలిసి జలతరంగిణి వాయిద్యంలా వినవస్తూ హృదయాన్ని పరవశించేలా చేస్తాయి.

కాని భగవంతుడి ఆలోచనలు చిత్రమైనవి అర్థంకావు.

ఈ పుత్తడి బొమ్మని మూడో పెళ్ళి అతనికి కట్టబెట్టారు. అతనికి బోదకాలు. తరచు జ్వరం. అప్పుడు భర్తకు ఉపచారాలు చేసే కమలాన్ని చూసి నాకళ్ళు చెమ్మగిల్లేవి. అతనెంత అదృష్టవంతుడో అని యీర్ష్య కలిగేది. కాని కళ్ళల్లో ఆపడుచు భార్యపట్ల కృతజ్ఞతతో కూడిన ప్రేమ తొణికిసలాడేది. నిదర్శనంగా కోరకుండానే నగలూ, చీరలూ ఆమె కాళ్ళదగ్గర కురిపించేసేవాడు.

ఆ రోజుల్లో కమలం నిండుగా పసుపు రాసుకుని పెద్దబొట్టుపెట్టుకునేది. భోజనానంతరం పాన్‌దాన్ దగ్గర పెట్టుకుని తాంబూలం వేసుకుంటూ చేరిన యిరుగు పొరుగు వారితో కబుర్లు ఆడుతూండేది.

ఆ సంసారంలో భార్యాభర్త లెన్నడూ మాటామాటా అనుకోలేదు. భర్తకి కావలసిన వన్నీ కమలం అమర్చిపెట్టేది. ధనవంతులు కాకపోయినా యింట్లో దేనికీ లోటులేదు.

# ★ కమలం-కనకం ★

పిల్లలాలేరు. చుట్టుపట్లవారికి వీరిదొక ఆదర్శ సంసారంలా కనిపించేది.

కాని నాకు మట్టుకు అనుమానంగానే వుండేది. ఆమె గాజులు మొదలయిన పుణ్య స్త్రీల అలంకరణాలపట్ల అమిత శ్రద్ధ చూపించేది. తన అయిదువతనం బాగుందన్న తృప్తి తప్ప దాంపత్యజీవితంలో ఇంకోసుఖం ఎరగదేమో. ఆ రోజుల్లోనే ఆమెకి హిస్టీరియాకూడాను. పూజలూ, వ్రతాలూ, చేయడమూ, రామకోటి వ్రాయడమూ చూసి కమలానికి అంత లేతయీడున కలిగిన భక్తి శ్రద్ధలకి మెచ్చుకునేవారు అంతా.

కాని ఆమె బాహ్యజీవితంలోని యీ ప్రశాంతతఅయినా ఎంతోకాలం నిలవలేదు.

ఆమెభర్త మరణించడంతోనే ఆమె జీవితం రైలులోని మొదటితరగతి పెట్టెలోనుంచి మూడోతరగతి పెట్టెలోనికి మారవలసి వచ్చింది.

తర్వాత కమలాన్ని మొదటిసారి ఆమె అన్న రమాకాంత్ యింట్లో చూశాను. బొట్టూ, మెడలో గొలుసూ, బంగారపు గాజులూ, తెల్ల వాయిల్ చీర ఉండనే వున్నాయి. కాని 'నాటికీ నేటికీ ఎంత భేదం భగవాన్!' అనుకోకుండా ఉండలేకపోయినా.

'ఆనాడు సృష్టిలోని అందమైన రంగులన్నీ ఏరి నీపనివాడితనాన్ని చాటుకోడానికి ఆమెని రూపొందించావా' అనిపించింది.

ఈవాడో?—తనకి తగనివాణ్ణి వలచిందని దేవేంద్రుడు భూలోకానికి పొమ్మని శపించగా జాలిగొలిపే ఆకృతితో తెలిమబ్బులగుండా వస్తున్న అప్సరసలా కనిపిస్తోందిప్పుడు.

సెలవులయిపోతున్నందువల్ల—నౌకరీచేసుకుంటున్నవాణ్ణి కాబట్టి—వెంటనే బయలుదేరి తిరిగి పల్లెకి రావలసినవాణ్ణి అయాను. మునుపు ఎన్నోసార్లు కమలాన్ని చూశాను. కాని యీసారిమాత్రం కమలం ముద్ర నా మనస్సులో చెరగనిరీతిని పడింది.

మంచుబిందువులు జలజలరాల్చే చెట్లని చూసినా, పొగమంచు కప్పిన చంద్రబింబాన్ని తిలకించినా, అర్ధరాత్రి కోకిల జాలిగొలిపే స్వరంవిన్నా ఆమెరూపే నా కళ్ళముందు, ఆమెమాటే నా చెవుల్లో...

వారాల ఆగిపోయింది.

*   *   *

కుర్రాళ్లతో ఒకసారి బెజవాడ విజ్ఞాన యాత్రకని వెళ్ళాను. అక్కడే మా మేనమామ రెండోకూతురు లచ్చుకూడా వుంటోంది. చూసివద్దామని బయలుదేరాను.

దానికి ఈ మధ్యనే ఒక కొడుకుకూడానుట్ట

నడవలో అడుగు పెట్టగానే 'విద్దం చెయ్యమ్మా విద్దం, విద్దం...' అని పిల్లవాడి రెండు చేతులూ పట్టుకుని ఆడిస్తోంది కమలం.

'నువ్విక్కడికి ఎప్పుడొచ్చావక్కయ్యా?' అని పలకరించాను.

'నన్ను చూడగానే కమలంముఖంలో దాచుకోలేని సంతోషం పసికట్టాను. 'ఓహో నువ్వా? నేనిక్కడికొచ్చి అవుతుంది అయిదారు నెలలు. లచ్చా! సూర్యం వచ్చాడే. అలా కూర్చో,' అంటూ మంచం వాల్చింది:

కుర్రాడు ఎత్తుకోమని కాబోలు ఏడుస్తూ కమలం కాళ్ళలో పడ్డాడు.

పచ్చడి రుబ్బుతున్న లచ్చు ఆ చేత్తోనే పరుగెత్తుకొచ్చింది. 'ఏమిటి బావా, దారి తప్పావా? కులాసా?' అంది ఆదరం ఒలకబోస్తూ.

కమల పసివాణ్ణి ఎత్తుకుంటూ 'ఇదీ వరస వీడు అన్నందగ్గరనుంచీ నేను కలిపి పెట్టవలసిందేగాని వాళ్ళమ్మ దగ్గరకి వెళ్ళడు, అంత చనువు అయిపోయింది నా దగ్గర.'

'ఎవర్రా చిట్టీ వచ్చారు?' అని దూరం నుంచే విని మురిసిపోదామనుకుంది అసలు తల్లి.

చిట్టి ఇంతలేసి కళ్లు చేసుకుని అతిథిని పరికించసాగాడు.

'మావయ్య...ఎవరూ...మావయ్య.'

కాని కుర్రాడు అమ్మ అధ్యాపకత్వాన్ని అంగీకరించేటట్టులేడు. నోటిని పాకచెక్కగానే వుంచాడు.

'బావ వూళ్లోలేరా ఏమిటి లచ్చా,' అనడిగాను.

'నిన్ననే భూములు చూడ్డానికి వెళ్లారు. ఆ రైతులు నిరుటి బకాయేవైనా జమ కడతారేమోనని ఆయన ఆశ. జీతం రాళ్ళుచాలక ఎన్ని తంటాలయినా పడుతున్నారనుకో...' అని మొదలెట్టింది లచ్చు.

'ఏం సూర్యం, ఆ వూళ్లో హోటలుకూడా లేదని విన్నానే. చేతులు కాల్చుకోవడ లేదా? మనిషిని చూస్తేనే తెలుస్తోంది.'

కమలం ఆ మాటల్లో నా పట్ల ప్రేమతో గూడిన జాలి కనబడింది. తల్లీ తండ్రీ పోయిన దౌర్భాగ్యుణ్ణి. ఎన్నాళ్ళ కిందటో విన్న తియ్యటిపాట రికార్డు మళ్ళీ పెట్టినట్టు అనిపించింది.

'లేస్నానానికి. బెజవాడలో దిగగానే ఎంతమజా తెలిసినట్టుంది నీకు,' అంది కమలం నవ్వుతూ.

'నా సంచి ఏది చెప్మా.'

'ఇదేమిటీ మంచంకింద.' అని కమలమే

పామాలివ్ సౌందర్య రక్షణ

# మీ దేహకాంతికి క్రొత్త శోభనిస్తుంది!






**మీ దేహకాంతికి క్రొత్త శోభను చేకూర్చుకోగలరు. పామాలివ్ సౌందర్య రక్షణతో దానిని ఎంతో మృదువుగా, తాజాగా ఉంచుకోండి.**

పామాలివ్ సబ్బుతో మీరు మొట్టమొదటి సారి శోముకొంటే అది చర్మమును శుభ్రపరుస్తూనే దానిని మనోహరముగా చేసినట్లు చూస్తారు. భారతదేశపు అపూర్వమగు సౌందర్య పోషక తైలములు చేసిన పామాలివ్ సబ్బు ఎంతో సౌమ్యమైనది మరియు శుద్ధమైనది. దాని సమృద్ధియగు మీగడవంటి నురుగు దేహమును నిర్మలముగా చేసి మీకు క్రొత్త శోభను చేకూరుస్తుంది. పామాలివ్ సబ్బును వాడితే మీ చర్మము మృదువుగా, యవ్వనవంతముగ మరియు సొగసుగా అగుట చూస్తారు.

**పూర్తిగా సౌందర్యముగా కనపడుటకు పామాలివ్ సబ్బుతో స్నానము చేయండి!**

PMO.Q.15QT T

# కమలం-కనకం

వంచి బయటికిలాగి తువ్వాల్లో అవీ అందించింది.

'వెధవది ఇంటిదగ్గరయితే ఏ వస్తువయినా వెతుక్కోలేక చస్తున్నా ననుకో.'

'పోని ఇదికి చొక్కా తొడుక్కోవడం మరిచిపోయి వెళ్ళకుంటే చాలులే.' అని నవ్వింది కమలం.

అతి ఉత్సాహంలో ఎంతసేపు నవ్వుకున్నానో నాకే తెలియలేదు.

* * *

లచ్చువదిన..భోజనం అయిందనిపించుకుని వచ్చి పరుపుమీద నడుం వాల్చాను కాని భుక్తాయాసం బాధగాని కునుకుగాని లేదు. ఏమిటో లచ్చు యింతగా మారిపోయింది. ఎత్తు మడమల జోడు దగ్గరనుంచి తలనూనెల దాకా ప్రతీవస్తువుకోసం బోలెడు డబ్బు ఖర్చు పెట్టించే హైక్లాసుపిల్ల లచ్చు వేరూ, గొప్పకిపోయో, మర్యాదకోసమో అయినా నాకు శుభ్రంగా తిండిపెట్టక కొసరి కొసరి అయినా వడ్డించినలచ్చు వేరూనా! అసలు కమలం ఎలా ఉండగలుగుతోంది ఇక్కడ!

సున్నితమైన శబ్దం-పూరీలు ఒత్తుతున్న కమలం బంగారపుగాజుల చిరుసవ్వడి అది-వినవస్తూవుంటే లేచి వంటింట్లోకి వెళ్ళాను. పీట వాల్చుకు కూర్చుంటూ ఉంటే కమలం చిరునవ్వు నవ్వింది.

'ఏం సూర్యం అప్పుడే ఆకలేస్తోందా?'

'ఛా. ఇప్పుడేగా అన్నంతిన్నది?' అన్నాను.

'పోనీ తిన్నట్టు జ్ఞాపకం ఉందిగద. లచ్చువడ్డిస్తే తిన్నట్టే. అయినా ఇంకా మూకుడయినా కుంపటిమీద కెక్కించందే నువ్వొచ్చి కూర్చుంటే నేనేం పెట్టేది నీకు?'

'నీ తియ్యటి కబుర్లు రెండు పెడితే చాలదా కమలం?'

కమలం ఆనందంతో ఉక్కిరిబిక్కిరయినట్టుంది. అన్నం ఎరగనివాడు పాయసం పుచ్చుకున్నట్టు.

'నువ్విక్కడెందుకుంటున్నావు కమలం మీ అన్నయ్య దగ్గరనుంచి వచ్చేసి?' అనడిగాను ఆమె ఎంత సుఖానికి అలవాటు పడిందో తెలిసిన నేను.

కమలం నవ్వి పనిలో ఉంది.

'ఏం అక్కడికూడా ఇలాగే వుందా?' అని తిరిగి ప్రశ్నించాను. నా ఆదుర్దా ఆమె ఏమనుకుంటుందో అన్న సంశయానికి తావివ్వలేదు.

'ఎలా వుంటేనేం? తిండికా, ఏంతిన్నా పోయింది. మనసిచ్చి మాట్లాడేవాళ్ళే లేరు

గాని. చిట్టినయం ఒక్క క్షణం వదలదు నన్ను," అని పొడిగా నవ్వింది కమలం.

'ఏం కమలం నువ్వెవరికి ఏం బరువయ్యావనీ? ఏ యింట్లో కాలుపెట్టినా చెమ్మ కొంపలో కొచ్చిన సూర్యకిరణంలా ఉత్సాహంతో నింపేస్తావుగదా'

కమలం శ్రీమంతురాలు. నే నిచ్చకాలు ఆడుతున్నాననే అపోహ ఆమెకి కలగదనే నమ్మకం ఉండబట్టే, విలువని మెచ్చుకునే స్వభావంగల నా నాలుకకి స్వతంత్రం యిచ్చేశాను.

పద్యాల రాతలోపడి అంతకంతకి మరీ పసివాడివై పోతున్నావేమిటి సూర్యం. ఈ రోజుల్లో మనిషివిలువ ఎవరు చూస్తారు,' అని జవాబిచ్చింది కమలం.

నాకు తెలుసు-"సర్వే గుణాః కాంచన మాశ్రయన్తి" కాని నీకు అదీ వుందిగా.

'ఏటా నాలుగువందల శిస్తు వస్తూంటే అన్నయ్య చేతిలోనే పోస్తున్నాను. ఏదో నా తిండికూడా చూస్తున్నాడు గదా అని. లచ్చుకొడుక్కి జబ్బుచేస్తే ఆమధ్య యిక్కడికి వొచ్చాను. ఈయేడు నాశిస్తులు వసూలు కాలేదు. "నువ్వు లచ్చుదగ్గరే ఉంటావు గదూ?" అని అన్నయ్య ఉత్తరం రాశాడు. "ఈ జీతంలో ఇంకా ఏడాదిపాటు ఇంకో మనిషిని పోషించడం మాటలా?" అని లచ్చు ముఖంమీదే అనేసింది. అన్నయ్య ఇక్కడికి వొచ్చాడు. వాడూ లచ్చూ వీధినబడి పోట్లాడుకుంటూవుంటే సిగ్గుతో చచ్చిపోయి ఏడ్చాననుకో. నాడబ్బు ఇంతో అంతో బేంక్‌లో ఉండికూడా ఆయన వెళ్లిపోయినతర్వాత, నా జానెడు పొట్ట ఎంత మందికి బరువై పోయిందో చూడు, అంటూ కమలం నేతిలో పూరీలు వేయసాగింది.

కమలం తనచరిత్ర చెప్పేతీరు చూస్తే, ఎన్నాళ్లనుంచో తనయీకథని వినే ఆత్మీయుడొకడికోసం ఆమె ఎదురుచూస్తూ వుందేమో అనిపించింది.

సెయిన్‌లెస్ స్టీలుపళ్ళెంలో పూరీల దొంతి, కూరా ఉంచి నా ముందుంచింది.

ఒరిబాబు, ఇన్ని పడేశావేంటి?'

'ఆ ఆవేపాటి' అని తనపని చేసుకో సాగింది.

నేను నోరు మూసుకుని తినసాగాను.

'తిండీతిప్పలూ మానేసిమనిషికోసమైనా పెళ్ళిచేసుకో' అన్నది ఉపోద్ఘాతం ఏం లేకుండానే.

'ఎందుకు చేసుకోను. నన్ను ఇన్‌స్పయిర్ చెయ్యగల, అంటే—' పూరీగొంతుదిగనిచ్చి 'అంటే నాలో కవితాశక్తిని విజృంభింప చెయ్యగల స్త్రీ దొరికితే' అన్నాను.

కమల నవ్వింది. 'దొరుకుతుందిలే నాలా వంటయ్యాపడి దగ్గరపడేనదో, పదేళ్లయినా నిండని పసిపిల్లో.'

నాకు ఆశ్చర్యం వేసింది. కవిని ఉత్తేజపరచగల స్త్రీలు ప్రౌఢాంగనలూ, ముగ్ధబాలికలే అని నా భావనకూడా కావడమే నా ఆశ్చర్యానికి కారణం. పసిపిల్లలో పువ్వు సౌందర్యం, సౌకుమార్యం ఉన్నాయి. ప్రౌఢస్త్రీలో ఫలం ప్రశాంతతా, మాధుర్యమూ వున్నాయి. యువతిలో మిడిసిపాటు ఉంది. ఆమెకవి చంపకాన్ని చేరనొల్లని జుమ్మని గర్వంగా తిరిగే తుమ్మెదలాటిది. మొత్తంమీద నాలోనివాడికి యువతులంటే అంతయిష్టం లేదు.

నాకువద్దనే అవకాశం యివ్వక పూరీలని తెగతినిపించింది. ఇపుడాశ్చర్యం వేస్తుంది తల్చుకుంటే:—అన్ని ఎలా తినగలిగానా? అని 'తల్లి ప్రేమ, తల్లి ప్రేమ' అంటారే అది యింత ఉత్కృష్టంగా ఉంటుందా? అని ప్రశ్నించుకున్నాను తల్లినే ఎరగని నేను.

సాయంకాలం బండికివచ్చేశాం. రైల్లో మళ్ళీ చాలా కాలానికి ఒక చక్కని భావం స్ఫురించింది. కవిని ఎడారిలో ఒంటరిగా ప్రయాణిస్తున్న యాత్రికుడితో పోల్చాలి. దాహంతో బాధపడి ఎంతోదూరం వెళ్లగా వెళ్లగా నీటిమడుగు కనబడినప్పుడు అతని ఆనందం. ఈ భావంతో చక్కని ఖండకావ్యం రాయాలి. నేనుకాదు సరస్వతిదేవే వ్రాసేస్తుందేమో, అనిపించింది. నాకే తెలియని, ఆ ఉత్సాహంలో ఆవిరాగపు బాధలో.

* * *

దూరంగానైనా సరే, తన బాగోగులతో ప్రమేయం ఉన్న మనిషి ఉందన్న తలపు మనకి ఆనందదాయకం.

ఈసారి వచ్చాక పాఠాలుచెప్పుకోవడం, వండుకు తినడాలకీ పరిమితం కాలేదు నా జీవితం. కావ్యరచన జోరుగా సాగుతోంది. 'ఆమె ముక్కు!' మీద రాసిన పద్యాల సంఖ్యా, సొగసూ రికార్డు బ్రేక్ చేశాయి. ఇంతవరకూ ఏ కవీ తన హృదయేశ్వరి ముక్కు మీద ఇన్ని చక్కని పద్యాలు రాయలేదని తాత్పర్యం. వితంతువుల పరిస్థితి కన్నులకి కట్టినట్టు వర్ణిస్తూ ఒక నవలకూడా రాశాను.

పాఠకులనుంచి వచ్చేజాబులేకింది ధోరణిలో ఉంటాయి.

'ఆర్యా—మీరు స్త్రీ సౌందర్యాన్ని ప్రకృతి అందంతో ముడిపెట్టి వ్రాస్తున్నారు. టాగురులా ప్రజలకర్థంకానికవిత్వ్రాయుట నిరుపయోగమని మనవి. టాగూరు విశ్వకవి కాలేదా అందురేమో. అతడాంధ్రుడు కాడనిమీకు జ్ఞప్తియందుండుననుకొందును.'

'నా ప్రియార్యా-మీ నవల చదివే సంతోషం నాకు కలిగింది. వితంతువుల దుస్థితి చక్కగా చిత్రించారు. కాని ఆ దుస్థితి నివారణకి విధవలని ఏం చేయాలో మీరు చెప్పలేదు. నవలకయినా కథకయినా రచయితయొక్క సందేశం ముఖ్యం.'

నాకు చూపించింది.

పురుగులు పట్టివుంది 'ఫలహారం అక్కర్లేనివాళ్ళు పిండి ఎందుకూ తెప్పించుకోవడం?' అన్నాను.

వాళ్లంతట వాళ్లేవి తెప్పించరు. నేనీ యింటికి వచ్చాక వారి వారి కావలసిన సరుకు లన్నీ తెప్పిస్తున్నాను మా యింట్లో నే నెప్పుడైనా బద్ధకించి ఫలహారం మానేసినా, ఆయనూరుకునేవారు కారు. నువ్వెరగవా ఏమిటి?'

'నీ తిండిసదుపాయం నువ్వే చూసుకోగల సొచ్చిందన్నమాట ఇక్కడ? పుల్లలా ఊరకే తయారవుతావా మరి?' అన్నాను జాలితో.

'ఎలా వుంటేనేం, సూర్యం? నేనీ యింట్లో బతికివున్నానని గ్రహించే వీళ్ళకి లేకపోయిన తర్వాత?' అన్నది కమలం బరువుగా.

కమల నాదగ్గర కూర్చున్నది సెనగ పిండిలో పురుగులని గూర్చి చెప్పడానికి మాత్రం కాదని తేలింది.

'నీ తెలివి తేటలతో ఎలాంటి ఇంటినయినా చక్కదిద్దగల సమర్థత నీకుంది, కమలం. మీ అన్నయ్య నువ్వొచ్చిన తరువాత తన యిల్లెలా మరిందో గుర్తించలే?'

'గుర్తిస్తే? వాడికీ, వాడి వదినకీ నేనంటే అసూయా కోపమూను. నోము చేసుకుంటే దండుగంటాడు. ఆఖరికి చిట్టికి ఓ చొక్కా గుడ్డ కోసమని అయిదురూపాయలు పంపించుకోవడానికి కూడా నాకు హక్కు లేదు. అన్నీ సమాప్తం అయిపోయిన నాలాంటి నిర్భాగ్యపుజీవిని చూసి ఎవరికైనా అసూయ ఎట్లా కలుగుతుందో?'

నా కడుపులో దేవినట్టయింది. జీవితంలో ఏ ఆనందానికీ నోచుకోని యీ నవనీత హృదయని ఎందుకిలా నొప్పిస్తారు?

'డబ్బున్న దానివి, నీకు బాగా జరుగుతుందనుకున్నాను కమలం.'

'నా డబ్బు తీసుకు వేరే వెళ్లిపోతానేమో అనే భయం వాళ్లకి. ఉంటే అట్లాగే జరిగేదేమో.'

'పోనీ అట్లాగే చెయ్యరాదూ?'

'ఎక్కడికి పోను? ఒక్కర్తినీ వుంటే చెప్పుకున్న కాలూ చెయ్యీ వొంగుతే ఎవరు చూస్తారు చెప్పు. లచ్చు దగ్గరుందామా అంటేఅదీ అన్నయ్యామాస్తరే. కొత్త చేరారా మాట్లాడుతూ నేను ఇంతో అంతో తమకి ఉపయోగపడుతున్నానని గ్రహించి ఆదరించేవాళ్ళెవరున్నారు గనక?' తన కాంతివంతమైన కళ్ళని నా ముఖం మీద ప్రశ్నార్థకంగా నిలిపి అన్నది కమలం.

ఏం చెప్పాలో ఒకంతకి తోచలేదు. జవాబు దొరకనప్పుడు వేదాంతాన్ని ఆశ్రయించడం మామూలేగదు: 'ఏ కర్మవశానో భూలోకంలో పుట్టిన దేవతవి అక్కయ్యా నువ్వు. నువ్వింతవరకూ పడినకష్టాలు చాలు.

(61-వ పేజీ చూడండి)

తాలూ నీకులోకువ. నామీద విరుచుకుపడతావ్! మాట అంటే తీసుకు తీసుకు వస్తావు. పరే పదలో పల పొయ్యిమీద అన్నం మాడి పోతోందో ఏమో!' అని సరుకోబోయారు.

'అహాఁ ఆచుక్కమ్మ కేం పోయేకాలం! అంత చేటువికవికలూ, పకపకలూ నూ, అమ్మాయినీ నన్నూ చూస్తే - మొన్న అది సెలవులకు వచ్చినపుడితే ఏమి తిప్పింది మూతీ ముక్కూ - దీని కొడుకు మాటే వింటే చెట్లల్లే, పాక నిట్టాడల్లే పెరిగి, పెళ్ళీ పెటాకులూ లేకుండా-వాడికొచ్చి నేళ్ళకి నోటిహార్మనీ వాయిస్తూ, బొమ్మల బుష్‌కోట్లు తొడగడంలా! మొగాడైతే, సరి ఏమైనా చెల్లిపోతుంది."

ఆ రాత్రి కురిసిన బ్రహ్మాండమైన వానలో తెల్లవారిపోయింది. బావి దగ్గర నీళ్ళకెళ్ళిన చుక్కమ్మా తాయారమ్మా మాతుల ముప్ఫైమూడు విరుపులు విరుచుకుని ఇళ్ళకు చేరారు.

ఆఫీసుటపాలో రిజిష్టరు ఉత్తరం వచ్చింది విశ్వనాథం పేరిట. ఏదైనా రిజిష్టరు కోసం చూస్తూ అన్నగా తాయారమ్మ పొయ్యిమీద గిన్నె కాలేసవచ్చి.

తాపీగా చూసి, కళ్ళజోడుతీసి "బలీయసి కేవల మీశ్వరేచ్ఛా"- అంటూ నిట్టూర్చాడు ప్రశాంత వదనంతో విశ్వనాథంగారు.

'ఏమిటండీ' అన్నది ఆదుర్దాగా తాయారమ్మ.

'వినగానే సంతోషించే ఒపిగొకటి కావాలి నీ కూతురుకు మంచిజరుగుతే నీవు సంతోషించగలవా తాయారూ' అన్నాడు విశ్వనాథంగారు సాత్వికునిలా, జీవితతాత్వికునిలా.

"ఎందుకొసందించనండీ మీ పిచ్చిగానీ—ఇంతకూ ఏమయింది - ఏదైనా పైజీవచ్చిందా కాలేజీలో".

'ఏమీ లేదు—నీ కోరిక నెరవేరింది- పప్పన్నం అక్కరలేకుండా అమ్మాయికి పెళ్ళయిపోయింది. నీపంతం నెగ్గింది.'

'ఆఁ' అంటూ నివ్వెరపోయింది-తాయారమ్మ. 'ఏమిటండీ మీరంటున్నది' అన్నది తార్స్థారై తలకిందులై ఆదుర్దాతో అదురుతో.

మరేం లేదు, చుక్కమ్మకొడుకు రమేష్ కలెక్టరయ్యాట మొన్న—నీ అల్లుడయ్యాట్ట నిన్న రిజిష్టర్ పెళ్ళిచేసుకున్నారట ఇద్దరూ. భగవచ్చిత్రం! నీకూ, చుక్కమ్మకూ భగవంతుడు రోగం 'ఠక్‌'మని ఒక్కసారి కుదిర్చాడు. నీకు పప్పన్నం పెట్టేబాధ తప్పిపోయింది.

'రమేష్ కలెక్టరా! నా అల్లుడా!' అని ముప్పిరిగొనిపోయింది ఆనందపు ఉప్పెనలో తాయారమ్మ—

"అహాఁ కొంగు చెట్టూనిట్టాడీని...సిగ్గుండాలి మొహానికి!" అన్నాడు విశ్వనాథం సమయాన్ని సదవకాశంక్రింద వినియోగిస్తూ-చాల్లే ఊరుకోండి మరీను అన్నది తాయారమ్మ.

ఈమాట విన్నావుటే అంటూ సంభ్రమంతో పరుగెత్తుకువచ్చింది రామయ్యగారి సుబ్బమ్మ—చుక్కమ్మగారింటినించి సరాసరి—

"సరేపసపద లోపలికి, పొయ్యిమీదగిన్నె కాలిపోతోంది—" అన్నారు విశ్వనాథం గారు.

'మరి పప్పన్నం ఎప్పుడూ' అన్నది రామయ్యగారి సుబ్బమ్మ. ★




## గృహ రామాయణం

కొంపలో ముసలమ్మ లున్నారే. వాళ్లి నుచూస్తే అందరికీ అలుసు ఆసంగతి వాళ్లకి తెలుసు.

ఒకప్పుడు ఒక మనవడు మామ్మను మహాఏడిపిస్తున్నాడు. ఆ మెను పేర్లుపెట్టి పిలుస్తున్నాడు. సూటీ పోటీ మాటలని విసిగిస్తున్నాడు.

పోనీ ఆ తైనా క్రూరవాడా? కాలేజీలో చదువుతున్న కళా బ్రహచారి. అంటే 'బాచ్‌లర్ ఆఫ్ ఆర్ట్సు'. వ్యంగ్య వైభవమంతా తన వచోలహరిలోనే అలలు రేకుతున్న దని ఆ మెమీద తన పాండిత్యమంతా ప్రయోగించాడు.

ఆ మె ఉలుకలేదు పలకలేదు. మనవడికి సందేహం వచ్చింది. 'ఏం బామ్మా కోపంవచ్చిందా నేను ఇందాకట్నించీ ఊరికే అవీ ఇవీ అంటున్నానని' అని అడిగాడు.

వెంటనే ఆ బామ్మ 'వర్లుగాలే మాటలకు కోపమెందుకు నాయనా' అని లేచి గిరుక్కున లోపలికి చక్కాబోయింది.

చెంప ఛెడేల్‌మన్న వాడిలా 'డీలా' మొహం పెట్టాడు మనవడు.

# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

(గతవారం తరువాయి)

## 5

మనోవ్యాకులతలో శుష్కించి నిస్పృహ నిరాశలు ప్రతిబింబిస్తూ చిట్లించిన ముఖంతో, కోమటి యజమాని మేడ ఎక్కాడు శివరాం, పొద్దున్నే. సాధారణంగా కోమటి యజమాని ఉదయం తన గదిముంగు వరండాలోకి వచ్చి కూర్చునే అలవాటున్నా, ఆ రోజు రాకపోవడంవల్ల, తానే స్వయంగా మేడ మీదకు ధైర్యం చేసుకుని అడుగుపెట్టాడు శివరాం. ముఖ ప్రక్షాళనానంతరం బద్ధకంగా చుట్టముట్టించి మేడవరండాలో పచారు చేస్తున్న కోమటియజమాని తనంత తానుగా పైకివచ్చిన శివరాంను చూసి కొంచెం ఆశ్చర్యపోయాడు. అతనిరాక గమనించి కోమటి కోడలు సంతోషంగా ముఖం వికసింపచేసుకుంది.

మర్యాదగా ఆహ్వానించి కోమటి యజమాని శివరాంకు కుర్చీ చూపించాడు.

శివరాం బాధగా మౌనంగా నిలుచున్నాడు. "నాతో ఏమన్నా జరూరు పనుందా?" కోమటియజమాని అభిమానంగా అడిగాడు.

'పనేమీ లేదు...ఇంక ఏపనీ మీకు యివ్వ దల్చుకోలేదు...మీరు యింతవరకు చూపిన ఆదరణ మరిచిపోలేను...ఆఖరుసారిగా మీ దగ్గర సెలవుతీసుకోవాలని వచ్చాను!" శివరాం హృదయంలో ఉబికి వస్తున్న భగ్న జీవితపు ఆవేదన అణచుకుంటూ ముఖం దించుకున్నాడు.

కోమటియజమాని తృటిలో అతని పరిస్థితి కొంత అవగాహన చేసుకొని, బలవంతంగా అతని బుజాలు వంచి కుర్చీలో తాపిగా కూర్చొపెట్టాడు.

'మీకు యిప్పటికే ఎంతో సొమ్ము యివ్వాలి...అది యీ ప్రస్తుత ఉద్యోగ పరిస్థితుల్లో యివ్వగలనో లేదో అనే భయం నాకే కల్గుతోంది...ఈ వాతావరణం మార్పు

ఋణం తీర్చుకునే శక్తి కల్గుతుంది..." యింకా ఏదో చెప్పబోయే శివరాంను మధ్యలో ఆపేశాడు కోమటియజమాని నవ్వుతూ. "యీ చిన్న విషయం గురించి యింత బాధ ఎందుకండి! ... ఎవరికైనా వస్తాయి కష్టాలు!" సానుభూతిగా బుజం తట్టాడు కోమటియజమాని. "బొంబాయి పోవాలని నిశ్చయించుకున్నా!"

కోమటి యజమాని శివరాంలోని అమాయకత్వం గమనించి గట్టిగా నవ్వేశాడు. కోమటి కోడలు ప్రక్కనే ఉండి పొంచి వింటోంది.

కోమటి యజమాని నవ్వు శివరాంను హేళన చేసినట్లనిపించింది. బొంబాయి నగరంలో తనలాంటి మనిషి జీవితం క్రొత్తగా ప్రారంభించటం మరింత దుస్సాధ్యమనే అభిప్రాయంతో కోమటియజమాని నవ్వేడనిమాత్రం శివరాం అర్థం చేసుకోలేకపోయాడు. హృదయంలో అవమానాలమధ్య ఉబుకుతున్న నిరశుకట్టిన ధైర్యం, ఆశ, ఆధారంగా అనుకున్న ప్రకారం జరిగితీరాలనే పట్టుదల పట్టాడు శివరాం.

"ఈ వేళ సాయంత్రం బొంబాయి పోతున్నా...మీకు అభ్యంతరం లేకపోతే ...మీ సొమ్ము ఎక్కడున్నా తీర్చుకుంటాననే ప్రతిజ్ఞ చేస్తున్నా ... నా నిజాయితీ మీద నమ్మకంమాత్రం ఉంచమని వేడుకుంటున్నా!" శివరాం కళ్ళల్లో అప్రయత్నంగా రెండు బిందువులు ఉబికి నిలుచున్నాయి.

"పోనీ...యీ వూళ్ళోనే ... మరేదైనా ఉద్యోగం..." "కుదరగు ... అనుమానాలతో పరిహసిస్తున్న జనం దొంగతనం కేసు పోలీసుల గస్తీలు ... బీదరికం ... త్రాడు బొంగరంలేని జీవితం...ఇక్కడ ఎన్నాళ్లు?" అవ్యక్తమైన బాధతో ఒక నిట్టూర్పు విడిచాడు శివరాం.

"మీరు మరోచోటికిపోయి జీవితం బాగు చేసుకుంటావంటే ఎవరు అడ్డుపెట్టగలరు? ఋణంగురించి ఏమీ విచారించకండి!" నవ్వాడు కోమటియజమాని.

మౌనంగా లేచి, గిరుక్కున తిరిగి, గబగబ మేడమెట్లుదిగాడు శివరాం. అతని ప్రవర్తనచూసి కోమటి యజమాని అతని భార్య కూడ చాల బాధపడ్డారు.

"పాపం!...చేతిలో ఏమన్నా డబ్బుందో లేదో...బొంబాయి పోతానంటాడేమిటే... పోనీ మనం ఒక పాతికరూపాయలు చేతికిస్తే మంచితనం ఎప్పటికైనా ప్రతిఫలం పొందుతుంది!" కోమటి కోడలు భర్తతో సంప్రదించింది. భార్య సలహా ఉదారుడైన కోమటి యజమానికి నచ్చింది. డబ్బు యిద్దామని క్రిందకువెళ్లినా శివరాం కనిపించలేదు. గది తాళం వేసేవుంది. మళ్ళీ అతను తిరిగి రాగలడనే ఆశతో తాను యింట్లో లేకపోయినా అనుకున్న ప్రకారం డబ్బుయిమ్మని భార్యకు సలహాఇచ్చాడు కోమటియజమాని.

శివరాం అప్పుడైన రాజారావును ఒకసారి కలుసుకోవాలని హైద్రాబాదునగరంలోకి వెళ్లాడు. ఇల్లు తెలియకపోయినా, తెలిసిన చిరునామా ప్రకారం రాజారావు ఇల్లు పరిశోధించి పట్టుకున్నాడు. ఊరినుంచి వచ్చిన రాజారావు పొద్దున్నే ఎక్కడికో వెళ్ళిపోయాడని యింట్లోంచి వచ్చింది వార్త. నిరాశతో ఒక చీటీవ్రాసి ఇంట్లో వదిలి వెనుతిరిగాడు శివరాం.

మధ్యాహ్నం పన్నెండుగంటలైంది. కడుపులో ఆకలి దహిస్తోంది సూర్యుని ఎండ వేడి తీవ్రతలా. జేబులోని కొద్ది సొమ్ము బస్సు రవాణాకు మాత్రమే ఉపయోగించేలావుంది. రాజారావు కనిపిస్తే నోరు తెరచి ఏమన్నా డబ్బు అడగాలని ఆశించాడు శివరాం. కష్టాలు పరంపరలుగా తన జీవితంలో చుట్టుముట్టడం మామూలు సాంప్రదాయంలాగే కనిపించింది. వీధుల్లో తిరగడం ఇష్టంలేకపోయింది. తన చీకటిగదిలో ఒంటరిగా ఏడుస్తూ పడుకోవడమే హృదయబాధకు ఎంతో ఉపశమనం కలిగిస్తుందని గృహోన్ముఖుడయాడు శివరాం.

తిన్నగా గదిలోకిపోయి తలుపులుమూసుకుని ప్రక్కమీద పడున్నాడు. ఒక్కొక్క అభాగ్యుడి భగ్నజీవితం పద్మవ్యూహం లా ఆవరిస్తుంది. ఆ వ్యూహాన్ని భేదించలేక సాలిగూడులో చిక్కుకున్న పురుగులా హతమైపోతాడు అతను. సాహసయాత్రలలో నూతన చైతన్యంతో క్రొత్తజీవితాలు దిద్దుకోవలసిన ఆధునిక యువకుల కర్తవ్యము ప్రస్ఫుటంగా చాటుదామని ధైర్యంగా బయలుదేరిన తనకే యాత్ర ప్రథమ పాదంలోనే ముప్పు వాటిల్లింది. బ్రహ్మయ్యతాత ఉన్న ఊళ్ళోనే బ్రతకమనియిచ్చిన సలహాలో కొంత సత్యం, దూరదృష్టి ఉన్నాయేమో అనే భ్రాంతిలో పడ్డాడు శివరాం. లక్ష్యసాధన కరతలామలకమయి విజయులైనవారు అభినందనీయులే. లక్ష్యసాధనలో

# కాల్గేట్‌తో దంతక్షయం కాకుండా కాపాడుకోండి
# రోజంతా నోటినించి దుర్వాసన రాకుండాకూడా చేసుకోండి!



ఎందు చేతననగా: ఒకసారి తోముకుంటేనే
కాల్గేట్ డెంటల్ క్రీమ్ నూటికి 85 వంతుల వరకు దంతక్షయము లేకుండా చేసి. దుర్వాసన పోగొడుతుంది.

భోజనం చెయ్యగానే కాల్గేటును ఉపయోగించి బ్రష్‌తో పళ్ళు తోముకొన్నట్లయితే అనేకమందికి దంతక్షయం కావడం ఆగిపోతుందనీ, దంతవ్యాధుల చరిత్రలో ఇది అపూర్వ విషయమనీ. శాస్త్రీయ పరిశోధన వల్ల ఋజువైంది అంతేకాదు నోటినుంచి దుర్వాసన వచ్చేవారు దీనిని వాడినట్లయితే 10 మందిలో 7 మందికైనా వెంటనే గుణమిస్తుందనికూడా ఋజువైంది. ఒక్క కాల్గేట్ విషయంలోనే ఇవి ఋజువైనవి.

కాల్గేట్‌నుంచి సురనురమంటూ వచ్చేనురగ పళ్ళ సందుల్లోకి లోపలికంటా చొచ్చుకువెళ్ళి, అక్కడ ఇరుక్కుపోయి ఉండే ఆహార పదార్థాల నలుసులను బయటికి గిలా వేస్తుంది పళ్ళు చాలా చెడిపోడానికి, దుర్వాసన రావడానికి కారణం ఆ నలుసులే.

కాల్గేట్‌తో పళ్ళు తోముకోవడమంటే పిల్లలకు చాలా సరదా ఎందుకంటే దానినుంచి వచ్చే చాలా పేపు ఉండే పిప్పరమెంటు వాసనంటే వారు చెవి కోసుకుంటారు.




మీకు పళ్ళపొడి అలవాటైతే, కాల్గేట్ పళ్ళపొడివల్లకూడా ఇన్ని లాభాలూ ఉన్నాయి ....... ఒక డబ్బా కొన్ని నెలలు వస్తుంది।

కాల్గేట్‌తో నిత్యమూ పళ్ళు తోముకొంటే.

- ✓ దంతక్షయం కాదు
- ✓ దుర్వాసన ఉండదు
- ✓ దంతాలు మల్లె పువ్వుల్లాగ ఉంటాయి




తెల్లని పళ్ళకోసం, నోటి శుభ్రత కోసం....ప్రపంచంలో మరే టూత్ పేస్టుకంటె కాల్గేట్‌నే హెచ్చుమంది కొంటారు.

DCG. 190T 7

# ★ అన్వేషణ ★

ప్రబలమైన నిరోధశక్తుల నెదుర్కొని నశించిన వారు కూడ ఒకవిధంగా తమ ధైర్య సాహసాలకు అభినందనీయులౌతారు. ఈ రెంటివ తెగకైనా తన జీవితాన్ని అంకితం చేయాలనుకున్నాడు శివరాం.

ఆవేదనలో బాధలో నిరాశలో నిస్పృహలో శోకం ఉబికింది అతనికి, ఏడ్చాడు. మనసార ఏడ్చాడు. తలగడ తడిసింది. తడిసిన తలగడాలో చెమ్మగిల్లిన కళ్ళు దాచుకున్నాడు శివరాం. కిటికీలు మూసిన గది, మసక వెలుతురుతో మందకొడిగా కనిపించింది.

తలుపు చప్పుడయింది.

శివరాం నిద్రపోతున్నట్లు నటించాడు.

మళ్ళీ చప్పుడయింది.

తలుపు బయటనుంచి మాటలేదు.

బహుశా కోమటికోడలు కాదనుకుని తలుపు తీశాడు శివరాం.

కోమటి కోడలు నిలుచుంది దీనంగా ముఖం పెట్టి.

'వెళ్ళిపోతున్నారా!' ముఖం వెనుకకు త్రిప్పేసుకుంది.

తన బాధలు గురించకుండా, మనస్తత్వాన్ని అర్థంచేసుకోకుండా తనకు మానసిక ఆనందానికి అవకాశం లేనప్పుడు కోమటి కోడలు విచిత్ర ప్రవర్తనతో యిస్తున్న దర్శనం శివరాంకు కోపంకూడ తెప్పించింది. తన గొడవలోనే మునిగి, యితరుల మనస్తత్వాలు అర్థంచెసుకోని కఠినులచే ఆకర్షింపబడటం దుర్విధి అని దురపిల్లింది కోమటి కోడలు.

'ఈసొమ్ము మీకిమ్మన్నారు!' పాతిక రూపాయలతో ఉన్న కవరు శివరాం గదిలో విసిరేసి గబగబ మేడమీదికి పోయింది కోమటి కోడలు.

ఆమె ప్రవర్తనకు అంత బాధలోనూ జాలి కలిగింది శివరాంకు. ఏదో నేరంచేసి పశ్చాత్తాపపడిన వానిలా బాధతో క్రుంగిపోయాడు శివరాం.

వీధిలో కారు ఆగింది. రాజారావు సిగిరెట్టు పీలుస్తూ తుపానులా రివ్వున నడుస్తూ ఆనందంగా యింట్లో అడుగుపెట్టాడు.

'ఏమి స్వామీ! సంతోషవార్త!... నువ్వే నేరం చెయ్యలేదు!... గబగబవచ్చి శివరాంను కౌగలించుకున్నాడు రాజారావు.

'మరో సంతోషవార్త మిత్రమా!... రాజారావు తనవంతాన్ని ఉద్ఘరించాడు... భావిభారతపౌరులలో ఒకణ్ణి సృష్టించాడు..!" "చక్రవర్తి పకపకనవ్వుతూ, చప్పట్లు కొడుతూ భారతదేశం జిందాబాద్!" అంటూ అరిచాడు.

ఆఫీసులో శివరాంను కలుసుకోవాలని రాజారావు వెళ్లాడు. వెయ్యిరూపాయల దొంగతనం డైరక్టరుదగ్గిర పనిచేస్తున్న బంట్రోతు చేశాడని పోలీసులు నిర్ధారణచేసి, అతడిని జైలులో పెట్టారు. గుమస్తాలంతా శివరాంపై అపారమైన ఆదరణ చూపిస్తూ మాట్లాడుకుంటూ, శివరాం ఎదురుగా లేకపోవడంవల్ల, పొంగిపొర్లుకు పోతున్న తమ అభిమానం వృధా అయిపోతూందే అని విచారిస్తున్నారు. రాజారావును చూసి గుమస్తాలు అతన్ని చుట్టుముట్టి తమ సానుభూతి వాక్యాలతో అతన్ని ముంచేశారు. వాళ్ళను విదిలించుకుని, చక్రవర్తిని తీసుకొని, ఒకటాక్సీ మాట్లాడి ఎగిరిపడ్డాడా యింట్లో రాజారావు.

"ఈవేళ బొంబాయి పోవాలనుకొని నిశ్చయించుకున్నా. నువ్వు మాయింటిదగ్గర లేవు...నిరాశతో వచ్చేశా!"

"నిన్ననే అత్తవారింటినుంచి వచ్చా... ప్రొద్దున్నే నేను ఎరుగున్న ఒకఆఫీసరు ఢిల్లీనుంచి వస్తుంటే కలుసుకుందామని విమానాశ్రయానికి వెళ్ళా..." రాజారావు విషయాన్ని పూరించాడు.

"అయితే బొంబాయి వెళ్ళివచ్చేశావన్న మాట రాజారావు కనిపించలేదని.!" నవ్వాడు చక్రవర్తి రాజారావు వినని మాట జ్ఞప్తికి తెస్తూ!

"బొంబాయి ఎందుకు ?" ప్రశ్నించాడు రాజారావు.

శివరాం పేలవంగా నవ్వాడు.

"ఎప్పుడూ అంత నిరాశగా ఉంటే ఎలా ...రేపు నీజీతం పూర్తిగా దొరుకుతుంది... ఇకనుంచి దబ్బులజీవితం లభిస్తుందన్న మాట...అది ఎలా ఉంటుందో యీ వేళ చూపిస్తారా...కారు ఎక్కు !" రాజారావు శివరాంను బలవంతంగా తోశాడు.

ఎక్కు మిత్రమా...కారెక్కు మిత్రమా!" స్వగంలో ఆలపించాడు చక్రవర్తి.

రాజారావు గది తాళం వేశాడు చీకటిలా! ముగ్గురు కారు ఎక్కి కూర్చున్నారు.

కారు ఉత్సాహంగా చైతన్యంతో ఆ సంగు గతుకులపై ఊగుతూ రహదారిదాకా వెళ్ళింది. ఎవరో రాజకీయనాయకుడు నగరానికివస్తే రహదారి బంధించి బారులు తీర్చి నిలుచున్న జనంగుంపులు కదిలి విచ్చల విడిగా నడిచి పోతున్నారు. ఫలహారాలు సుష్టుగా భుజించి కారు గండిపేట నడిపించారు.

బారులు తీర్చిన చెట్లు రివ్వున వీచే గాలిలో మైమరచి నృత్యం చేస్తున్నాయి. ఆకాశం లోని తెల్ల మేఘాలు హాయిలుగా నడుస్తున్నాయి. పిట్టలు బారులుగా ఆకాశంలో ఎగురుతూ స్వేచ్ఛానందాన్ని వ్యక్తపరుస్తున్నాయి.

ఆ కారులో ముగ్గురి హృదయాలు సంతోషంతో నిండిపోయాయి.

సహజంగా మృభావసంభాషియైన శివ రాం సరదాగా ఒక్క నిముషం మౌనం వహించక ఏదో ఖులాసాగా కబుర్లు చెబుతూంటే రాజారావు, చక్రవర్తులు కూడ ప్రకృతి పరిసరాలు పరిశీలిస్తూ తన్మయతలో మునిగారు.

కారు ఎత్తైన రోడ్డు ఎక్కింది.

ఎక్కగానే కనిపించింది ఉస్మాన్ సాగర్ సరస్సు.

" కారు మెల్లిగా పోనీయ్!" రాజారావు ఆజ్ఞ చేశాడు డ్రైవరును.

కరటాలమీదనుంచి వచ్చేగాలి విజృంభించి చెట్లతో కలిసి గాత్రసమ్మేళనం చేసి గానకచేరి జరుగుతున్నట్లు కనిపించింది. సరస్సు తరంగాలు శబ్దాలు చేస్తూ తీరాన నిలుచున్న తెల్లకొండరాళ్ళను తాకుతూ తాళం వేస్తున్నట్లుంది. కోకిల "కూ" స్వరాలు గాలిలో మధురంగా వింతవాయిద్య స్వరాల్లా వినిపించాయి. ఎంతో కాలం నుంచి ఆ మధురగానాలు వింటూ నిద్రలేక కళ్ళు ఎర్రబడినట్లు, సీమతంగేడు వృక్షాలు ఎర్రపుష్పాలతో నిండి ఒళ్ళంతా కళ్ళు చేసుకున్నట్లున్నాయి.

ఎత్తైన సుంద్రంగా తిరుగుతున్న సిమెంటు బాట... ఆ బాట కిరువైపుల విహారకర్తల ఆనందంకోసం పెంచిన తోటలు..—తోటల



ప్రత్యేక **త్రిగుణాచర్యలతో**

గూడియున్న **మెక్లీన్స్**

**పెరాక్సయిడ్ టూత్‌పేస్టు**



1

చాలా బాగుగా
✻ శుభ్రపరచును!

ప్రత్యేకంగా మెక్లీన్స్‌లోనున్న 'లైపాయిడ్' సాల్వెంట్ మీ పళ్ల మీద యేర్పడు చుండే — మురికిని క్రిములను గలిగియుండే పొరను నిర్మూలించును. ఈ పొరను కరిగించుటవల్ల మెక్లీన్స్ మీపళ్లను బాగుగా శుభ్రపరచును.



2

చాలా బాగుగా
✻ తెలుపుజేయును!

మెక్లీన్స్‌లోనున్న ప్రసిద్ధమైన "పెరాక్సయిడ్" మీ పళ్లకు గల వికృతమైన దాగులను, గారపట్టిన రంగును తొలగించును — అందువల్ల వాటిని మెరిసేటట్లు తెల్లగా జేయును.







3

✻
బాగుగా కాపాడును!

మీరు మెక్లీన్స్‌ను స్వయముగా వాడి దానియొక్క సుప్రసిద్ధమైన రుచిని ఆస్వాదనమును కనుగొనండి. ఇది పనుచిగుళ్లను ఉత్తేజ పరచి, దంతక్షయమును కలిగించే క్రిములను నిర్మూలించును.

బాగుగా పరిశుభ్రపరచును + బాగుగా తెలుపుజేయును + బాగుగా కాపాడును

ఈ మూడు గుణముల సుప్రసిద్ధమైన కూడిక మీకు త్రిగుణచర్యను గలిగించును, ఇది మెక్లీన్స్‌లో మాత్రమే ఉన్నది.

**అతి శుభ్రమైన, అతి తెల్లని, అత్యారోగ్యవంతమైన పళ్లకోసం.. నేడే మెక్లీన్స్ కొనండి!**

# ★ అన్వేషణ ★

'ఉన్మాది: నా ఆరోగ్యం చక్కబడే ఔషధం కావాలి.

లాయర్: నేను డాక్టర్ని కాదు లాయర్ని.

ఉన్మాది: తెలుసు. నాకు విడాకులు కావాలి.

కొనుకుని దాగుడుమూత లాడుతున్న సరస్సు తీరం...తీరంమీది కొండ రాళ్ళపై తరంగాల హస్తాలు మోపి కలకల శబ్దాలతో ఆహ్వానిస్తున్న సరస్సు...అనంత ఆనంద ప్రదాయినిలా కనుచూపు మేరలో ఆవలికట్ట కనిపించనీయక విశాలంగా వ్యాపించుకున్న...ఆ ఉస్మాన్ సాగర్ శివరాంను చాల ఆకర్షించింది. ప్రథమంగా చూడటంవల్ల ఆసక్తి మరింత పెరిగింది.

కారు ఆగింది. ఒక చిన్న హోటలువద్ద. మరికొన్ని కారులు వరుసగా నిలిచి ఉన్నాయి. రాజారావు నిశ్శబ్దాన్ని ఛేదించాడు కారుదిగి. జేబులోని సిగరెట్టు తీసి ముగ్గురికీ యిచ్చాడు.

'ఆ సరస్సు తీరంలోని తిన్నె గోపురంలో తపస్సు చేసుకోవాలని ఉంది" రాజారావుమాట బరువుగా వచ్చింది.

'ఆ కెరటాల గంతులమధ్య వాలిపోయి దొర్లుతూ హాయిగా ఈతాలాడాలని ఉంది మిత్రమా!" చక్రవర్తి పకపక నవ్వాడు.

శివరాం మందస్మితం చేసి మౌనంగా కదిలాడు హోటలు వైపు

దూరాన స్త్రీ పురుషుల జంటలు. సొగసుగా కదులుతున్నాయి.

సరస్సువైపు ఉన్నహోటలు ప్రాకారంలో కూర్చున్నారు. ఆకుపచ్చరంగు చెరిగిపోయి మాసిపోయిన నాలుగు చిన్న మేజాబల్లలు—కుర్చీలు, రెండు మూడు చోట్ల పరచిఉన్నాయి. బల్లలమీద విడిచిన తేనీరు చక్కెర వాసనలకు ఈగలు ముసురుతున్నాయి. సరస్సు నానుకుని వృక్షాలతో చుట్టుకుని, సుందరంగా ఉన్న ఆ హోటలు పరిసరం సౌందర్యంగా ఉంది. అస్తమిస్తున్న సూర్యుని సంధ్యారుణ కాంతులు కెరటాల ముడతలతో బంగారు రేకులు దాచుకుంటున్నాయి.

సోడాలు త్రాగి మౌనంగానే ఆ పరిసరాలు తిరిగారు. సరస్సుకు ఆనకటగా కట్టిన వంతెన కావలివైపు అందంగా పచ్చగడ్డి మైదానాలతో కన్నులపండువుగా అమర్చబడిన పార్కులో ఆడ మగ జంటలు ఏకాంతంగా తమహృదయాలు విప్పుకుంటున్నారు.

'ఎలాఉంది స్వామీ...యీ ప్రదేశం... నీ కోసం యీ వేళ యిక్కడికి వచ్చాం... తెలియని ప్రదేశాలు చూస్తూ యాత్రలుచేసే సంకుచిత జీవితాల్లో సతమతమౌతూ మనం పడే బాధలు విశాలదృష్టి ఏర్పరుచుకుని విస్మరించగలం!" రాజారావు శివరాంవైపు చూశాడు.

శివరాం నవ్వాడు.

'నాయనది మనస్సు పూర్తిగా చెప్పాలంటే ప్రక్కను ఎవరైనా వనితారత్నం అవసరం!" చక్రవర్తి వ్యంగ్యంగా అన్నాడు బాహ్యంగా రాజారావు అన్నమాటలు నిజం కాదన్నట్లు.

"అవసరంలేదు. నేనే చెప్తా...కొడుకు పుట్టాడని సరదాలో యిక్కడికి వచ్చాను. ఆనందంగా యీ ప్రకృతి పరిసరాల్లో కాస్సేపు గడపాలని...తండ్రికి సహజంగా ఆనందం ఉంటుంది...ముఖ్యంగా రెండు పెళ్ళిళ్ళు జీవితంలో చెడిపోయాక!" రాజారావు ముఖం చిట్లించాడు.

చక్రవర్తి నొచ్చుకున్నాడు తన సంభాషణకు. శివరాం బాధపడ్డాడు రాజారావు విషాదవదనం చూసి. అంత ఖులాసాగా తిరిగే రాజారావు జీవితంలో కూడా ఏదో విషాదం వేళ్ళు పాతుకుందని మాత్రం గ్రహించుకున్నాడు శివరాం.

అంతా తిరిగి కారు ఎక్కారు.

"నా వివాహజీవితానికికాదు నేను సంతోషించేది. నాకు వంశోద్ధరణకు ఒకడు లభించేడుకదా అని సంతృప్తి...ఇప్పుడు నేనేం చేసినా, ఏమైపోయినా ఫరవాలేదు!" పాలిపోయినవవ్వు రాజారావు పెదాలమీద ప్రతిఫలించింది.

ఆ నిమిషంలో రాజారావు ఆకస్మికంగా విషాదం వదిలేసి, ఖులాసా పురుషుడుగా మారిపోయాడు. కూనిరాగాలు తీశాడు. పాటలు పాడాడు. పద్యాలు చదివాడు ప్రక్కనున్న ఇద్దరిని హెచ్చరించాడు తనతో పాడమని తప్పట్లు చరుస్తూ. కేకలు వేస్తూ అల్లరిచేస్తూ ఆ కారులో నగర పరిసరాలలోకి వచ్చేశారు ముగ్గురూ.

"స్వామి తినడానికి నీకేం కావాలి?" శివరాంవైపు చూచాడు రాజారావు.

"రాత్రి ఏడుగంటలు దాటింది. భోజనం చేస్తే బాగుంటుంది" అన్నాడు శివరాం.

"ఎల్ల కాలం ఆ వరిమెతుకులే!...యింకేమైన తినకూడదూ...నాతోరా!"

టాక్సీవాడికి డబ్బులు చెల్లించి రాజారావు రెస్టారెంటులోకి నడిచాడు. గదులుగా విభజింపబడి తెరలు వేలాడుతున్నాయి వరండాలో. ఒకగదిలోకి వెళ్ళారు ముగ్గురూ.

"బాయ్!" రాజారావు కేకతో తెల్లకోటు పంట్లాం తొడుక్కున్న ఒక నౌకరువచ్చాడు.

ఒక కాగితం చూసి "బ్రాందీ!" మాట తేలుస్తూ నవ్వాడు రాజారావు.

'ఈ వేళ మనమిత్రుడికి విందుచెయ్యాలి!' శివరాంవైపు చూసి రాజారావుకేసి కనుసైగ చేశాడు చక్రవర్తి.

రెండు గ్లాసులో ఎర్రని పానీయం కొంచెం, రెండుసోడాలు టేబిల్ మీద నిలుచున్నాయి. సిగరెట్లు మామూలుగా వాళ్ళ పెదాలమధ్య దూరి పొగలు వదులుతున్నాయి. శివరాం ఆ పానీయం తీసుకోనన్నాడు. అలవాటు లేదంటూ రాజారావుబలవంతంచేసినా పుచ్చుకోలేదు. రెండు గుక్కలు త్రాగిన రాజారావు చక్రవర్తి ఏదో సుఖంలో శివరాంను అప్పుడప్పుడు పలకరించినా ఏవో తెలియని విషయాల గురించి మాట్లాడుకుంటున్నారు.

'ఈ కాళ్ళు సరిగ్గా ఉంటే ప్రపంచాన్ని జయించేవాణ్ణి!' చక్రవర్తికళ్ళు చెమ్మగిల్లాయి.

'సత్యాన్ని ప్రేమను గౌరవిస్తాను... నామీద యిష్టంలేని అమ్మాయిని నేను ప్రేమించినా ఎంతకాలం నాతో గడపగలదు?...అందుకే వదిలేశాను ప్రియుణ్ణి కలుసుకోమని...అదొక మరిచిపోలేని కథ!' పెదాలుముడిచి ఉబ్బించి గ్లాసు టేబిలు మీద గిరగిర త్రిప్పాడు రాజారావు.

సంభాషణల సారాంశం శివరాంకు క్రొత్తగా తోచింది. ఇంతకాలం తన కష్టాలకు సానుభూతిచూపిస్తూ సరదాగా బ్రతుకుతున్న రాజారావు చక్రవర్తులలో బాధలే లేవనుకున్నాడు శివరాం. తన కష్టాలు ఒకవిధంగా గట్టెక్కుతున్నాయనుకున్న ఆరోజున వారి నిజస్వరూపం ఒకవిధంగా శివరాంకు అర్థమయింది.

మత్తు పానీయాలు త్రాగడం పూర్తిచేసి తూలుతూ వీధిలోకి వచ్చారు...

'వస్తావా' రాజారావుమాట తేలిపోయింది.

'ఎక్కడికి?' శివరాం అడిగాడు.

'రాత్రి సుఖమిచ్చే రమణి...!' నవ్వేశాడు రాజారావు. చక్రవర్తి శృతిహెచ్చించాడు నవ్వులో.

'ఈ వేళకు నన్ను వదిలెయ్యండి!" శివరాం తల దించుకున్నాడు.

'గుడ్ బై!' రాజారావు శివరాంచేతిలో అయిదు రూపాయలనోటు పెట్టాడు. తూలుతూ చక్రవర్తి బుజంమీద చెయ్యివేసి బస్సుస్టాపువైపు వెళ్ళిపోయాడు.

చేతిలోని రూపాయలనోటుకు వెళ్ళిపోతున్న ఆ స్నేహితుల నిద్దర్నీ ఒకసారి పరీక్షగా చూసి శివరాం భోజనం చెయ్యడానికి హోటలులోకి వెళ్ళిపోయాడు.

(ఇంకా వుంది)

# రంగుటద్దాలు

అక్కినేని నాగేశ్వరరావు

...క్కొక్కప్పుడు అనుకుంటూ వుంటాను. ...నవులు బలహీనులు—అని. నా వూహాలను ప్రకృతివేపు దృష్టి సారించి, ఛాయా...లు పరిశీలించి, రహస్యంలోకి తొంగి ...ని—వాటి లోతులను గ్రహించడానికి ...త్నించి—వాటి అంతు తెల్సుకుందామను ...వారినీ దీర్ఘంగా చర్చించేవారిని—అంతు ...దని భయపడి వెనుదిరిగేవారినీ—నేను ...మందిని ఎరుగుదును—దీని తుది ఏమిటో ...లేకపోయినా—చూసి ప్రయత్నించే ...లో నేనూ ఒక వ్యక్తిణ్ణి—శారీరకంగా ...ాలూ, బస్కీలూ తీసి ఎలా ఆరోగ్యం ...దించుకుంటారో—మానసికంగా దండాలు ...లు తీసి మానసిక బలంతో ఇంకొకరి ...స్సును పట్టి కొట్టించి—నా మనస్సును పీట ...ంచుకొని తద్వారా ప్రపంచ విషయాలు ...ప్పుకుందామని ప్రయత్నించడం—నా అభి...ం—అభిమానశాస్త్రం—

...న్నప్పటినుంచీ చెమటోడ్చి కష్టించిన ...సినిమాల్లో చేరినప్పటినుంచి—పరిస్థితుల ...వాలను చవిచూసూ—ఎత్తూ పల్లాలను ...కుంటూ లౌక్యాలను గమనిస్తూ, అనుభ...నుబట్టి, కష్టసుఖాలకూ. మంచిచెడ్డలకూ ...లు చెప్పుకుంటూ అవసరమైనవి నేర్చు...టూ దూషణ భూషణాలకు గురిఅవుతూ, ...నావారి ఆదరణ, ప్రేక్షకుల అభిమానం

ఇక్కడ 7000 ల అడుగుల ఎత్తున సూర్యునికి దగ్గరలో ఈ చల్లదన మేమిటి ఇలా ఆలోచిం చుకుంటూ లోతుకు దిగడమూ తేరుకుని ఒడ్డున పడడమూ 10 నిమిషాల్లో జరిగింది. ఇలా వూహించుకుంటూపోతే విశ్రాంతి ఉండదనుకుంటూ, ఒక పక్క పిల్లలు అడిగే ప్రశ్నలకు సమాధానం చెబుతూ—మాకోసం నిర్ణయింపబడ్డ యింటికి సపరివారంగా చేరాం.

కొడైకెనాల్ లో ఓయింటిని అనేక సంవత్సరాలుగా సొంతం చేసుకొని ప్రతిసంవత్సరం వస్తూపోతూవున్న *భరణీ అధినేతలమూలంగా పరిసర ప్రాంతాలన్నీ చూచాం. వివిధస్వరూపాలతో అందాన్ని వెదజల్లుతున్న ప్రకృతి రూపాన్ని తిలకించాం—ఆనందించాం—పరవశం పొందాం—తర్కించుకొన్నాం.

"దూరపుకొండలు నునుపు" అని పెద్దలంటారు నిజానికి ఈ కొండలన్నీ దూరానికి అంత అందంగానూ వున్నాయి. దూరాన్నుంచి ముగుగుపచ్చ ముఖమల్ దుప్పట్లు కప్పినట్లున్నట్లుగా కనిపిస్తాయి. దగ్గరకొచ్చినకొద్దీ తరచిచూచినకొద్దీ భయంకరరూపం దాలుస్తాయి ఎత్తయినకొండలు పక్కనేలోతైన లోయలు—వాటిపై దారీ తెన్నూ లేకుండా పెరిగే చెట్లూ చూస్తే భయంవేస్తుంది. ఇందులో మేమూ వున్నామంటూ విచ్చలవిడిగా స్వేచ్ఛావాయువులు పీలుస్తూ ప్రకృతి

...ందిన విషయం మీ అందరికీ తెలిసిందే-
సినిమా జీవితమార్గంలో దాదాపు 16 సంవ
...్సరాలుగా రాత్రింబగళ్ళు పనిచేసి-శారీరకం
...గా, మానసికంగానూ కొంతవరకూ తప్పి
...పోయానని ఒప్పుకుతీరాలి. ఆరోగ్యం ఎంత
...చిదైనా విరామం లేకుండా పనిచేస్తే
... గట్టిదైనా ఎంతకాలం పనిచేస్తుంది.
...వులు తయారు చేసిన కారుకైనా బాగా
...ంకుతుందిగాని - సృష్టి తయారు చేసిన ఈ
...జన్నీకు మనం మనసు పెట్టకపోతే బాగా
...కగు. ఏ ఆరోగ్యం కొరకు పిక్చర్లు ఒగ్గిం
...లో ఏ ఆరోగ్యం సాధనంగా ఆరోగ్యకర
... విజయాలు సాధించాలనుకున్నానో
...గత సంవత్సరం వేసవిలో వచ్చిన
...వెంట ఒత్తిడిమూలంగా కొత్త దెబ్బ
...ది-గత 10 సంవత్సరాలుగా నిలబెట్టు
... ఆరోగ్యం కొంచెం సన్నగిలింది-వేడి
... తట్టుకోలేక ఒడిలిపోయాను-చిక్కిపో
...ను-ఇది అభిమానులు గ్రహించారు- నేనూ
...ంచాను-దాని ఫలితంగా మొన్న వేస
...కుటుంబసమేతంగా కొడైకెనాల్
...బయదేరాను-

* * *

...న్ 17 ఉదయం; కొడైకెనాల్ కొండ
... దిగాం. ఆహా ఏమి మలయమారుతం.
... గాలి. ఎంత కమ్మగా వుంది. కొండ
... సముద్రమట్టానికి 45 మైళ్ళ వున్నాం.
...డినుంచి చూస్తూవుంటే కొడైకెనాల్
...లన్నీ వరుసగా కన్పిస్తున్నాయి. అంతే
... ఆ కొండలన్నీ వేడిమికి ఒడిలిపోతా
...ట్లు సూర్యుని బారినుండి తప్పించడానికి
... మేఘాలన్నీ ఒక్కుమ్మడిగా గుమి
... గొడుగులా తయారై కాపాడుతు
...యి. ఈ విచిత్రం చూస్తుంటే ఎంతో
...ం వేసింది ఏమిటో అంతా అయో
... 350 మైళ్ళ దూరాన ఆ వేడి ఏమిటి-

మానవసంచారంలేని ప్రదేశాల్లో కూడా—అందమైన పూవులు వివిధరూపాలతో, వివిధ రంగులతో అగుపిస్తాయి. వీటిని చూస్తే ఎంత ఆనందిస్తామో అంత పడతాను.

మానవుల్లో కొంతమంది మన స్తత్వ ప్రకారం—ఒక స్త్రీ ఒక చక్కటిచీర కొనుక్కుంటే—ఒక అందమైన నగ చేయించుకొంటే-వాటిని ఎప్పుడు ధరిస్తామా, వాటితో కూడిన నా అందాన్ని ఎప్పుడు నలుగురూ తిలకిస్తారా, ఆనందిస్తారా, నే నందమైనదానినని ఎంత ఎక్కువగా అనుకుంటారా అని ఎగురుతూ వుంటుంది. అలా* పురుషునకుకూడా. ఇది ఎక్కువ మందిలో వుండే మనస్తత్వం—స్వార్థం.

కాని ఈ పువ్వులు మెప్పు మెహర్బానీ ఆపేక్షించకుండా నిస్వార్థంగా బ్రతుకుతాయి. బహుశా ఇంకో కారణం వుండవచ్చు. ఎవరైనా చూస్తే వాటి అందాన్ని ఆస్వాదిస్తారని త్రుంచి, ధరించి నాశనం చేస్తారనే భయంతో నిర్జనప్రదేశంలో (అడవి కాచిన వెన్నెలలాగా) ఎవరూ చూడకుండా మొలకలెత్తుతా యేమో.

ఏమిటో వీటి మన స్తత్వం—అర్థం కాదు.

వీటినిగురించి ఆలోచిస్తుంటే; "మానవుల్లో కూడా ఇలా "మట్టిలో ఉద్భవించిన మాణిక్యాలు ఈ సృష్టిలో ఎందరు వున్నారో వారిని చూడలేకపోతున్నాము. ఉన్నవారితోనే సంతృప్తిపడుతున్నాం. వీరి అందచందాలూ, శక్తిసామర్థ్యాలూ ఎప్పుడు బయటపడతాయా" అనిపిస్తుంది.

* * *

ఒకరోజు ఊరుకు పెద్దగావున్న ఎత్తైన కొండలు వుండే ప్రదేశానికి వెళ్ళాం.

---

* శ్రీ రామకృష్ణరావు, శ్రీమతి భానుమతి.



# ★ రంగుటద్దాలు ★

ఎంత ఎత్తు! చూస్తే భయం వేస్తుంది ఒకసారి క్రిందికి చూస్తే కళ్ళు తిరుగుతాయి. గుండె ఝల్లుమంటుంది. పొరపాటున కాలుజారితే మధ్యలో దేనికీ అంటుకోకుండా తిన్నగా 7500 అడుగులు క్రిందికిజారి కొలగర్భంలో కలిసిపోతాం.

ఇక్కడొక వింత—ఇంత ఎత్తయిన, భయంకర ప్రదేశంలో "మాకు భయమేమీ వుండదు—లేదు మేం శాశ్వత ప్రేమికులం. దంపతులం" అన్నట్లు పొడుగాటి చెట్లలాగా రెండురాతి స్తంభాలునిలబడివున్నాయి—అందరూ అక్కడికి ఆ దంపతుల్ని చూడడానికి వెళ్తారట. వీటిని "పిల్లర్ రాక్స్" అంటారట ఈ రెండు స్తంభాలూ "మమ్మల్నెవరూ తాకరు, అంగుళం లేరు" అంటూ చేయీ చేయీ కలుపుకొని స్వేచ్ఛావిహారం చేస్తున్నట్లు అగుపిస్తాయి అంతేకాదు వాటి ప్రేమ సన్నగిల్లిపోకుండా, వాటిదాంపత్యం ఎప్పుడూ పచ్చగా కళకళలాడేలా ఆ రెండిటి చుట్టూ అందమయిన మధుపర్కాలు చుట్టినట్లు లతలు పెనవేసుకొని వున్నాయి దానికితోడు ఆలతలకు పూవులు పూచి—అవస్థాగ్రేకు మరింత అందాన్ని చేకూరుస్తూ వాటి సువాసనతో ఆ శాశ్వతదంపతులకుఆనందాన్ని చేకూరుస్తాయి ఒక్కొక్కప్పుడు ఈ దంపతుల్ని చూచి, చూడవచ్చే మానవదంపతులు దృష్టిపోవం పెడతారో అన్నట్లు పొగమంచు వచ్చి ఈ దంపతుల్ని కమ్మివేస్తుంది 5 నిమిషాలు ఇలా ప్రతి అరగంటకొకసారి జరుగుతుంది ఈ పద్ధతిని గురించి ఊహా ప్రపంచంలో ఇంకొంత దూరం వెళ్ళుకుపోతే అరగంట విరామం, 5 నిమిషాలుకనుపించకపోవడం— వింతగా తోస్తుంది ఏమేమో అనిపిస్తుంది అది అంతే.

అదే రాత్రి ఒక ప్రమాదం జరిగింది.

మాకుటుంబమంతా భోజనంచేస్తున్నాం. ఆగదిలో నుండి చూస్తె వెన్నెల కనిపిస్తుంది. భోజనాలయ్యాక బయటికి వచ్చిచూస్తే— ఎంత హాయిగావుంది. చల్లనిగాలి- తెల్లని-వెన్నెల- అలాగే 5 నిమిషాలు నిలబడిపోయాను ఈగొడవ అంతా మాకోసం అని అందరిలాగానే నేనూ అనుకున్నాను. అలా కొదంటూ రెండు పొడుగాటి యూకలిప్టస్ చెట్లు కనిపించాయి -ఆ చల్లని చిరుగాలిలో-హాయిగొలిపే ఆ వెన్నెల రాత్రిలో 'మా స్వేచ్ఛకు అడ్డులేదంటూ' ఇవన్నీ మాకోసమే అంటూ ఆ రెండూ సరాగా లాడుకుంటున్నాయి, ఒకదానికి ఒకటి దగ్గరగా లాగుతూ, ఆ ఊపుకు వచ్చే గాలినే శృతిగా మార్చుకొని-సినిమా దంపతులలాగా ఉయ్యాలలూగుతూ, డూయెట్ సాంగ్ (యుగళగీతం) పాడుతున్నట్లు అనిపించింది-ఆ ప్రణయనర్తనం ప్రళయ తాండవంగా మారుతుందని నాకేం తెలుసు-ఆ జంట ఆనందాన్ని ఊహించుకుంటూ పరిపరి విధాల వర్ణించుకుంటూ అలాగే తన్మయుడినై నిలబడిపోయాను. నివలా నిలబడితే నేను చూచి సహించలేనంటూ గాలి ఎక్కువగా ముందుకొచ్చింది. నే వెనుదిరిగాను- తలుపు మూయబోయాను-అంతలోనే గాలి పెనుగాలిగా మారింది. వర్షాన్ని తోడు తీసుకొచ్చింది-మళ్ళీ వెనుదిరిగి చూచాను ఆజంట ఆ గాలికి దాగుడుమూతలు ఆడు



చేతనావారి 'గుళ్ళోపెళ్లి' చిత్రంలో లక్ష్మీకాంత, కృష్ణకుమారి, కె. వి. ఎస్. శర్మ.

ఉంటూ అపుడప్పుడు దగ్గరకొచ్చి చుంబనాలు సాగిస్తున్నాయా అనిపించింది— కాని ఈ ప్రకృతి ఎంతమంచిదో ఒక్కొక్కప్పుడు అంత చెడ్డది అనిపిస్తుంది. ఆ జంట ప్రేమకలాపాన్ని సహించలేకపోయింది. విజృంభించింది. ఆజంట తట్టుకోలేకపోయింది. తట్టుకు నిలబడడానికి కొంతసేపు పెనుగులాడి గిలాగిలా కొట్టుకొన్నది. నేను ప్రాణాలుగ్గబట్టుకొని కిటికీలోంచి చూస్తున్నాను. గుండెకు దడ పెరిగింది. దడబడలతో మిరుమిట్లు గొలిపే మెరుపు వచ్చింది.—భయమేసి కళ్ళుమూసుకున్నాను. ఫెళ ఫెళమని శబ్దం వినిపించింది. నా శరీరం కంపించింది. కళ్ళు తెరిచాను. విధ్వంసం పూర్తి అయిపోయింది. అంతా శూన్యం.

నడుం విరిగి చెట్లు రెండూ నేలకూలాయి. అబ్బ ఎంత ఘోరం — ఈ ప్రకృతి ఇంత పాడుదెం — ఏ మాత్రం జాలైనా దీనికి లేదే— నోరులేని ఈ జంటమీద దీనికెందుకూ ఇంతకోపం అనుకుంటూ మెల్లిగా నా గది లోకి వెళ్ళి పడుకున్నాను.

ఆ రాత్రంతా దీనికి సంబంధించిన కలలే— ఈ ప్రకృతికి మాత్రమే కాదు. దానిసృష్టికి సంబంధించినజీవకోటి అంతటా—ముఖ్యంగా మానవులలో ఈ తత్వం ఛాందసత్వమై స్థిరపడిపోయింది. వేళ్ళుపారి ప్రబలం అయింది. ఇది పరంపరంగా వస్తున్నదన్నమాట. లేకపోతే ప్రకృతి, మానవులూ కలిసి ఆదర్శ ప్రేమికులు లైలా, మజ్నూలనెందుకు హతమారుస్తారు. ప్రేమైకజీవులు అనార్కలీ సలీములనెందుకు క్షోభ పెటారు ?

ఇంకో రోజు వూరుకు ఉత్తర ప్రాంతంలో వున్న సీనరీ చూస్తే బాగుంటుందన్నారు. బయలుదేరాం. అది కూడా చాలా ఎత్తయిన ప్రదేశం. అక్కడ చిన్న గుడి కూడా వున్నది—అది సుబ్రహ్మణ్యేశ్వరస్వామి దేవాలయమట. ఆ గుడికి అందరూ వెళ్ళి వారు చేసిన పాపాలను ఆ స్వామికి అందజేసి వస్తారట. ఆ గుడి ప్రక్కనే రెండు ఎత్తయిన కొండలు అందమైన రూపం దాల్చి వున్నాయి—అదోకలోయ. ఆలోయ నుండి దూరంగా పళని దేవాలయం లీలగా కనిపిస్తు ఉంటుంది. ఆలయ శిఖరం, ఈ గిరి శిఖరం పై నుండి లోయమధ్యగా చూస్తూ వుంటే చాలా అందంగా వుంటుంది. అక్కడ ముఖ్యంగా గమనించవలసినది మేఘమాల ప్రదర్శన—ఆ మేఘాలకు చలనం లేదు— ఆ లోయలో వుండే మేఘజాతులను మేమో అది — సహజసౌందర్యానికి ప్రకృతినే చెప్పుకుంటాం కాని దీనికికూడా అసహజత అనేది ఎంత దగ్గరలో వుంది— ఎన్ని సన్నివేశాలు అసహజంగా కనిపిస్తాయా అని అనిపిస్తుంది.

నిశ్చలమైన ఆ మేఘాలు ఈ ప్రకృతి మందిరిలో తోరణాలు లాగా కనిపించాయి నాకు. మేఘమాలలు వరుసక్రమంగా ఆ



సారథివారి 'భాగ్యదేవత'లో జగ్గయ్య, సావిత్రి

నిలబడ్డాయి నీలిరంగు దుప్పటిపైన మల్లె పూవులు విరజిమ్మినట్లు క్రింది నుంచీ చూస్తే నీలాకాశానికి వెన్న ముద్దలు విసిరికొట్టినట్లు అనిపిస్తుంది ఆ దృశ్యం — నేనూ నిశ్చలంగా నిలుచొని అలాగే ఆలోచిస్తున్నాను

ఇంతలో వెనక నుంచి చల్లని గాలి వచ్చి వీపు నిమిరింది. నను దిరిగి చూచాను — కారు మబ్బులు పందెం వేసుకున్నట్లు పరుగెత్తుకొస్తున్నాయి నిమిషంలో అంతా చీకటిమయం చేశాయి

ఛీ ఛీ ఏమునారి ఈసృష్టి ఇంత ఈర్ష్యకో దీనికి! దీనికింత ఓర్పులేని తనం — దీని సహజధోరణే ఇదేమో! ఈ ప్రకృతిలో ఈ స్వభావం వుంది గాబట్టే మన జాతికి కూడా ఆ స్వభావం వచ్చింది లేకపోతే ఈ ఓర్పు లేని తనమేమిటి—ఒకరి ఆనందం ఇంకొకరికి వెగటా! ఒకరి సుఖం ఇంకొకరికి కష్టమా! ఇలా అనుకుంటూ మెల్లగా కారులో దూరాను ఆ రోజుకు ఇంటికి చేరాం - ఇలాగే అనేక రోజులు ప్రకృతికాంతను తిలకించినప్పుడల్లా అనేక రకాలైనవూహాలు మనస్సులో తిరుగాడుతూ వుండేవి—అనేక విషయాలు సింహావలోకనం చేసుకుంటే ఈ పై విషయాలకూ, మానవ మనస్తత్వానికి చాలా సామ్యం వుందనిపించేది—ఇలాగే నాలో నేను మననపడి, చూసిన విషయాలూ, తోచిన విషయాలూ మథనం చేసుకొని మార్పులూ, కూర్పులూ తీర్పులూ చేసుకొనేవాణ్ణి—ఇనొక ఊహా ప్రపంచం — ఊహించుకుంటూ పోతే అంతెక్కడ-ఎక్కడ తేలతాం.

ఈ ప్రకృతి పాఠాలలో చూడదగ్గవి, చూచి నేర్చుకోతగ్గవి— నేర్చుకొని ఆచరింపతగ్గవి—అనుకున్నా, ఆచరించలేనివి విషయాలు చాలా వున్నాయి ఇనొక మనోసముద్రం — తెన్ను తెలియక కొట్టుకులాడే ప్రాణులంమనం

మంచి ప్రక్కనే చెడు, తీపి ప్రక్కనే చేదూ, గులాబీపక్కనే ముల్లు, అందం ప్రక్కనే వికారం, సహజం ప్రక్కనే అసహజం సహనం పక్కనే అసహనం, శాంతిం ప్రక్కనే క్రోధం, ఈలక్షణాలన్నీ మనలో ప్రక్క ప్రక్కనే పోట్లాడుతూ వుంటాయి ఈలక్షణాలన్నిటికి అతీతులమైన ప్రశాంతింగా బ్రతకగలమా?

అసలు వీటన్నిటి కారణం మన మనస్తత్వం. దానికి మూలం ప్రకృతి తత్వం ఈతత్వానికి సంప్రదాయానికిసామ్యమైన మనసామాన్యుల మనస్తత్వ ధోరణిని గాని వారిలో వుండే వివిధ భావాల సముదాయాన్ని గాని మనం విమర్శించలేం విమర్శించకూడదుకూడా ఈ తప్పువారిది కాదు. ఇ ప్రకృతిసిద్ధం ఈధోరణి నుండి బయటపడాలంటే చాలా కష్టం అలా బయటపడి అన్ని విషయాలను సాదరభావంతో చూచే అదృష్టవంతులైన పెద్దలు మనలో చాలా తక్కువ సహజధోరణిలో చూచే సామాన్య పౌరులు మనలో చాలాఎక్కువ. అటువంటి సామాన్యుల్లో నేనూఒకణ్ణి. మంచి చెడ్డలను తర్కించుకోవడం ఒక నిర్ణయానికి రావడం అనేది ఆయా వ్యక్తుల దృక్పథం మీద ఆధారపడి వుంటుంది. కామెర్లు వచ్చిన వానికి ప్రపంచమంతా పచ్చగా కనుపించినట్లు, మన ఆత్మకు మనం చెప్పుకునే అర్థాల పైన, మన మనసు తగిలించే రంగుల అద్దాల పైన అంతా ఆధారపడి వుంటుంది

మనఆత్మకు సరియైనఅద్దాన్ని తగిలించుకోలేమా! గులాబీ అంటుకున్నవున్న ముళ్ళను వదిలి పూవును, దాని అందాన్ని ఆస్వాదించి, ఆనందించే సంస్కారం అలవరచుకోలేమా!—

ఆత్మసుదితో ప్రయతి. కే. విరించి

# ★ బొంబాయి లేఖ ★

ఒక్కలా కనబడే దుర్గుణం ఉప్పుకప్పురాలకే కాదు; చిత్రాలకీ, చేత్రాలకీకూడా ఒకొక్కప్పుడు దాపురిస్తూ ఉంటుంది. చూడడానికి మంచి చిత్రం నాటకం కూడా చెత్తచిత్రం తాలూకుగా ఉన్నా, తీరా చూశాక తేడా తెలియవచ్చు. ఒకొక్కసారి కనబడదు. ఉప్పులో కర్పూరం పరిమళం ఉన్నట్టు (ఉంటేదని మాకు తెలుసు) చెత్త కథలలో కూడా మంచి సన్నివేశాలు దాగి ఉండవచ్చు. మెహతాబ్ ఫిలింస్ వారి 'కభీ అంధేరా కభీ ఉజాలా' ఈ బాపతు చిత్రం. పాతకథలూ, వాటిలో కొండగుర్తుఘట్టాలూ కొన్ని పేరుకూడా మార్చుకోకుండా ఇందులో చోరబడి పోయాయి. కథపొడుగునా తాళ వృక్షాలూ, శిశుఫలాలూ, కొండలూ నిలబడే కథకి అవసరమైనప్పుడల్లా కాకతాళీయమైన సంఘటనలను ఏర్పాటు చేసి పెడుతూ ఉంటాయి. ఇవన్నీ ఇలావున్నా ఈ చిత్రంలో విశిష్టత ఉందనిపిస్తుంది. ఈ పోలికలన్నిటి మధ్యనా, ఈనాటి (బొంబాయి, మద్రాసీ) చిత్రాలు వేటికీ పోలని లక్షణాలు కొన్ని ఉండి మనని ఆకర్షిస్తాయి. ఒక్క మాటలో చెప్పుకోవాలంటే, మనం ఆశించనిది, ఎదురుచూడనిది ఈ చిత్రంలో తటస్థపడుతుందనాలి. మాటవరసకి ఒక్క కిశోర్ కుమార్ మినహా, మిగతా నటీనటులంతా మనం మామూలుగా ఆ మనుష్యులనుబట్టి అనుకోని పాత్రలు ధరించారు. కథాస్థలాలు మన మెరిగినవికావు. చిత్రంగా, స్రియలిస్టు స్వప్నంలో (అసలు కలలే అవాస్తవిక చిత్రాలలా ఉంటాయి) దృశ్యాలలా కనిపిస్తాయి. సంగీతంకూడా అలాటిదే. ఓ. పి. నయ్యర్, ఇందులో పాటవరసలన్నీ కలలో కట్టి ఉండాలనిపించింది. దానికి నికరంగా పోల్చుకోతగ్గ తలాతోకా దొరకవు. అయినా పాటలు గమ్మత్తుగానే ఉన్నాయి. ఆయా విధాల ఈ చిత్రం ఒకసారి చూడవచ్చు.

భూలోక కాంతరానికి చెందిన కథాకమామిషు కాబట్టి నటులుకూడా కథోచితంగానే, చంద్రలోకానికో అంగారక లోకానికో చెందిన సినీ నటీనటులలా (వారి నటనాశిల్పంతో మాకు ఏమంత పరిచయం లేని మాట నిజమే) నటించడానికి యథోచితంగా కృషి చేశారు. నూతన్, కిశోర్, శేఖర్, చిత్ర, కుంకుం, లలితాపవార్, మదన్‌పురి, కె. ఎస్. సింగ్, కే॥ శే॥ యాకూబ్ ప్రభృతులంతా ఇందులో భాగస్వాములు. బహుశా వీరింతకుముందు ఇటువంటికథలలో నటించి ఉండక పోవడమే మనలో ఈ భావాలకు కారణం కావచ్చు.

ఏకీభవిస్తారు. మొదటిది ఒక అందమైన చిన్నది; ఆమె నాట్యాలూ. ఆ అమ్మాయి పేరు 'రతి'. (తెలుగు నటి కృష్ణకుమారి) రెండవది ఇతర నాట్యాలు. చూడవలసి వాటిని ఆహ్లాదకరంగా రూపొందించిన ఛాయాగ్రహణ శిల్పం. సంగీతం ఇంకొంచెం



14 ఏళ్ళ క్రితం 'మొగలీ అజామ్'లో అనార్కలీగా నర్గీస్.



ఏడేళ్ళ నిర్మాణం సాగిన 'మొగలీ అజామ్' టెక్నికలర్ చిత్రంలో అనార్కలీ,

బాగుండి ఉంటే నాట్యాలు మరింతబాగుండేవనిపించింది. ముఖ్యంగా నూతన్, బృందం చేసిన భాంగ్రానృత్యం, రతి, కుంకుం విడివిడిగా చేసినవి చాలా బాగున్నాయి. మొత్తంమీద ఒకసారిచూడతగిన చిత్రం. చాలా విచిత్రమైన చిత్రం.

## మొగలీ అజాం

చారిత్రక చారిత్రక చిత్రం 'మొగలీ అజాం' త్వరలో విడుదలకాబోతోంది. ఈ చిత్రం చరిత్ర: వయసు 14 సంవత్సరాల బోలెడన్ని లక్షలు. 1945లో బొంబే టాకీస్‌లో దర్శక నిర్మాత కె. ఆసిఫ్ దర్శకత్వం క్రింద మరో నిర్మాత ఈ చిత్రాన్ని ఆరంభించాడు. అప్పట్లో అనార్కలీ పాత్రకు నర్గీస్‌ను బుక్ చేశారు. స్వాతంత్ర్యం వచ్చాక, ఆ నిర్మాత ఈ చిత్రాన్ని వదిలి పాకిస్తాన్ తరలిపోవడంతో ఇది తారుమారైంది. కె. ఆసిఫ్ నిర్మాతగా బాధ్యత స్వీకరించి నిర్మాణం సాగించ నిశ్చయించాడు. అప్పుడే పైకి వస్తున్న దిలీప్‌కుమార్ అ... నటుడిని మాని సలీమ్‌పాత్రకు ...కున్నారు. మరి నాలుగేళ్ళ తరువాత, అగ్రశ్రేణి బాక్సాఫీస్ హీరో దిలీప్‌కుమార్, మధుబాల, అప్పుడు ఉచ్ఛదశలో ఉన్న నిగార్ సుల్తానా ప్రభృతులతో నిర్మాణానికి ఏర్పాట్లు పూర్తిచేసి 1952లో ఆరంభించారు. డబ్బు, స్టుడియోలలో చోటు, తారల కాల్‌షీట్‌లూ మరికొన్ని సినీకారణాల వల్ల ఆలస్యమై నిర్మాణ వ్యయం పెరిగే వరకు, ఆసిఫ్ దీనిని కలర్‌లో తీయాలనుకున్నారు. కొన్నాళ్ళకి ఆ పనీ ఆరంభించి ఇన్నాళ్ళకి ముగించారు. నౌషద్ దీనికి సంగీతం సమకూర్చారు.

ఈ చిత్రం పూర్తి అయేలోగా నిర్మాతే, శశిధర్ ముఖర్జీ, ఒక అనార్కలీ (బీనారాయ్, ప్రదీప్‌కుమార్) తీసి ఘనవిజయం సాధించారు.

సినీమా సీమ అంతటా కిందటివారం శుభవార్తావరణం ప్రవర్తిల్లింది. నర్గీస్‌కు పుత్రోదయం, నూతన్‌కు వివాహం నిశ్చయం కావడం, ఇటీవలే బేబీఅన్న విశేషణం తొలగించి కుమారి అని ఏర్పాటు చేసుకొన్న వర్ధమాన తార నందాకూడా ఇపుడు శ్రీమతి నందా కావాలని సంకల్పించడం, చిరకాలంగా సంతానవతి కావాలనుకొంటున్న నటి నిరూపరాయ్, ఆరుమాసాలలో ఆ సంకల్పం సిద్ధించబోతున్నట్లు ప్రకటించడం. ఇవన్నీ విశేషాలే. నిరూప మాట ఎలా ఉన్నా నూతన్, నందాలు పెళ్ళికావడంతోటే సినిమానుండి వైదొలగుతారని తెలుస్తోంది. అలాగే, నర్గీస్‌కూడా ఇటుపై సినిమానుండి విరమించి గృహిణిగా ప్రశాంతి జీవనం సాగించాలనుకుంటున్నట్లు కూడా తెలుస్తోంది. నర్గీస్‌కు ఇపుడు ఒక్కటే చిత్రం ఉంది. బహుశా ఇటుపై కొత్తవి ఒప్పుకో

# ఆడవాళ్ళతో వచ్చిన చిక్కే ఇది

కొండముది హనుమంతరావు

పరమమూర్ఖుని మనస్సులా లోకం పెంజీకటిలో ఊగుతోంది.

మహాయోగి మహోజ్జ్వల మనస్సులా ఇంజన్ లైటు వెలుగుతోంది.

సుదీర్ఘ వియోగానంతరం ప్రియసందర్శనానికి బయల్దేరినవాడి మనస్సులా ఎక్స్‌ప్రెస్ పరుగెడుతోంది.

ఎనిమిది దాటింది.

వేడి కప్పుకుని-హిగిన్‌బాదమ్స్‌లో కొనుక్కున్న పుస్తకం తెరిచాను.

తొమ్మిదయింది.

విసుగ్గా ఉండి పుస్తకం మూసేశాను. కాసేపు నిద్రపోదామనుకుని చుట్టూ చూశాను.

ఏభై ఏళ్ళు పైబడ్డా (అలా అనిపించింది, మరి) నూట ఏభై ఏళ్ళవానిలాగా ఉన్న అప్పుడే ఎక్కిన దృఢకాయుడు-లాఠీకర్రలాగ ఉన్న స్పెన్సర్ చుట్టను అతిసులభంగా దగ్ధం చేస్తున్నాడు.

ఆ పక్కనే ఇంకో కుటుంబం. తొమ్మిది దాటినా ఆ పిల్లలు ఇంకా తన్నుకుంటున్నారు. ఆ తన్నులాటలో ఒక ప్రబుద్ధుడు ఒకదాని గాజులు బదాబదలు చేశాడు.

"నా గాజులు కట్టించు"-ఆ పిల్ల కాళ్ళు నేలకేసి బాది, చేతులు గాలిలోకి ఊపుతోంది.

"నిన్న నా బలపం పారేసివే. అది తెచ్చేయి" వాడు ఎదురుదెబ్బతీశాడు.

అంతలో ఆ పిల్ల మెరుపుదాడి చేసి వాడ్ని రక్కింది. వాడూ ఏడుస్తూనే దాని జడ చేత్తో లంకించుకుని-దాని వీపు వంగదీసి దభీదభీ బాదేశాడు. చివరకు ఇద్దరూ ఒకే శ్రుతిలో రాగాలాపన ఆరంభించారు.

అంత జడివానలోనూ-ఆ తల్లి నిర్వికారంగానూ, నిర్లిప్తంగానూ, ఎంతో నిరామయంగానూ ఏదో పుస్తకం చదువుకుంటున్నది. ఆ తండ్రి, పాపం. ఆ పిల్లలను సముదాయించాలనీ, నిశ్శబ్దంగా నిద్రపుచ్చాలనీ శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు. ఏంలాభం? ఆ కోతులు మాటవింటేగా!

ఆడవాళ్ళతో వచ్చిన చిక్కే, ఇది! మగవాడు కాస్త మెతక అయితే చాలు-ఆ విషయం ఆ ఇల్లాలు కనిపెడితే... ఆ మానవుని పని ఇక సరి! ఆ తోడేళ్ళను ఆ సాధువుమీదకు నిర్దాక్షిణ్యంగా తోలి ఊరుకుంటుంది - తనకేమీ బరువూ, బాధ్యతా లేనట్లు.

మొన్న, అదే అటు మొన్న, అక్కయ్యగారి ఊరినుంచి మనిషి వచ్చాడు. అక్కయ్యకు (పురిటి) నొప్పులు వస్తున్నయ్యనీ, అమ్మను వెంటనే బయల్దేరిరమ్మనీ-కబురు.

తప్పేముంది?-అమ్మకు. అమ్మజీవితం ఈ పురుళ్ళకే సమర్పితం అయిపోయింది. కూతుళ్ళకూ, కోడళ్ళకేకాదు-మా బంధువులిళ్ళలో ఎవరికి పురుడొచ్చినా అక్కడ మా అమ్మ ఉన్నదన్నమాటే.

నీ చల్లని చేతిమీదుగా ఆ చెంబెడు నీళ్ళూ పోయించి పోవాలి వదినా అనో, అక్కయ్యా అనో, పిన్నీ అనో—ఎప్పుడూ అమ్మకు కబుర్లూ, పిలుపులూ.

ఇంతవరకు అమ్మచేతిమీదుగా ఎన్ని పురుళ్ళు పోయించిందో లెక్కలేదు. అందరూ సలక్షణంగానూ, సురక్షితంగానూ ఉన్నారు. అదే అందరికి నమ్మకం—అమ్మ చేయి మహాచలవని. అదీగాక, అమ్మ ఎంత విపత్తు సమయంలోనయినా ఆశ జారిపోకుండా, ధైర్యం నీరుకారిపోకుండా—ఏవేవో కబుర్లూ, కథలూ చెపుతూ కాలక్షేపం చేసివేస్తుంది. తీరా ఆ ఆపదనుంచి ఒడ్డున పడగానే—ఆక్షణంలో తాను ఎలా భయపడ్డదీ, అప్పుడు ఈమె ఎంత ధైర్యంతో నిలబడ్డది గుర్తుచేసికొని—"ఈ సమయంలో నువ్వే గనుక లేకపోతే, మేమేమయ్యేవాళ్ళమో నమ్మా! ఆ దయామయుడు నిన్ను పంపాడు. మమ్మల్ని యీ మాత్రం గట్టున పడేశావ్. నీ మేలు మరిచిపోలేం" అని ప్రశంసించి పంపిస్తారు. అమ్మకూడా ఆ మాటలకే ఉబ్బి తబ్బిబ్బైపోయి, అన్నాళ్ళూ వేళకు నిద్రాహారాలు లేని కష్టం మరిచిపోయి—ఇంటికి వచ్చి రెండు రోజులైనా రెండు కాళ్ళూ ఒకచోట పెట్టి [illegible]మాలుగా శ్వాస పీలుస్తుందో లేదో మళ్ళీ ఇంకో చోటనుండి కబురు "వెంటనే రావాలి' అని. ఆ రెండు మాటలు వ్రాస్తే చాలు—మా అమ్మ బయల్దేరుతుంది. కాని ఆడవాళ్ళతో వచ్చిన గొడవే ఇది—ప్రతి చిన్న విషయానికీ ఒట్లూ ప్రమాణాలూ 'రాకపోతే మమ్మల్ని చంపుకు తిన్నట్టే' అని వ్రాస్తారు.

సరే అమ్మను అటు అక్కయ్య దగ్గరకు పంపించి, నేను శ్రీమతికోసం బయలుదేరాను—రెండు రోజులు మాత్రం సెలవు పెట్టి.

అత్తవారింటికి వెళ్ళి శ్రీమతితో సంగతి సందర్భాలు చెప్పి—'రేపు వెళ్దాం' అన్నాను.

"రెండు వారాల్లో పండుగ ఉంటే—యిప్పుడెలాగండీ?"

నాకు చటుక్కున కోపం వచ్చింది.

"రెండువారాలకి వచ్చే పండుగకోసం నన్ను చెయ్యికాల్చుకోమంటావా?"

"ఆ మాట నేనన్నానా?"

"మరి అయితే పస్తుండమంటావేమిటి?"

"పస్తుండాల్సిన అవసరమేమొచ్చె. హోటళ్ళన్నీ మూసేశారా, ఏం?"

"హోటలు మెతుకులు గతకటానికేనా నిన్ను చేసుకుంది?"

"అయితే—హోటలు మెతుకులు తప్పించుకోవడానికేనా నన్ను చేసుకుంది?"

ముఖం ఎఱ్ఱబడ్డది. బుంగమూతి పెట్టి నుదురు ముడివేసింది. పెదవులు అదురుతున్నాయి. నాకు జాలేసింది—శ్రీమతి ప్రశ్నా, వదనమూ చూస్తే.

"పరిస్థితి అర్థంచేసుకో. ప్రాణమిలాడే భంగపడి రెండురోజులు సెలవుతీసుకుని వచ్చాను."

నేను ఏమాత్రం లొంగిపోయినట్లు కనపడ్డా చాలు, శ్రీమతి పాదాక్రాంతమే అవుతుంది. ఉరిమే మేఘం గల్లగాలికి నిరవశం సహజం. ఆ విషయం మరిచిపోయి దబాయించామా బెట్టు తీసుకుంటుంది.

"సరే లే—నీ మాటనే ఎందుకు కాదనాలి. రెండు వారాలేగా—ఎలాగో నా తిప్పలు నేను పడతలే. పండుగ వెళ్ళినతర్వాత వద్దువు గాని—"

'మీరు కష్టపడటం నాకుమాత్రం ఇష్టమా? ఏదో పండుగ, పుట్టిల్లు. అదీ గాక పండక్కి చాలామంది స్నేహితురాళ్ళు కూడా వస్తున్నారు. ఎన్నాళ్ళో అయింది వాళ్ళను చూసి. మళ్ళీ ఎన్నాళ్ళకో—ముఖ్యంగా సుభద్రా, సుజాతా, అనూరాధా—వాళ్ళు వచ్చినతర్వాత ఎవరెవరిఇంట్లో ఎప్పుడెప్పుడు మహాసభలు జరపాల్సిందీ... ఎక్కడెక్కడ మూన్‌లైట్ డిన్నర్లు ఏర్పాటు చేయాల్సిందీ—డిటెయిల్డ్ ప్రోగ్రాంకూడా తయారుచేస్తూ ఉత్తరాలు రాస్తున్నారు. ఏదో ఆ ఉత్సాహంలో అన్నాను గాని... మీరు కష్టపడాల్సివస్తే నా దిక్కు ఒక్క క్షణం ఉంటుందా? ఆ మాటకొస్తే అసలు ఉండగలనా? మీ ఇష్టం రేపే బయల్దేరుదాం..."

హమ్మయ్య, చిట్టచివరకు గొప్పవిజయం. అయినా మనసులో ఏదో పదార్థం సన్నగా మూల్గింది. ఎంతో ఆశతోనూ,

ఆనందంతోనూ తన్ను ఒక ప్రాణిని అన్యాయం చేస్తున్నానేమోనని.

ఆరునెలలు స్నేహంచేస్తే వారు వీరు, వీరు వారూ అవుతారుట. నాలాగానే వల విసర లేదుగదా—మనసు మూలుగు మాని మౌనం వహించింది.

"నాకు తెలుసు నీ సంగతి. మొదట ఎదురుతిరిగినా, నీలో కాఠిన్యంలేదు. అందుకే నే నెప్పుడూ మురిసిపోతుంటాను. కాపే పిల్లామయితే."

శ్రీమతి మొహంలో ఏవో నీడలు పరుగెత్తినట్లయింది. మరి అవి హృదయంలోని ఏ విధమయిన ఆలోచనల తాలూకో.

ఆ రాత్రి భోజనాల సమయంలో ప్రయాణవిషయం ప్రస్తావించాను. నేయి వడ్డిస్తున్న అత్తగారు విస్తుబోయి నిలబడి పోయింది.

మామగారి చేతిలోని అన్నపుముద్ద విస్తరికీ నోటికీ కాకుండా మధ్యలో త్రిశంకు స్వర్గంలో నివాస మేర్పరుచుకుంది.

బావమరిది గోపీ పకపకా నవ్వేశాడు.

"ఎందుకురా అట్లా నవ్వుతావ్? మంచీ, మర్యాదా లేకుండా?" అత్తగారు కోప్పడ్డారు.

"అదికాదే, అమ్మా. పండక్కి పదిహేను రోజులు ముందుగానే వచ్చిన బావగారు, ఏదో తమాషాకి ఒక మాటంటే వీరలా కొయ్యబొమ్మలయిపోతే నవ్వకేం చేయమంటావ్?"

"అది కాదోయ్—" అంటూ బావమరిదిని సంబోధించినా—అత్తమామలకు అవసరం యొక్క బలీయతను విశదీకరించి—శ్రీమతిని పంపడం తప్పనిసరి అని తేల్చాను.

వాళ్ళ అభిప్రాయంకోసం ఎదురుచూస్తూ కంచంలో నెయ్యి కంచంలోనే ఉంచి చూస్తున్నాను.

"సరే. ఆలోచిద్దాం. ముందు భోజనం చేయవోయ్." అన్నారు మామగారు చిన్నగా నవ్వుతూ—నే నేమో భోజనం చేయటం మానుకుంటానన్నట్లు.

మామగారిమాట ఎలా ఉన్నా అత్తగారు తెచ్చిన టొమాటోల చారు తాలూకు ఘుమఘుమలు త్వరపెట్టినయి.

భోజనాలు ముగించుకుని మధ్యహాల్లో కూర్చునుండగా మళ్ళీ నేనే కదిలించవలసి వచ్చింది.

"రేపుదయమే బయలుదేరుతాం. రేపు రాత్రికయినా అక్కడికి చేరుకుంటేగాని ఎల్లుండి ఆఫీసుకు పోవడానికి వీలుపడదు. అయినా మీకు తెలియందేముంది—" అన్నాను మామగారి నుద్దేశించి.

"రేపెట్లా రేపు బుధవారంకదూ? బుధవారంనాడు పులి అయినా బయల్దేరదంటారు." అత్తగారు అందుకుంది.



ఏమీ అర్థం కాక ఆయన బుర్రమీసాల వంక చూస్తూ నిలబడి పోయాను.

"అలాంటప్పుడు—ఇవ్వాళ రాత్రికే బయలేరితే సరి."

"ఇవ్వాళమాత్రం. మంగళవారం—ఆడపిల్లను అత్తవారింటికి పంపడం..."

"పోనీ—ఎల్లుండి వెళ్ళండి బావా" బావమరిది ఉచిత సలహా.

"అంతేనోయ్. ఎల్లుండి వెళ్ళండి" మామగారి అనుమతి

"ఇన్నేళ్ళొచ్చినయ్—ఏమ్మనిషో? ఆలోచనా, సాలోచనా లేదు. ఎల్లుండి గురువారం కదండీ. దక్షిణదిక్కు ప్రయాణ మెలా చేస్తారు? వారశూలకదూ..."

"పెద్దవాళ్ళమాట కాదనటం మంచిది కాదు బావా. అవు తెల్లుండి వెళ్ళండి" మరదలు మంజుల మృదువైన పెదవులు అతి మృదువుగా కదిలినయ్.

"నీ మొహం—పెద్ద నావసానిలాగా నువ్వొకతెవు. శుక్రవారంనాడెవరైనా ఆడపిల్లను పంపుతారూ?"

దీర్ఘంగా రెండు నిమిషాలు ఆలోచించి మామగారు అన్నారు.

"ఇక చేసేదేముంది? శనివారం. అదీ గురుహూర్తం వెళ్ళింతర్వాత వెళ్ళండోయ్."

"మామగారు చెప్పిన మాట కాదనకు. ఒరేయ్ గోపీ! వీరువాలో పంచాంగం ఇట్లా

# ★ ఆడవాళ్లతో వచ్చిన చిక్కే ఇది ★

తీసుకురా. వర్జ్యం ఎప్పుడో చూస్తారు, నాన్నగారు."

నేను గొంతు సవరించుకునేలోగానే గోపీ పంచాంగం తెచ్చాడు.

"ఆఁ గోపీ—కాస్త చూడు" మామగారు బుజ్జగించారు.

"వాడు చూస్తే ఇక సరే. మొన్న ఏకాదశి ఎప్పుడో చూడరా అంటే పంచాంగం అంతా పైకీ క్రిందకూ గాలించి గాలించి—'యీ నెలలో ఏకాదశి అసలు రానేలేదే అమ్మా,' అన్నాడు. వీడి చదువిట్లా తగలడింది, ఏడవాలో, నవ్వాలో అర్థం కాకుండా వుంది"

మామగారు సుపుత్రుని మేధాసంపత్తికి చిరునవ్వు నవ్వుకుంటూ చేయి జేబులోనికి పంపాడు. కళ్ళజోడు స్వస్థానమాక్రమించుకుంది. పంచాంగం కాగితాలు రెపరెపలాడినయి. కొన్ని క్షణాలు చత్వారపు కళ్ళు తపుల్లాడినయి ఒక్క క్షణం దృష్టి నిలిచింది. మొహం నల్లబారిపోయింది. దీనంగా నా వంక తిరిగిన కళ్ళు—అంతలోనే అత్తగారి దిక్కు చూసినయి

"ఏమిటండీ?" అత్తగారి గొంతులో ఆదుర్దా తొంగిచూసింది.

"ఆనాడు రాత్రి 8 గం. 57 ని. వరకు చతుర్దశి."

అత్తగారు బాధగా నిట్టూర్చింది. ఏమనాలో తోచక నా వంక శూన్యంగానూ, మౌనంగానూ చూసింది.

"సరే ఆమర్నాడు ఆదివారమూ, అమావాస్య."

"సూర్యగ్రహణం కూడా ఉందేమో చూడండి."

కచ్చుమండి అన్నాను లోపలి కోపం కంఠంలో ప్రతిధ్వనించే ఉంటుంది. పొంగే ఉద్రేకం అణుచుకోలేను. లోపల వండిపోతూ బయటకు శాంతమూర్తిలా మెలగలేను. లోపల ఏమాత్రం కోపం లేకుండా బయటకు సింహగర్జనలు చేయలేను. ఈ తత్వమే నేను నటుణ్ని అవుదామని ఎంత ప్రయత్నం చేసినా పరాజితుణ్ని చేసింది.

"అది కాదోయ్ నెమ్మదిగా ఆలోచించు ఇదంతా మనమేమన్నా కల్పించిందా?"

"అయితే మనకు వారం, తిథి లేనివాడు తప్పితే ప్రయాణం కుదరదన్న మాట"

"అట్లాగంటే ఎట్లాగోయ్? ఎంత చదువుకున్నా మంచి చెడూ చూసుకోవాలా? ఇంతలోనే జండాలు తెంచేసుకోలేదుగా—మా ఛైర్మన్ అంతటివాడు.."

"ఎంతటివాడో!"

". తిథీ, వారం, నక్షత్రం చూసుకోందే అడుగు కదల్చడు. అసలు ఏ చిన్నపనీ తాకడు"

"అంటే ఆయ నేపనీ చేయడన్నమాట."

"ఆమాటకొస్తే—ఆయన చేసినన్ని పనులు యీ భూమీద మరెవ్వరూ చేయరు, చేయలేరు."

"అయితే ఆయనకి చాదస్తాలేమీ లేవన్నది నిజం"

'అది కాదోయ్."

"కాదంటే—పగలూ, రాత్రి ఒకేసారి వస్తయి—నమ్మమంటారు"

"అసలు..."

ఇంకేముంది? ఆయ నేదో ఉపన్యాసానికే ఉపక్రమించేటట్లున్నాడు కాకపోతే చర్చ అమీ తుమీ తేలని చర్చ.

ఉపన్యాసం వినే ఓపిక శూన్యం. వాదన నా స్వభావానికే విరుద్ధం అందుకని తేల్చి అన్నాను "ఇక మీ యిష్టం."

నా కోపమూ, నిస్సహాయతా కనిపెట్టి కల్పించుకుని అంది శ్రీమతి

"అవసరం వచ్చినప్పుడు అవన్నీ చూసుకుంటేకుదరదులే నాన్నా.. తప్పని సరి అంటున్నారుగా...వారు మాత్రం ఇదివరకెప్పుడన్నా యింత బలవంతం చేశారా?"

"అది కాదె అమ్మాయ్ " అని అత్తగారేమో సవరణ ప్రవేశపెట్టబోతుంటే కొంత హెచ్చు స్థాయిలో శ్రీమతి ఆధిపత్యం వహించి రూలింగ్ ఇచ్చింది.

"నీకు తెలీదులే అమ్మా! రేపే వెళ్తాం."

శ్రీమతి స్వరంలోని నిశ్చయం వాళ్ళ నాన్న గ్రహించాడు.

"సరే కానీయ్ అమ్మాయ్ ఒక్కమాటోయ్ వెళ్లరుగాని, ఇప్పుడు వెళ్ళితే ఇక పండక్కు రాలేరుగదా. అందుకని ఏదో చీరే సారే, అవీ ఇవీ తీసుకురావాలా? రేపుదయం బండికి కుదరదు. రాత్రికి అనుకుందామా—పసిపిల్లవాడితో, యీ సామానుతో నిద్రలేకుండా ఎందుకు?. ఎల్లుండి ఉదయమే వెళ్ళండి.

"ఇప్పుడవన్నీ ఎందుకండీ—"

"అదేమ్మాటబ్బాయ్? ఎప్పటి ముచ్చటప్పుడే" అత్తగారి ముచ్చటది.

"ఎల్లుండి సెలవులేదండి."

"ఒక్కరోజేగా ఏదో చెప్పు. మరేలా"

"మా ఆఫీసరు అంత మంచివాడు కాదండి"

"పోనీ—నేను రేపిక్కడనుండి మా ఛైర్మన్ గారిచేత ఫోన్ చేయిస్తాలే"

అభిమానం దెబ్బతింది.

"వద్దులెండి. ఎంతయిదయినా, నేను చెప్తే కాదనడులెండి మా ఆఫీసరు కాని ఇప్పుడు ."

సలహాకోసం శ్రీమతి వంక చూశాను.

"పోనీండి—అంతగా చెప్తున్నారుగా, ఒప్పుకోండి"

బతిమిలాడుతున్నట్లుగా ఉన్నాయి ఆ అందమయిన కళ్ళు

కరవమంటే కప్పకుకోపం, విడవమంటే పాముకు కోపం అడకత్తెరలో పడిపోయింది శ్రీమతి. సరేనన్నాను తెగేదాకా లాక్కూడదు మరి!

మర్నాడల్లా కొర్దతోనూ, కొరమ్న తోనూ సరిపోయింది

ఆ మర్నాడుదయం పాసింజరుకు ప్రయాణమయినాము.

చీరెసింగారించేలోగా ఊరు మాటు మణిగిందని—రాణీగారు పసుపురాయించుకున్న కుడిపాదం గడపదాటించే సరికే రైలువెళ్ళిపోయిందన్న శుభవార్త వీనుల విందు చేసింది.

ఇక ఎవర్నని ఏం లాభం?

గతజలసేతు బంధనంవల్ల ప్రయోజనం?

కర్తవ్యతా విమూఢుడనై కుర్చీలో కూలబడ్డాను.

నా దీనస్థితి చూసి జాలి చెందినట్లు దగ్గరలో మరో కుర్చీలో కూర్చుంటూ మామగారన్నారు—"పోనీ, మా ఛైర్మన్ గారి కారుకోసం కబురు చేద్దామా?"

ఒకటి రెండు మైళ్ళా?—దాదాపు వంద మైళ్ళ ప్రయాణం.

"వద్దులెండి. ఎలాగూ ఇవ్వాళ ఆఫీసుకు పోలేనుగదా సాయంత్రం ఎక్స్‌ప్రెస్‌కు వెళ్తాము లెండి"

"ఆహాఁ! మొహమాట పడదోయ్. మా ఛైర్మన్ గారు మన మెంత చేస్తే అంత! అందరూ అంటారు—ఆయనకు కుడిభుజం మనం అని. కాని అసలు రహస్యమేమిటో తెలుసా? చెప్పంది ఎట్లా తెలుస్తుందిలే. . అవసరం వచ్చింది కాబట్టి తప్పక, అదయిన నీవని చెప్తున్నా—కడుపుతో దాచుకో

ఆయన అనేవాడు ఒట్టి మట్టిబొమ్మ; ఆయనలోని చైతన్యమే మనం. ఆయనొక తీర్మానం చేయించాడూ అంటే—అది మనబుర్రలోని సారం ఆయనొక ప్రణాళిక రచించాడూ అంటే—అది మన మేధా కల్పన. ఆయనొక ఉపన్యాసం చేశాడూ అంటే—అది మన కలంచేవ అహాఁ! ఇందులో అద్భుతమూ, ఆశ్చర్యమూ ఏమిలేదనుకో. వారికీ మనకూ గల స్నేహాంశం అటువంటిది. చిన్న రహస్యం—ఏ భార్యాభర్తల కన్నా, మామన్న అన్యోన్యత ఉండదంటే నమ్మ. అసలు, ఆదర్శదాంపత్యం లాంటిది మాజంట—అంటే నీకు నవ్వురావచ్చు; వస్తుందిగూడా. అదిగో—అప్పుడే ఆ పెదిమలచాటున, ఆ కంటిరెప్పల మాటున చిరునవ్వు దోబూచులాడుతున్నది. ఒకసారి యీ విషయమే మా సంస్థతో అంటే—పకపకా నవ్వేసింది. కాని ఇది నిజం నిజం సంతోషకరంగా

# ★ ఆడవాళ్ళతో వచ్చిన చిక్కే ఇది ★

ఉంటుంది ఎప్పుడూ సంతోషమిప్పుడూ నవ్వు తెప్పిస్తుంది..."

"అని మీ ఛైయిర్మన్ గారన్నారు కదూ నాన్నగారూ?" వస్తూనే సంధ్య ప్రశ్నించింది.

"కాదులేమ్మా. ఆమాట అంటానికి జీవితాన్ని ఎంతమథించాలి! జీవితం సముద్రం వంటిది. ఆయన పైపైన పడవల్లో ప్రయాణం చేసేవాడే గాని, నీళ్లలోకి ఎఱుగడు. అసలు నీళ్ళంటేనే తగనిభయం. నీళ్ళలోకి ఎంత లోతుకి పోవాలి? ఎంతఓర్పుతో శోధించాలి?– రత్నాలు కావాలంటే.."

ఆ మాట్లాడినంతసేపూ – ఆయన కళ్లలో ఆవేశమూ, ఆదోవిధమయిన కాంతీ గోచరించింది. మొత్తానికి అసామాన్యమయిన వ్యక్తి, అసమానమైన మేధాసంపత్తి; నిశితమైన ఆలోచన; నిశ్చింతమైన అనుభవము, నిష్కాపటమైన మనసు, నిర్మలమైన హృదయం

అయిదింటికల్లా ఫిఫ్టీసెవెన్ స్టాండర్డు ఇంటిముందు ఆగింది.

మామగారు ఆయనగదిలోనుంచి బయటకు వస్తూ అన్నారు

"ఏమోయ్ కారువచ్చింది. ఇక నాఆలస్యమేమీ లేదు"

ఆయనకళ్ళల్లో, మాటల్లో కించిత్ గర్వం లేశమాత్రంగా మెరిసినట్లనిపించింది. బహుశా–ఇందాకటి ఆయనమాటలను నేను వమ్మనట్లు నాకళ్ళు గాని, మాటగాని సూచించిందేమో – దాన్ని బుజావు చేయడానికి, ఛైయిర్మన్ గారి కారుకోసం కబురు చేసినట్లున్నాడు.

"ఇది ఛైయిర్మన్ గారి స్వంతకారోయ్. అంటేదీంట్లో ఆయనా, నేనూ తప్ప ఇంకెవ్వరూ కాలుమోపడానికి హక్కులేరు. వాళ్ళఇంట్లో వాళ్ళు గాని, యింకెవరన్నా గాని ఎక్కడికు వెళ్ళాలన్నా యింకోడొక్కటుంది. అదేశరణ్యం. వాళ్లయింట్లో వాళ్ళకికూడా దుర్లభమైంది. ఇవ్వాళ మీకోసం మనం కబురుపెట్టే విమానం లాగా మనయింటిముందు వాలింది."

కొంతమంది తమ పరువూ, ప్రతిష్టా, డాబూ దర్పమూ ప్రదర్శించడానికి ఎంత శ్రమపడతారు!

"మామా అల్లుళ్ళ సేవనులో మాట్లాడుకో వచ్చునులే. రండి నాన్న గారూ"

కారులోంచి శ్రీమతి పిలుపు పొద్దున తనమూలంగా బండితప్పినందుకు యీసారి ముందుజాగ్రత్త పడినట్లుంది.

డ్రైవరు సామాను లన్నీ సర్దేశాడు.

అత్తగారు సంసార నిర్వాహణలో తీసికోవాల్సిన జాగ్రత్తలు కూతురికి మళ్ళామళ్ళా చెప్తున్నట్లుంది.

"నాకు తెలుసులేవే అమ్మా!" శ్రీమతి విసుక్కుంది.

మామగారు ఫ్రంటుసీటులో కూర్చున్నారు.

నేను వెనకసీటులో సంధ్యప్రక్క ఆసీనుడయ్యాను.

డ్రైవరు తలుపులు వేసి సీట్లో కూర్చున్నాడు.

కారు మెత్తగా జారిపోయింది.

స్టేషనుకు చేరకుండానే సరికి ప్లాట్ ఫారమ్ మీద ట్రెయిన్ రెడీగా ఉంది. మామగారు గబగబా వెళ్ళి రెండు సెకండుక్లాసు టిక్కెట్లు కొనుక్కొనివచ్చారు. కూలీలు సామాను పెట్టెలో పెట్టారు.

గార్డు విజిల్ ఊదాడు.

"జాగ్రత్త—ఖాన్కరం. రాత్రి ప్రయాణం. సామాన్లన్నీ ఒకచోటకు సర్దుకో. అమ్మాయసలే రాత్రిపూట మేల్కొలేదు. చిన్నప్పుడు ఏడుగంటలకు పడుకుని ఉదయం ఏడుగంటలకు గాని లేచేదికాదు వాళ్ళమ్మ ఎంత కొప్పడినా పైగా అనేది—నే నసలు నిద్రపోంది ఏమిటీ గోల? ఏడుగంటలకా నేను కళ్ళు మూసుకుంది; ఇంతలోనే మీ అరుపులు వినపడి కళ్ళు తెరిచి గడియారంవంక చూస్తే చిన్నముల్లు ఏడుమీద ఉంది కాకపోతే పెద్దముల్లు ఒకటే రెండు అంకెలు దాటింది. ఆ భాగ్యానికి ఇంత రభసయితే ఎలా?—అదీ దాని పిడివాదన."

ఆయన పకపకా నవ్వాడు. ఎగుటివారి అమాయకత ఎప్పుడూ నవ్వు తెప్పిస్తుంది. కాని ఆ అమాయకులు మనం ప్రేమించే వాళ్ళయితే నవ్వు [illegible]ం సూచిస్తుంది; ద్వేషించేవాళ్ళ విషయంలో నయితే పరిహాసం ప్రకటిస్తుంది.

నాకూ నవ్వాగిందికాదు.

"నువ్వు మరీను నాన్నా—" సంధ్య మొహం జేవురించింది.

ఇంకా మామగారేదో చెప్పబోతున్నారు ఆ పెదిమలు కదిలేలోగా మేం మూడు గజాలు ముందుకుపోయాం.

నవ్వుతెరల నణుచుకుని ఆయన పెదవులు అప్పుడు కదిలినయ్ మెల్లగా.

"జాగ్రత్త జాగ్రత్త" గాలి చెవుల్లో ఊదింది.

రైలు వేగం హెచ్చింది.

నాకు నవ్వాగిందికాదు. వాళ్ళ నాన్న మాటలు విన్న మాతోటి ప్రయాణీకులు ఒకరిద్దరు నవ్వుకుంటున్నారు తమలోతాము.

వాళ్ళను చూసింది శ్రీమతి మొగుడు కొట్టినందుకుకాదు, తోడికోడలు నవ్వినందుకన్నట్లయింది. తోకతొక్కిన త్రాచులా గిరుక్కున నావంక తిరిగింది. ముక్కుపుటాలు అదురుతున్నాయి.

ఎందుకు వస్తుంది అంతనవ్వు?"

"ఆరోగ్యకరం."

"సరే నవ్వుకోండి" బాగా దెబ్బతిని అంది." నరాలు చిక్కబట్టేదాకా నవ్వుకోండి."

అంతే మూతి బిగాయించుకుంది. పిల్చినా, ఉలుకూ పలుకూ లేదు.

అసలు ఆడవాళ్ళతో వచ్చిన చిక్కే ఇది! ఆగ్రహం వచ్చినా, అనుగ్రహం వచ్చినా శిఖరాగ్రాలకి వెళ్ళవలసిందే! ఒక చిన్నమాటకు మొహంలో కారుమబ్బులు కమ్ముకుంటాయి; మరోమాటకు కళ్ళలో బడబాగ్నులు జ్వలిస్తాయ్; మరోమాటకు చెంపలపై గోదావరి వరదలై పారుతుంది; మరొక్కమాటకే పెదవులపై శరత్పూర్ణిమనాటి జ్యోత్స్న వెయ్యిరేకులుగా విప్పారుతుంది.

జరిగిన సంఘటనలన్నీ సంగ్రహంగా కళ్ళముందు కదిలిపోయినయి. శ్రీమతి అప్పుడే వాళ్ళ నాన్నమాటలను నిజంచేసింది. బాబిగాడింకా బొమ్మతో ఆడుకుంటూనే ఉన్నాడు.

దటుక్కున మొన్నీ మధ్య పత్రికలో పడ్డ వార్త స్మృతిపథంలో మెరిసింది. ఓ ఇల్లాలు రైల్లో ప్రయాణంచేస్తున్నది. పిల్లవాడు అటూ ఇటూ తిరుగుతూ ఆడుకుంటున్నాడు కొంతదూరం పోయిచూస్తే పిల్లవాడు కన్పించలేదు. అప్పుడా తల్లి లబోదిబోమంటే రైలువాళ్ళు జాలిపడి, రైలును కొంతదూరం వెనక్కి నడిపించే సరికి—అక్కడ రైలుపట్టాలప్రక్క యిసుకలో తలమీద కొద్దిగాయాలతో పిల్లవాడు ఆడుకుంటున్నాడు.

ఆ తల్లి అంత జాగ్రత్తగా ఉంది!

వాచి చూసుకున్నాను–పదిన్నరయింది.

బాబిగాడు, వాళ్ళ మామయ్య ఆ ఉదయం కొనుక్కువచ్చిన ప్లాస్టిక్ బొమ్మలతో యింకా ఆడుకుంటున్నాడు చేతి మురుగులూ, పోగులూ లైటుకాంతిలో మెరుస్తున్నాయి మెళ్ళోని బంగారుగొలుసు కొంతులు సిల్కుచొక్కాను చీల్చుకుని బయటకు వస్తున్నాయి ఆ గొలుసులోని ఒకేఒక మేలిరకం కెంపు జ్వలిస్తోంది

శ్రీమతిలో ఉచ్ఛ్వాసనిశ్వాసాలు మినహాయిస్తే మరే చలనమూ లేదు. పకలించిన అజంతాశిల్పంలా ఉంది.

మెళ్ళో రెండుపేటల గోవర్ధనగొలుసూ, ముత్తెమొగ్గల నెక్లేసూ.

(51 వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

**[ 19-8-59 మొదలు 25-8-59 వరకు ]**

## గ్రహ స్థితి.

| | | | |
|---|---|---|---|
| శు | | | |
| | 25 తేదీని కుజుడు కన్యలో ప్రవేశించును. వృశ్చిక, మీన, మేష, వృషభములలో చంద్రుడు. | | బు |
| | | | ర వి కు |
| శ | కే | | రా |

## * [ అశ్విని చూ, చే, చో, లా ] *

ఈవారము మీరు తలపెట్టిన పనులలో జయము పొందుతారు. బంధుమిత్రులతో వినోదములలో పాల్గొని మృష్టాన్నభోజనము చేస్తారు. నీటి మీద ప్రయాణము చేయవలసి వస్తుంది. విద్యార్థులు ఉత్సాహముగా చదువుకుంటారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, వెండి, బియ్యము, ద్రవపదార్థ జనిత వస్తువులు క్రయ విక్రయములలో వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, శిల్పకారులకు, నటీనటులకు మేలుకాలము.

## * భరణి [ లీ, లూ, లే, లో ] *

ఈ వారము మీకు యోగప్రదము. ధన ధాన్య వృద్ధికలుగుతుంది. ఇష్ట వస్తులాభము, పరోపకారమువల్ల కీర్తి కలుగుతుంది. వివాహాది శుభకార్యాలోచనలు ఫలప్రాప్తి పొందుతాయి విద్యార్థులకు చదువు బాగా సాగుతుంది. ఖరీదైన వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు ఎక్కువ లాభము కలుగుతుంది. ఉద్యోగస్థుల హోదా పెరుగుతుంది. వాహనయోగముంటుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు మేలు కాలము. 25 న కుటుంబకలహము.

## * కృత్తిక [ అ, ఈ, ఉ, ఏ ]

మీకు ఈవారము కార్యభారము ఎక్కువ వింత మాటలు వినుట, పరాక్రమముచే ఘనత, ప్రయాణము, ధనలాభము కలుగుతవి. అనారోగ్యసూచనలు కనబడగానే జాగ్రత్త పడుట మేలు. ఉద్యోగస్థులకు స్వల్ప అనుకూలత, విద్యార్థులకు చదువు సరిగా జరగదు. రాజకీయవాదులకు ఆందోళనతోపాటు అనులాభము, ప్రయాణము. 24, 25 అనారోగ్య సూచనలు.

## * రోహిణి [ ఓ, వా, వీ, వూ ] *

మీకు ఈ వారము చేయదలచుకున్న పనులకు ఆలస్యము కలుగుతుంది. అన్ని విధాల నిరాశ కలిగిన మీదట అజ్ఞాత మిత్రుని సహాయమువల్ల విచిత్రముగా కార్యలాభమును పొందుతారు. వర్తకులకు లాభము తక్కువ ఆత్మీయుల అనారోగ్యము చికాకు కలిగిస్తుంది. ఉద్యోగస్థులకు వన పర్వత ప్రాంతములకు బదిలీ అయే సూచనలున్నవి. రహస్యములను కనిపెట్టుటకు వినియోగింపబడుతారు. వారమంతా చికాకుగా వున్నా వారాంతమునకు కార్యసిద్ధి కలుగుతుంది.

## * మృగశిర [ వే, వో, కా, కి ] *

మీకు ఈవారము ధనాభావం ఎక్కువ. ఎవరి సహాయమువల్ల కార్యసాధన చేదామనుకున్నారో వారివల్లనే ఆటంకములు కలుగుతాయి అయినను దైవబలంవల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది. ఇంట్లోవారికి

**బి. నరసింగరావు**

ఆరోగ్యభంగము కలుగుతుంది. ఉద్యోగస్థులకు ఒత్తిడి వర్తకులకు నిరాశ. వారమంతా ఆందోళనగాయున్నా సాంగత్యము, పుణ్యక్షేత్రసంచారము, దేవతాదర్శనము, వింతలను చూచుట, నవద్రవ్యలాభము కలుగును.

## * ఆరుద్ర [ కూ, ఘ, జ, ఛ ] *

ఈవారము అనుకూలత కన్న ప్రతికూలత యెక్కువ. శ్రమాధిక్యముతో యత్నకార్యములు ఫలిస్తాయి కోర్టు దావాలు అనుకూలిస్తాయి. పరోపకారము చేయదలచుకొని పోగక నిందలు పొందుతారు. ఇచ్చి పుచ్చుకోవటంల వివాదాలు. ఉద్యోగస్థులకు అధికారుల ఒత్తిడివున్నా తోటివారి సహాయము కలుగుతుంది. భార్యకు ఆరోగ్యము చెడే సూచనలున్నవి. వారమంతా నిరాశగా వున్నా వారాంతమునకు కొంతవరకు కార్యసిద్ధి అవుతుంది.

## * పునర్వసు [ కే, కో, హా, హి ] *

మీకు ఈవారము ఎన్ని ఆటంకములు కలిగినా పట్టుదలతో నిరుత్సాహపడకుండా ఆశించిన సొమ్ము అనుకున్న వేళకు అందక అప్పుచేసినను, వారాంతమునకు సోదర సహాయంవల్ల తీర్చగలుగుతారు. ఆత్మీయుల వల్ల నిందలు పొందుతారు. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, ఇంజనీరింగ్ శాఖ ఉద్యోగులకు, రంగులు, లోహపు సామానుల వర్తకులకు శ్రమతోకూడిన లాభ యోగము. 24 న ప్రమాద సూచన.

## * పుష్యమి [ హూ, హే, హో, డా ] *

మీకు ఈవారము యోగప్రదము. బంధు సహాయంవల్ల, అధికారుల సహాయంవల్ల. ఆటంకములను గడిచి ఫలము పొందుతారు, ఆదాయం వృద్ధి అవుతుంది. వైద్య జ్యోతిష శాస్త్ర ప్రసంగాలు చేస్తారు. ఈశాన్య దిక్కునుండి క్షేమ వార్త తెలుస్తుంది. గణితశాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, నటీనటులకు యోగకాలము. 22, 23, ధన లాభము, కార్యసిద్ధి.

## * ఆశ్లేష [ డీ, డూ, డే, డో ] *

ఈవారము మీకు యోగదాయకముగా ఉంటుంది. ఆశించినసొమ్ము చేతికివస్తుంది. కోర్టుదావాలు అనుకూలిస్తవి. పండితగోష్ఠి జరిపి నూతనవిషయాలు తెలుసుకొంటారు. నూతనకార్యారంభము చేస్తారు. వారమంతా శుభయోగాలతో కూడివున్నా కొంత ఆందోళన కూడా వుంటుంది. 19, 20 ధనలాభము, కార్యసిద్ధి. 21 న అధిక ఖర్చులు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, ఉపాధ్యాయులకు, పండితులకు మేలుకాలం విద్యార్థులకు చదువు బాగాసాగుతుంది.

## * మఖ [ మా, మీ, మూ, మే. ]

ఈవారము వినోదములలో పాల్గొనుట.

### ఈవారము ధరలు:

నూలు, బట్టలు -నిలకడగా వుండును.

నూనెదినుసులు -తగ్గుదలలో వుండును.

ఆహారధాన్యములు :— స్వల్పముగా హెచ్చును.

బెల్లము, పంచదార, చింతపండు:- నిలకడగా వుండును.

పప్పుదినుసులు - కొంచము పెరుగును.

వెండి, బంగారము - స్వల్ప తేడాలో వుండును.

సర్వత్ర వృష్టిగా వుండును.

జన్మనక్షత్రము బట్టగాని, జన్మనక్షత్రము తెలుగనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటియక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది. కృష్ణుడను పేరునకు మృగశిరానక్షత్రమును, వృష్ణుడను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేరకు పూర్వాషాఢ



# నక్షత్రఫలితాలు



దధి, క్షీర, మధురపదార్థయుక్త భోజనము. రజతపాత్రలలో భుజించుట, తలచినకార్యములలో జయము. నీటిమీద ప్రయాణము, తెల్లనివస్తువులు కొనుట మొదలయిన యోగములు కలుగును ప్రత్తి, దూది, నూలుబట్టలు వెండిబియ్యము, ద్రవపదార్థజన్యములక్రయ విక్రయములలో వర్తకులకు లాభము, కవులకు గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగావుంటుంది విద్యార్థులకు మంచికాలము. 24, 25 అధిక ఖర్చులు, ఆందోళన.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### మో, టా, టీ, టో

ఈవారము మీకు ధనధాన్యవృద్ధి, కృషిమూలముగా లాభము వివాహాది శుభకార్యముల గురించి ఆలోచనలు, ఇష్టవస్తులాభము. పరోపకారమువల్ల కీర్తివంటి రాజయోగములు కలుగును. విద్యార్థులు వినోదములలో పాల్గొన్నా చదువుబాగా సాగుతుంది. విలువగల వస్తువుల క్రయ విక్రయములలో వర్తకులకు ద్విగుణీకృత లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము. ఆప్తులతో విందు వినోదము.

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### • (టే, టో, పా, పీ)

ఈవారము మీకు కార్యభారము ఎక్కువ. రాబడి తక్కువ గృహావసరములు తీరకకలతలు. ఆరోగ్యము సరిగాలేని సూచనలు కనబడగానే ఔషధచికిత్స పొందడమే కాకుండా గ్రహారాధన చేసిన నవ గ్రహశాంతి చేయించుటమేలు. ఉద్యోగస్తులకు క్రొత్త సమస్యలు వర్తకులకు ఆందోళన. 22,23 పితృవర్గ సహాయము,ధనలాభము ప్రయాణము. 24 ఆరోగ్య భంగము.

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈవారము మీకు మిశ్రమయోగము, మొదట్లో నిరాశగా వున్నా మిత్రసహాయము వల్ల కార్యలాభము పొందుతారు ధనలోపము వల్ల చదువుసాగదు. ఆప్తుల ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది వారములో అవయోగములు వున్నా మిత్రసహాయము, కార్యసిద్ధి, విదేశీయుల పరిచయము విచిత్ర వస్తు సంపాదన వంటి శుభయోగములు కూడా వుంటవి.

### *చిత్ర [పే, పో, రా, రీ]*

ఈవారము మీరు సహాయము పొందదలచుకున్న వ్యక్తి మూలముగా కార్యహాని కలుగుతుంది. ధనభావం కూడా ఎక్కువ. ఇంట్లో వారి అనారోగ్యము ఆందోళన కలిగిస్తుంది. ఆధ్యాత్మికచింతవల్ల దైవముపై భారమువేసి కార్యలాభము పొందుతారు. ఉద్యోగసులకు ఒత్తిడి వ్యాపారస్తులకు నిరాశ విద్యార్థులకు మంచికాలము కాదు. పుణ్యక్షేత్ర సంచారము. దేవతాదర్శనము విచిత్రములను చూచుట జరుగును. వారమంతా అవయోగ శుభయోగమిశ్రమముగా వుంటుంది.

### * స్వాతి [రూ, రే, రో, తా]*

ఈవారము ఎన్నో ఆటంకములు వచ్చినపట్టుదలతో ప్రయత్నించడము వల్లకూడా లాభము అష్టే కలుగదు తలపెట్టినపనులు ఎక్కువ శ్రమతో ఫలిస్తాయి. కోర్టుదావాలు అనుకూలిస్తాయి. ఇతరులకు సహాయము చేయబోయి ఫలించక నిందలు పొందుతారు. లావాదేవీలలో వివాదములు కలుగుతాయి ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ, తోటివారి సహకారము వుంటాయి. వర్తకులకు వారమంతా నిరాశ వారాంతమునమేలు 24న భార్య అనారోగ్యముచే ఆందోళన. విద్యార్థులకు చదువు బాగా సాగదు.

### * విశాఖ [తీ, తూ తే, తో] *

ఈ వారము పట్టుదలతో ప్రయత్నించడమువల్లను కార్యలాభమును పొందుతారు. ఆశించిన డబ్బు సమయానికి అందక అప్పు చేస్తారు. దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్త వల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు, లోహసామానులు, రంగుల వ్యాపారస్తులకు, కష్టముతోకూడిన లాభము. గనుల యజమానులకు యంత్రములు నడుపు నిపుణులకు, ఇంజనీరింగుశాఖ ఉద్యోగులకు మేలుకాలము.

### * అనూరాధ [నా, నీ, నూ, నే] *

ఈ వారము మీకు యోగకాలము. బంధుసహాయము, అధికారుల సహాయము కలుగుటచేతను అన్నిచిక్కులువీడి కార్యసిద్ధి అవుతుంది. ఆదాయము వృద్ధిపొందుతుంది. శాస్త్ర ప్రసంగాలలో పాల్గొంటారు. కవులు నూతన రచనలు చేస్తారు. బంధువుల క్షేమ వార్త తెలిసి సంతోషము పొందుతారు విద్యార్థులకు ఉత్సాహముగా వుంటుంది గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలుకాలము.

### * జ్యేష్ఠ [నో, యా, యి, యూ,] *

ఈ వారము మీకు మంచి భాగ్యయోగము. అనుకున్నడబ్బు చేతికి వస్తుంది. ఇబ్బందులు తీరుతవి. దావాలలో గెలుపు

పొంగుతారు. పిల్లల అభివృద్ధికి చేసే ప్రయత్నాలు ఫలిస్తవి నూతన గ్రంథములు చదువుట వలన విజ్ఞానాభివృద్ధి అవుతుంది. విద్యార్థులకు మేలు కాలము. న్యాయస్థాన ఉద్యోగులకు, న్యాయవాదులకు, పండితులకు, ఉపాధ్యాయులకు యోగప్రదం.

*** మూల [యే, యో, బా, బీ] ***

ఈ వారము మీకు యోగదాయకము. ధనయోగము కలుగుతుంది. సంగీత సభలు, కవితా గోష్ఠి వంటి వినోదాలలో పాల్గొని మృష్టాన్న భోజనము వెండి పాత్రలలో చేస్తారు. శుభ కార్యాలోచనలు చేస్తారు. నూలు, బట్టలు, బియ్యము, వెండి వస్తువులకు లాభము: విద్యార్థులు ఉత్సాహముగా చదువుకుంటారు. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుగా వుంటుంది.

***పూర్వాషాఢ [బూ, ధ, భా, డా]***

ఈ వారముకూడా మీకు గతవారము వలెనే యోగదాయకముగా వుంటుంది. అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభదాయకముగా ముగుస్తవి. పుణ్యకార్యాలలో పాల్గొంటారు. నూతన గృహనిర్మాణమునకు ఆలోచనలు చేస్తారు. ఉద్యోగస్తులకు హోదా పెరుగుతుంది. వర్తకులకు విలువగల వస్తువుల క్రయవిక్రయములలో ఎక్కువ లాభము. వారమంతా శుభయోగములతో కూడివున్నా వారాంతమున కుటుంబ కలహముచే ఆందోళన కలుగుతుంది. స్త్రీలతోనూ, ఆప్తులతోనూ విందు, వినోదము, విద్యార్థులకు మేలుగా వుంటుంది.

***ఉత్తరాషాఢ [బే, బో, జా, జీ]***

ఈవారము రాబడి తక్కువ. ఖర్చులు ఎక్కువ గృహావసరములు తీరక స్పర్థలు వస్తాయి అనారోగ్య సూచనలు కనబడగానే ఔషధ చికిత్స పొందడము, రవికి శాంతి చేయించడము మంచిది. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు. వర్తకులకు ఆందోళన. విద్యార్థులకు చదువు సరిగా జరుగదు. వారమంతా భయాందోళనలతో కూడివున్నా పితృవర్గ సహాయము, కార్యలాభము కలుగుతవి.

*** శ్రవణము [జూ, జే, జో, ఖా] ***

ఈవారము నిరాశగా వున్నా మిత్రసహాయమువల్ల ఆందోళన కలుగుతుంది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత. వర్తకులకు వారాంతమందు లాభం. వారమంతా ఉద్రేకముగా వుంటుంది. విదేశీయుల పరిచయము అపురూపవస్తు సంపాదన కలుగుతాయి. 21న అధిక ఖర్చులు, మనోవ్యథ. విద్యార్థులకు బద్ధకమువల్ల చదువు సాగదు.

*** ధనిష్ఠ [గా, గీ, గూ, గే] ***

ఈవారము మీకు మిశ్రమయోగము. ఆశించిన సహాయము లభించక అవసరములు తీరక ఆందోళన కలుగుతుంది. అయినప్పటికీ దైవానుగ్రహమువల్ల కష్టములుగడిచి కార్యసిద్ధి పొందుతారు. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ, వర్తకులకు చాంచల్యము పుణ్యపురుషుల సాంగత్యమువల్ల మనోవికాసము కలుగుతుంది. వారమంతా అశాంతి వున్నా వస్త్రద్రవ్యలాభము పొందుతారు. 24న అధిక ఖర్చులు.

***శతభిషం [గో, సా, సి, సూ]***

ఈ వారము అనుకూలత కన్నా ప్రతికూలత యెక్కువ. ఇచ్చిపుచ్చుకునేపట్ల వివాదాలు వచ్చి మనోవ్యథ కలుగుతుంది. కోర్టు వ్యవహారములు అనుకూలించినా అమిత ఖర్చులవల్ల అసంతోషము వుండగు. భార్యకు అనారోగ్యము కలిగే సూచనలున్నవి. మినుములు, కొర్రలు, రాగులు, ఉప్పు, నువ్వులు, నూనె వ్యాపారస్తులకు లాభయోగము. ఇతర జాతులవారి వల్ల గౌరవము కలుగుతుంది. 24, 25 భార్యకు అనారోగ్యము, బంధువుల రాక, అధిక ఖర్చులు.

*** పూర్వాభాద్ర [సే, సో, దా, దీ] ***

ఈ వారము ఎంత ప్రయత్నించినా యత్నకార్యములకు ఆటంకములు కలుగుతునే వుంటవి. అయిననూ పట్టుదలతో యత్నించి కార్యలాభము పొందుతారు. సోదరసహాయమువల్ల ఒడిదుడుకులు సర్దుకుంటాయి. దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. గనుల యజమానులకు, లోహ, ఖనిజ వ్యాపారస్తులకు, పోలీసుశాఖ ఉద్యోగులకు మేలుకాలం. 21న ప్రమాద సూచన, అధిక ఖర్చులు.

***ఉత్తరాభాద్ర [దూ, శం, ఝా, థా]***

ఈ వారము మీకు యోగకరము. ప్రయత్నించిన పనులు నెరవేరుతవి. ధనలాభము కలుగుతుంది. ఈశాన్య దిక్కునుండి క్షేమవార్త తెలుస్తుంది. శుభ కార్యములలో పాల్గొంటారు. బంధుదర్శనము కలుగుతుంది. గణితజ్యోతిషశాస్త్ర చర్చలు జరుపుతారు. ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ఇత్తడి, కంచు వర్తకులకు లాభదాయకము. కవులకు, శిల్పులకు, నటీనటులకు మేలు కాలము 22, 23న కార్యసిద్ధి 24న అధిక ఖర్చులు.

*** రేవతి [దే, దో, చా, చీ] ***

ఈ వారము మీకు శుభయోగము. ఆశించిన డబ్బు చేతికి వస్తుంది. ఇంట్లో శుభ కార్యప్రయత్నములు చేస్తారు. పుణ్యకార్యాచరణ, ప్రభుత్వ సన్మానము, శాస్త్ర చర్చలు జరుగుతవి. విద్యార్థులు కొత్త విషయాలు నేర్చుకుంటారు. న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు మేలుగా వుంటుంది. ఇంట్లోవున్న వారి అనారోగ్యమువల్ల కలిగిన ఆందోళన తొలగుతుంది. పిల్లల లాభక్షేమములకు చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి.







పావన తుంగభద్రాతీరం. ఎదురుగా అనేకమైన పల్లె కుటీరాలు కనబడుతున్నాయి. ఆ పక్కనే మహోజ్వలమైన నగరం నిర్మించబడుతున్నాది. మట్టిగోడలు, వెదర తడకలు, మృణ్మయపాత్రలు ఆ నగరముయొక్క జానపద వైభవాన్ని వేనోళ్ళతో చాటుతున్నాయి. బ్రహ్మాండమైన సభాశాల, విశాలమైన సభావేదిక, దగ్గరనేవున్న ప్రతినిధులవిడిది కుటీరాలు, ఎంతో మనోజ్ఞంగాఆంధ్రజాతీయవికాసాన్ని పెంపొందిస్తున్నాయి. అగాధ గంభీరమైన తుంగభద్రా ప్రవంతి తన లోతైన గుండెల్లో అప్రతిహతమైన వీర గాథల్ని యిముడ్చుకుని పక్కనుంచే అనంతమైన ప్రయాణాన్ని సాగిస్తున్నాది. చూచీ చూడడంతోనే అందరికీ వ్యక్తమయేలాగు మహోన్నతమైన జాతీయధ్వజ

# కర్మవీరుడు

స్తంభం స్థాపించబడింది. కొంచెం దూరంలోనే యీ నగరాన్ని నిర్మించే కార్మికుల గుడిసెలు కనబడుతున్నాయి.

ఒక కార్మిక కుటీరంలో చిన్న గది:—రెండువైపులా రెండు చీడీలు వున్నాయి. కుక్క మంచం మీద చిన్న బొంత వేసుకుని ఒక యువకుడు పడుకున్నాడు. అతని

క్రొవ్విడి రామం

కళ్ళల్లో నిస్పృహా, దైన్యమూ ప్రతిబింబిస్తున్నాయి. బక్క పేగులనుంచి స్రవించే చెమటను తుడుచుకుంటూ అతని తండ్రి ఆ పక్కనే కూర్చున్నాడు. ఆ యువకుడు అపరిమితమైన బాధచేత మంచంమీద గిజ గిజ తన్నుకుంటున్నాడు. కొంత సేపటికి తేరిపారచూసి "అన్నట్టు రేపే సభ. మనపని మిగిలేవుందికదూ?" అని పెద్ద నిట్టూర్పు విడిచాడు. తండ్రికేమీ తోచక అతనికి కొంచమైనా నింపాదిగావుంటే రాత్రంతా కష్టపడి పని పూర్తి చేస్తానని చెప్పేడు. తండ్రి, దగ్గర కూర్చున్నంత మాత్రంచేత తనబాధ లేశమైనా తగ్గదనిన్నీ, సభాశాల దగ్గర కొంచమైనా పనిచేస్తే రేపటి ఉత్సవానికి తోడుపడినవాళ్ళ మౌతామనిన్నీ కొడుకు యెంతో దీనంగా చెప్పేడు. మధ్యమధ్యవచ్చే నొప్పిని బలవంతంగా దిగమింగి తన బాధను తండ్రికేమాత్రము కనబడనీయలేదు. ఈ స్థితిలోవున్న కొడుకును విడిచి వెళ్ళడానికి కాళ్ళురావని తండ్రికంట తడిపెట్టేడు. సమయానికి పనికిరాని కృషి వ్యర్థమనిన్నీ మానవులకు కష్టములు పరిపాటయిపోయినవనిన్నీ కొడుకు తండ్రికి నచ్చచెప్పేడు.

ఒణుకుతున్న యెడమ చేతితో వెదరకత్తి, కుడిచేత్తో కర్రా పట్టుకుని ఆ వెదరి బైట పడ్డాడు. అప్రయత్నంగా తన చేతిలో కత్తి దిగువకు జారిపోయింది. నిశిత ప్రతిభావంతమైన నగరముయొక్క శోభ అంతా అతని కన్నులకు అంధకార బంధురంగావుంది. కడుపులో [illegible] నుంచీ చీల్చుకుని వచ్చే దుఃఖం యెంత ప్రయత్నించినా ఆగలేదు. అతను పనిలోకివచ్చిన ఘంటకే కొడుకు గతించినాడని కబురు

## పిచ్చికగూళ్ళు

ఇక్కడ గల ఆరుగూళ్ళల్లోను ఉన్నమాటల్లో విరంటికో ఒక్కొక్క అక్షరం ఇచ్చి పుచ్చుకుని అర్థం మార్చుకునే గుణం ఉంది. ఏస్థానంలో అక్షరానికి ఆస్థానంలోనే మళ్ళీ క్రిందమాటలోంచి బదలాయించాలి. మాటవరసకి మొదటి గూడులో అందము, బతుకు, సర్వము– బంధము, అతుకు, పర్వముగా మారుతాయి. జవాబులు 68 పేజీలో చూడండి.

| | | |
|---|---|---|
| అందము<br>బతుకు<br>సర్వము | నిలయము<br>బజారు<br>విషాదము | న్యాయము<br>ప్రాంతము<br>అకులు |
| ఎలుక<br>కల<br>వెలితి | మధువు<br>వలపు<br>కానుక | పిలక<br>కలుపు<br>నాణెము |

వచ్చింది. మునలిమేదరి నిలబడ్డ పాటున కర్రకట్టి పోయినాడు. చైతన్యమంతా యెక్కడికో యెగిరి పోయింది. హృదయమంతా శూన్యమైపోయింది. అసలే పుత్ర శోకం! అందులో ఏకపుత్ర విష యం!! ఆ యమబాధ పగవాళ్ళ కయినావద్దు.

*   *   *

శోక మోహములు రెండూ మేదరిని పూర్తిగా పరవశం చేశాయి. జడ త్వం హృదయంలో పూర్తియైన అధి కారాన్ని వహించింది, బాహ్య ప్రకృతి తన కేవిధమైన సంచలనమూ కలిగించ లేదు, "ఇంకా మన పని మిగిలేవుందికదూ?" అనే మాటలు అప్రయత్నంగా మేదరి చెవుల్లో ప్రతిధ్వనించేయి, అప్పుడు అకస్మా త్తుగా కరుణ స్థానాన్ని వీరరసం ఆక్రమించింది ఇప్పుడు ఆ మేదరికి ఆకలిదప్పులు లేవు మోహ పరవశ త్వానికి అవకాశమూ లేదు. కొడుకు మీద వ్యామోహం పటాపంచలై పోయింది. ఇప్పుడు తానొక వీర మూర్తి, తన విధ్యుక్త కర్మలో తన ప్రతిభను విజృంభింప చేయాలి, తనకు ప్రపంచకమంతా యిప్పుడు మేదరి తడకల్లోనే యిమిడివుంది, ఎక్కడ చూచినా తానే కనబడు తున్నాడు, ప్రతీ తడకా స్వయంగా కట్టిస్తున్నాడు, సహచరులందరకూ సలహాల నిస్తున్నాడు. విశ్వరూప సందర్శనం లాగు యెక్కడ చూచినా తానే కనపడుతున్నాడు ఆ వీర మ్మూర్తిని అప్పుడు తేరిపారి చూడ గలిగేవా రెవరు?

మర్నాడు ఉదయం మంగళ వాద్యాలతో సభ ప్రారంభమైనది. తాను చెక్కిన రాతిబొమ్మకి చైత న్యం కలిగితే శిల్పి యెంత సంతో షిస్తాడో నిర్జీవమైన మేదరి తడకల్లో నుంచి మహానాయకుల అమూల్య మైన సందేశాలు వినిపించి నప్పుడు ఆ మేదరికి అంత సంతోషం కలిగింది. ఆ మేదరి త్యాగానికి సాహసానికి నాయకులంతా అబ్బురపడ్డారు. ధన్య వాదాల్ని అర్పించేరు.

ఆంధ్ర పతాకస్థాపనం జరిగింది. పావనమైన తుంగభద్రానది మీద నుంచి వచ్చే మందమారుతం తెలుగుజండాను మెల్లగా కదిలి స్తున్నాది. కోట్లకొద్దీ ప్రజలు మహా నాయకుల సందేశాల్ని వింటు న్నారు. ఆ మునలి మేదరి ఒక్క సారి తేరిపారి ఆ పతాకం వేపు చూసేడు. ఎవరో "నాన్నా! పని పూర్తి అయింది. కదూ?" అన్నట్టు వినిపించింది. అతని కళ్ళనుంచి రెండు నీటిబిందువులు రాలేయి అవి ఆనంద బాష్పములా? దుఃఖాశ్రువులా? శి



మద్రాసులో కల్చరల్ అకాడమీ ప్రారంభోత్సవ సందర్భాన దాసప్రకాష్ హోటల్ లో నృత్యం చేసిన బేబి ఐ. వి. రేవతి, కె. సాయిబాలలకు మద్రాసు హోంమంత్రి శ్రీ భక్తవత్సలం బహుమతు లిచ్చారు.

# బాలల సంఘం

# కొందరు సభ్యుల పేర్లు

ఘంటిపాటి లక్ష్మీ నారాయణమ్మ (గోదావరు కృష్ణాజిల్లా) పెమ్మరాజు వరలక్ష్మి (నెల్లూరు) ఎస్. హేమంతకుమార్ (తిరుపతి చిత్తూరు జిల్లా) లింగాల రామమూర్తి (అనకాపల్లి విశాఖజిల్లా) కోడూరి నాగసుందరి (హైద్రాబాదు) కోడూరి పద్మావతి (హైద్రాబాదు) ఎం. గోపీ కుమారి (విజయవాడ) బొప్పూరి రామలక్ష్మీ నరసింహ శాస్త్రి (నరసారావుపేట గుంటూరు జిల్లా) జయంతి రామచంద్రరావు (విజయనగరం) టి. లక్ష్మీనరసింహారావు (సూర్యాపేట నల్లగొండ జిల్లా) యస్. నళినీదేవి (ప్రొద్దుటూరు కడప జిల్లా) వేములపాటి కృష్ణారావు (పామూరు. నెల్లూరు జిల్లా) కొర్యంపూడి జయలక్ష్మి (గుంటూరు) భమిడిపాటి కౌండిల్య (పిఠాపురం. తూ. గో. జిల్లా) చేరుకూరి పిచ్చయ్యబాబు (తెనాలి) శ్రీమతి అనంతం బాలా త్రిపురసుందరి (బాపట్ల) వేమూరు కనకదుర్గ (విజయవాడ) చంద్రపాటి జయలక్ష్మీదేవి (గుంటూరు).

రామకృష్ణ (రామచంద్రపురం తూ. గో. జిల్లా) పినపాల రజిత్ కుమార్ (గుంటూరు) యి. హేమ చంద్రారావు (హన్మకొండ వరంగల్లు జిల్లా) లాం మహంతి (సత్తెనపల్లి గుంటూరు జిల్లా) కొకుమాను వెంకటరమణరావు (తెనాలి) శ్రీ మత్కందాళై కృష్ణమాచార్యులు (ఏలూరు) పొత్తూరు రాజేశ్వరి (గుంటూరు).

కొమ్మ ఉదయశంకర (కాకినాడ) టి. వి. రామకృష్ణారావు (విజయవాడ) కట్టుపల్లి లక్ష్మీపతిరావు (వెంకటగిరి టవున్, నెల్లూరు జిల్లా) గుడె సత్యనారాయణరావు (విశాఖపట్నం) పొన్నతోట రామాంజమ్మ (ప్రొద్దుటూరు, కడప జిల్లా) వనమా వెంకటకోటేశ్వరరావు (మురిపూడి, గుంటూరు జిల్లా) బంగారు బాబు రాజేంద్రప్రసాద్ (పాలకొల్లు, ప. గో. జిల్లా) ఆళ్ళగడ్డ శివశంకరరావు (కర్నూలు) చిరువోలు నారాయణమూర్తి (విజయవాడ) కె. విశ్వనాథ శాస్త్రి (హైద్రాబాదు) పానుగంటి రాఘవేంద్రరావు (గుంటూరు) తోట వీరరాజు (పలివెల తూ. గో. జిల్లా) కోట రామిరెడ్డి (వేల్పుమడుగు, (అనంతపురం జిల్లా) ఎస్. ఎమ్. అరుంధతి (సికింద్రాబాదు) పి. రామచంద్రారెడ్డి (కర్నూలు) డి. నాగరత్నకుమారి (తరికొండ, చిత్తూరు జిల్లా) పెంటపల్లి నరసింహారావు (తుని, తూ. గో. జిల్లా) జి. సరళాదేవి (కమలాపురం, కడప జిల్లా) చావలి హేమలత (గుగ్గిరాల, గుంటూరు జిల్లా) పొత్తప్రగడ కనకరాజు (కాకినాడ)

జి. కె. సుబ్రహ్మణ్యం, (తాడిపత్రి, అనంతపురం జిల్లా) మన్నె వెంకట సత్యప్రసాద్ (దేవ, ప. గో. జిల్లా) పి. హరినాధ పట్నాయిక్ (మండపేట, తూ. గో. జిల్లా) బి. వెంకటసత్యప్రభాకరమూర్తి (గొల్లప్రోలు, తూ. గో జిల్లా) వెణుతుగుపల్లి వరలక్ష్మి (తొంగాంగి) శ్రీకాకుళం జిల్లా) జి. యస్. రాజకుమారి (హైద్రాబాదు) ఎస్. కోటేశ్వరరావు (సికింద్రాబాదు) పెళ్లూరి సుబ్బులు (వినుకొండ, గుంటూరు జిల్లా) శిరాం వెంకటస్వామిశెట్టి (గిరాల, గుంటూరు జిల్లా) వంకమామిడి రాధాకృష్ణ (నరసాపురం, గుంటూరు జిల్లా) పుల్లాభొట్ల సీతారామమ్మ (తాడేపల్లిగూడెం, ప. గో. జిల్లా) భోగరాజు శారదాదేవి (పంచల్ బ్రారి ఒరిస్సా) జే. శారదామణి (పెదవలి. గుంటూరుజిల్లా) కొల్లూరి కామేశ్వరి (హైద్రాబాదు) పిదిరెడ్ల నారాయణదేవి (సల్లిగూడు విశాఖ జిలా) పర్వతనేని గోపాలకృష్ణ (విజయవాడ) తిరువర్తి పార్థివం (అనపర్తి. తూ. గో. జిల్లా) చిట్టా వెంకటశివప్రసాద్ (గుంటూరు) యర్రం గిరిజాధివాని (సికింద్రాబాదు) మాకం ప్రభాకరరావు, (బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు జిల్లా)

ఇరుకుచేరుక్క (భువనగిరి, హైదరాబాదు) పాదిల రామలక్ష్మి (ఏలూరు) చావలి వెంకటరెడ్డిదీక్షితులు (శృంగవృక్షము ప. గో. జిల్లా) వస్త్రమాని విజయలక్ష్మి (విజయవాడ) కొల్లి ప్రసాదరావు (తిరుపతిపురం ప. గో. జిల్లా) అవసరాల శ్రీరామశేషు (మురిపూడి తూ. గో. జిల్లా) జొన్నగడ్డ రామస్వామిశెట్టి (ద్రోణాచలం కర్నూలు జిల్లా) కే. ప్రసాదరావు (ఉరవకొండ, అనంతపురం జిల్లా) ఎ. ఉమ (ఘుంధిని, వరంగల్లు జిల్లా) చావలి హైమావతి (విశాఖపట్నం) ఎం. వెంకట నారాయణమ్మ (ఆత్మకూరు, కర్నూలు జిల్లా) నామాడి రామాబాయి (విశాఖపట్నం) పాటిబండ నటరాజు (హైదరాబాదు) అయ్యగారి శారదాదేవి (బిలాస్‌పూర్) పెంటపల్లి వాసుదేవరావు (నాగపూర్) టి. వరదరాజులు (కాళహస్తి, చిత్తూరుజిల్లా) ★

రంగుల రాట్నం-18 — వాల్ట్ డిస్నీ




“ఓపక్కన ఆకలేసి చస్తుంటే మీఆయన ఇంకా ఏంచేస్తున్నారు?”

# ★ ఆడవాళ్ళతో వచ్చిన చిక్కే ఇది ★

[44-వ పేజీ తరువాయి]

కుడిచేతికి రంగు రంగుల రకరకాల రమణీయమైన రాళ్ళుపొదిగిన వంకీ వాళ్ళమ్మ కొంజపడి, కూతురు వద్దంటున్నా బలవంతంగా చేయించిపెట్టి పంపింది. ఇంకా నయం—వడ్డాణమో, కాసులపేరో చేయించింది కాదు!

అతి నాజూగ్గా చుట్టుకున్న చుట్టచుట్టూ తురుముకున్న సన్నజాజులదండ మధ్యలో అందమైనబిళ్ళ. గజిబిజిగా అల్లుకున్న బంగారు తీగలనిండా గులాబీరంగువి ఎన్నో చిన్న చిన్న రాళ్ళు. మధ్యలో మెరుస్తూ – పుష్యరాగపుజాతి మరకతం. పేరు 'గులాబీ తోట'. చాలా బాగుంది.

ఎడమచేతి వేలికి ముద్దులు మూటగట్టే ఉంగరం. అందులో ఇంద్రనీలమణి. అది సంధ్య జాతకంబట్టి సెలెక్టు చేసింది. వాళ్ళన్నయ్య ఇంజనీరింగు ప్యాసై ఉద్యోగంలో చేరినసందర్భంలో మొదటిజీతంలో గారాబు చెల్లెలికిచ్చిన గిఫ్ట్.

కుడిచేతికి ఒక జత బంగారు గాజులు. ఒకటి రాళ్ళది; మరొకటి మామూలుది. ఎడంచేతికి అందమయిన రిస్ట్ వాచీ
మొత్తానికి-పాతకొత్తల మేలు కలయిక!!

ముక్కు, చెవులు, కాళ్ళు, చేతులు-ఒకటేమిటి? సమస్త అవయవాలూ ఆభరణ సంశోభితాలై ఉన్నాయి. సాక్షాత్తూ శ్రావణమాసపు శుక్రవార మహాలక్ష్మిలా ఉంది ఇంకో చోటికి గాని, ఇంకో చోటి నుంచి అయితే గాని—శ్రీమతి సుతరామూ అంగీకరించదు. ఆ ఆభరణాలు దిగేసుకోవడానికి. బీచ్ కో, పిక్చరుకో, ఎక్కడో హితులింటికో అయితే మెళ్ళో ఒక్క రెండు పేటల గోవర్ధన గొలుసు మాత్రం ఉంటుంది.

అయినా ఆడవాళ్ళతో వచ్చిన గొడవే ఇది: పెళ్ళిళ్ళు, తిరునాళ్ళు, తీర్థయాత్రలు వంటి పదిమంది కలిసేచోటికి వస్తూ ఒళ్ళంతా సొమ్ములతో కప్పుకుంటారు. పైగా-పిల్లలనుకూడా బంగారపు బొమ్మలు చేసి ఒంటరిగా వదులుతారు.

ఒకసారి మా అత్తయ్య మా పిన్నిగారమ్మాయి పెళ్ళికి వెళ్ళి తన పాతిక సవర్ల వడ్డాణం తన అజాగ్రత్తవల్ల నేమి, తన ఖర్మం చాలకేమి పోగొట్టుకుని—ఆ పెళ్ళి తన వడ్డాణం పొట్టబెట్టుకోవడానికే వచ్చిందనీ, ఆ ముహూర్తం 'అటువంటి' పాపిష్టిదనీ 'ఇటువంటి' అరిష్టపుదనీ, అది ఇంకా ముందు ముందు ఎన్ని కొంపలు కూలుస్తుందోనని (వారి వారి తన కడుపు మంట కొద్దీ కోటు పారేసుకోడం గాని, ఆ ముహూర్తానికి తనకూ సంబంధ మేమిటో!) గగ్గోలు చేసింది. ముందుండాలి జాగ్రత్త! చేతులు కాలిన తర్వాత ఎంత లబోదిబో మన్నా ఏముపయోగం?

అక్కడ దాకా ఎందుకు? నిరుడీ రోజుల్లోనే గా మా అక్కయ్య మర్నాడు అత్తారింటికి వెళ్తున్నా గదా అని ఆంజనేయ స్వామి గుళ్ళోకి వెళ్ళి పిల్లగాజులింతా పారేసుకుని, మొహం వేలాడేసుకుని ఇంటికి వస్తే—అమర్నాటికే నూటయాభై రూపాయలు పెట్టి కొత్త గాజులు చేయించి పంపించాల్సి వచ్చింది. లేకపోతే వాళ్ళ అత్తగారు అక్కడే దానిగొంతు పిసికేసి, దాని తరఫు వారందరికీ—అదేమీ కందరికీవరుసక్రమంలో సమాధినిర్మాణం చేసేసేది:

ఎన్నెన్నో సంఘటనలు—ఆలోచన లేకుండా ఆడవాళ్ళు నగలు పోగొట్టుకున్న దుస్సంఘటనలు—మనోఫలకమ్మీద ముద్రపడి...ఏనష్టమూ లేకుండా మేమింటికి చేరుతామా అన్నది సంశయంగా సముద్భూతమై భయంగా రూపాంతరంపొంది తోరుకుంది—గొంగళీపురుగు, సీతాకోక చిలుకగా మారినట్లు.

ఒంటెని ఉన్న నగలకోసమని, ప్రాణాలు బలియిచ్చిన అర్థం శుభం తెలీని పసికందులెంత మంది? గుండె దడదడలాడింది. వచ్చే నిద్ర వెనక్కిపోయింది. మామగారు చివరిసారి హెచ్చరించిన "జాగ్రత్త జాగ్రత్త" చెవుల్లో ప్రతిధ్వనించింది.

ముందు జరగబోయే యేకీడును సూచిస్తూనేమో—మా మామగారిచేత విధి అలా పలికించింది! లేకపోతే మామగారు లోగడెన్నడయినా అలా హెచ్చరించారా?

పాడు మనసు! అన్నీ అనుమానాలే. ఎప్పుడూ కీడును ఊహించడమే.

ఏవేవో ఆలోచనలు...

ఏవేవో అనుభూతులు...

ఉండుండి ఉలిక్కిపడుతున్నాను; నాకు నేనే తిరిగి ధైర్యం చెప్పుకుంటున్నాను. కుదరని మనసును అటునుండి మళ్ళించడానికి మళ్ళీ పుస్తకంతీసి పేజీలు తిప్పాను. ఊహూ లాభంలేకపోయింది కనురెప్పలు బరువెక్కనయి వాచీ చూసుకున్నాను. అయిదు నిమిషాలు తక్కువ పన్నెండు. ఫ్లాస్కు మూతతీసి వంచాను. ఖాళీఫ్లాస్కు ఘక్కుమంది. చర్రున కోపం వచ్చింది. చేయగలదేముంది? మూతపెట్టా మూలకు నెట్టాను.

సంధ్య సంధ్యారుణాధరాలమీద చిరుహాసం దోబూచులాడుతోంది - తియ్యని కలలో ఉందేమో!

బాబుకూడా ఆటల్లో అలిసిపోయి నిద్ర పోతున్నాడు.

కంపార్ట్ మెంట్ అంతా కూడా-లోకమంతా అన్నా తప్పులేదేమో-నిబిడ నిశ్శబ్దంలో జోగుతోంది.

కనురెప్పలు మరీ బరువెక్కుతున్నాయి. మనసు విశ్రాంతి కోరుతోంది. బాగా మత్తుగా ఉంది. ఒక అరగంటయినా కన్ను మూస్తేగాని యీమత్తు వదలదు.

అనుకుంటుండగానే కళ్ళు మూతలు బడ్డాయి చెవుల్లో శబ్దం ప్రతిధ్వనించి గుండె దద్దరిల్లింది. కళ్ళు అమాంతంగా తెరుచుకున్నాయి. సంధ్య మెళ్ళోని నెక్లేసు తటిల్లతలాగ మెరిసింది. కళ్ళలోకి వెనువెంటనే "జాగ్రత్త జాగ్రత్త" అంటూ మామగారి గొంతు యధాశక్తి ఉరిమింది.

ఇప్పుడేం చేయడం?

శ్రీమతిని లేపి, కాసేపు మేల్కొనమని. నేను నిద్రపోతే...యిసీ. మంచి ఆలోచన ఈమాత్రపు ఆలోచన ఇంతవరకు తట్టనందుకు...కాని 'శ్రీమతిని లేపితే బాగుండును-' అన్న ఉపాయంతోచి అరగంటయినా ఆపనిమాత్రం జరగలేదు.

ఎందువలన?

ఆపని చేయడానికి భయపడి మనసు ఇలా పెడదారులు పట్టిందా? అవునేమో- లేపితే ఇప్పుడు శ్రీమతి విసుక్కుంటుంది. మంచినిద్ర పాడుచేశారంటుంది. బాగా మత్తులోఉంటే ఇంకాస్త ముందుకువెళ్లి - నేను హాయిగా నిద్రపోతుంటే మీరసలు కళ్ళల్లో నిప్పులు పోసుకుంటారు. మీ మగజాతే అంత! ఏమేమో వాగేస్తుంది. అన్నీ అనేసింతర్వాత పశ్చాత్తాపపడేమి? పడకేమి? ఈలోపల ఆమె గారిని అనునయించాలి! లాలించాలి. బుజ్జగించాలి; అతి అణకువగా సంజాయిషీ ఇచ్చుకోవాలి ఘనత వహించిన శ్రీమతి గారికి. లేకపోతే కంపార్టుమెంటు అంటుకున్నట్టే.

పోనీ రాణీగారికి నిద్రాభంగం కల్గించి ఆగ్రహం పొందేకంటే నేనే ఆవిలువయిన వస్తువులను తీసి దాచేస్తే-కాసేపయినా నిశ్చింతగా కళ్ళు మూయొచ్చు.

అంతకు తప్పితే వేరేదారి లేదు.

లేచి వెళ్ళి శ్రీమతి మెళ్ళోనుంచి నెక్లేసు తీశాను. చేతివంకీ మెల్లగా తీస్తున్నాను. శ్రీమతి కెక్కడ నిద్రాభంగం అవుతుందోనని అతి జాగ్రత్తగానూ, సున్నితంగానూ.

"ఏయ్. ఆగు!" మేఘంలాంటి గర్జ.

ఎవరా-అని పక్కకు తిరిగి చూచేలోపలనే అమాంతం అంతలావుమనిషీ నా మీదకు లంఘించి రెక్క గట్టిగా పట్టుకున్నాడు-అప్పటిదాకా స్పెన్సరుచుట్టలు తగలేసిన వృద్ధకాయుడు.

ఏమీ అర్థంకాక ఆయన బుర్రమీసాల వంక చూస్తూ నిలబడిపోయాను.

# ★ ఆడవాళ్ళతో వచ్చిన చిక్కే ఇది ★

నా చేతిలోని సెల్లేను తన చేతిలోకి లాక్కొని అన్నాడు. "నీ వెక్కినప్పటి నుంచీ నిన్ను సుమానిస్తూనే ఉన్నాను నా కళ్ళలో నే కారం చల్లాలనుకున్నావ్? నా ముప్ఫయ్యేళ్ళ సర్వీసులో నీ లాటిలాంటి వాళ్ళను ముప్ఫయి వేలమందిని పట్టుకున్నా."

నా వళ్ళు చెమటలు పట్టింది. నేను దొంగననుకుంటున్నట్లున్నాడీ మహానుభావుడు! అసలు విషయం చెప్పడం ఎలా?

"నే నెవరనుకుంటున్నారు?"

"అనుకోవడమెందుకు-అగుపిస్తుంటే."

"అదే పొరబాటని..."

"ఊహూఁ! అలాగా! తాతకే దగ్గులు నేర్పుతున్నావ్?"

"మీ కెందుకు వృధాశ్రమ? హాయిగా పడుకోండి."

"వృథాశ్రమా? ఊహూ! నా శ్రమ నీ వృధా చేస్తావ్? బ్రహ్మరాతనుండయినా తప్పించుకోవచ్చు; యమునిపాశ నుండయినా తప్పించుకోవచ్చు. కాని నా చేతినుండి తప్పించుకున్నవాడింతవరకెవడూ లేడు. నీ అనవసరమైన ప్రయత్నం చేయకు-తప్పించుకుందామని."

"మీ రనవసరంగా ఆయాసపడుతున్నారు పడుకోండి. అనవసరం, అనవసరం-అంటావా! నా కొక్కదానికి అవసరం? పాపం-ఆ అమ్మాయి మేమంతా ఉన్నామన్న ధైర్యంతో కదా హాయిగా నిద్రపోతున్నది. నేను తప్ప అందరూ వళ్ళు మరిస్తిరి-పడుకొంటేయుండాలేదా. నీ కెప్పుడు కన్ను మూస్తారా-అని నువ్వు అదనుకోసం కాచుక్కూచుంటివి! అపసోపాలు పడుతూ. సి. ఐ. డి. ఇన్స్పెక్టరుగా తల నెరిసినవాడిని కాబట్టి నే ఎక్కగానే కనిపెట్టా. ఏడు కొద్ది నిమిషాల్లోనే ఎవరితాడో తెంచనున్నావని. అందుకే నిద్ర నటిస్తూ నీమీద దృష్టి ఉంచాను. నీ అదృష్టం బాగుండకో ఈ అమ్మాయిఅదృష్టం బాగుండో ఈ కంపార్టుమెంటులోనే నేనూ ఎక్కాను. నా చేతికి చిక్కావు. ఇంకో పదినిమిషాలు ఓపిక పట్టు. వచ్చే స్టేషనులో నిన్ను చక్కగా 'అత్తగారింట్లో' అప్పజెప్పి-నీ సలహా ప్రకారం హాయిగా పడుకొంటాను..."

ఇంతలో పెట్టెలో వాళ్ళు ఒక్కొక్కరే లేచారు, గుమికూడారు.

"ఏమిటి? ఏమిటి??" ప్రశ్నలు.

"దొంగ! దొంగ!!" సమాధానాలు.

ఆడవాళ్ళందరూ తమ మెడలు తడుముకున్నారు

మగవాళ్ళంతా తమ జేబులు సరిచూసుకున్నారు.

"చదువుకున్నట్లున్నావ్. ఏదన్నా ఉద్యోగం చూసుకోరాదూ-ఈ నీచపనులు చేసేకన్నా" ఒక పెద్దమనిషి సలహా.

"ఈ రోజుల్లో ఉద్యోగాలెక్కడెడ్చినయ్? ఎమ్మే పాసైన మా వాడొకడు ఉద్యోగం దొరక్క ఏవో పిచ్చిరాతలు రత్తి పేపర్లకు రాస్తూ ఇంట్లో కూర్చున్నాడు." మరో పొట్టిమనిషి అందుకున్నాడు.

"అసలు చదువూ లేదు, చట్టుబండలూ లేదు. ఇదంతా వేషమాత్రమే." ఒక పిల్లికళ్ళాయన పరిశోధన.

"పోనీ చదువు లేనప్పుడు హాయిగా కాయకష్టం చేసుకోరాదూ? ముందుముందు దానికే గౌరవం తప్పదు" ఒక సన్నటాయన నీతిబోధ. బహుశా సర్వోదయవాది ఏమో?

"దొంగకూ, దొరకూ భేదం లేకుండా పోతున్నది. దేశం ఎట్లా బాగుపడుతుందో" ఖద్దరుధరించి నొకాయన ఆందోళనపడ్డాడు.

"ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండు" చిన్నప్పుడెప్పుడో చదువుకున్న పద్యపాదం గుర్తుకు తెచ్చుకున్నాడు-దారంతో కళ్ళద్దాలను చెవులకు ముడివేసుకున్న ఒక బక్కపల్చని మనిషి.

పెట్టె అంతా పెనుతుపానులో అల్లకల్లోలంగా ఉన్నా-మహాప్రళయంలో లోకాంతమయిన వేళ వటపత్రశాయియైన మాధవునిలాగా నిశ్చింతగానూ, నిర్లిప్తంగానూ పడుకున్న శ్రీమతిని చూస్తే-ఇతర ప్రయాణీకులకే కాదు, నాకూ ఎనలేని విస్మయం కలగటమే కాదు, కట్టలు తెంచుకుంది.

"ఏయ్ అమ్మాయ్. అమ్మాయ్." అని ఒకావిడ చొరవ తీసుకుని తట్టింది శ్రీమతిని.

ఉలిక్కిపడి లేచింది. అంతా కోలాహలంగా ఉంది. అందరూ నిలబడి ఉన్నారు. ఏవేవో గుసగుసలు. ఏమీ అర్థంకాలేదు, పాపం!

కిటికీలోనుండా బయటకు చూసింది. చీకటి భయావహంగా ఉంది. ఆకాశాన ఎక్కడో చుక్కలు మిణుకు మిణుకుమంటున్నాయి.

రైలు నడుస్తూనే ఉంది.

చూపులు లోపలకు తిప్పింది. అంతా తన వంక తదేకంగా చూస్తున్నారు. ఆ సంగతి తెలుసుకున్నాక తను తల ఎత్తలేకపోయింది. గుండెలు దడదడమన్నాయి.

"అమ్మాయ్! అన్నీ నగలూ ఉన్నయ్యేమో చూసుకో." వృద్ధకాయుడు గంభీరంగానూ, అంతకంటె వందరెట్లు అనురాగపూర్ణంగానూ, అంతకు వేయిరెట్లు సగర్వంగానూ అన్నాడు.

తలయెత్తి ఆయనవంక చూసింది.

ఏనుగుప్రక్కన గొర్రెపిల్లలాగా ఆయన ప్రక్కన నేను. అందులోనూ ఆయన గుప్పిట్లో నా రెక్క. 'ఇదేమిటా?' అనుకుంటేలోపల రెండో చేతిలో తన సెల్లేను తడుముకుంది.

శ్రీమతి కంటిరెప్పలు రెపరెప కొట్టుకున్నాయి. గుండె యింకెంత గజగజలాడిందో!

ఆయనవంకా, నా వంకా చూపులు మార్చిమార్చి చూసింది.

"ఏమిటిదంతా?" అన్నది కళ్ళతోనే, దీనంగా చూస్తూ.

ఏం చెప్పేది నేను? ఏం చెప్పగలను నేను??

ఏ భావాలో, నవ్వులో కూడా అర్థం కాలేదు. మనసు సిగ్గుతోనూ, శోకంతోనూ ముడుచుకుపోయినా-పెదవులమీదమాత్రం ఎండిపోయిన చిరునవ్వు తొంగిచూడినట్లయింది. శోకం హద్దు దాటితే నవ్వుగా మారుతుందేమో! లేకపోతే ఆ చిరునవ్వుకు స్థానమూ లేదు, అర్థమూ లేదు.

మనసుకు ఒకటే ఆలోచన-నాలోకీ ఈ మహానుభావుడు దొంగవాలకం ఏమి కనిపెట్టాడా అని.

నన్ను నేను చూసుకున్నాను.

సామాన్యమయిన పాంటు, ఇన్ చేసుకున్న షర్టు. మర్నాడే పోదామని రెండో జత తెచ్చుకోనందువల్ల కొద్దిగా మాసికూడా ఉన్నాయి. అరిగిపోయిన లోషూ క్రొత్తవి కొనుక్కొమని శ్రీమతి ఎప్పటినుంచో చెవిలో యిల్లు కట్టుకుని పోరు పెడుతూనే ఉంది. నాకుమాత్రం లేదూ ఆ ఉద్దేశం? ఉంది. కాని ఏం లాభం? ప్రతినెలా వాయిదా పడుతూనే మూడు నెలలను వెనక్కు నెట్టింది.

శ్రీమతివంక చూశాను.

బెంగుళూరు క్రేపుసిల్కు చీర...నైలాన్ బ్లౌజు...ఒంటినిండా నగలు...కాళ్ళకు కొత్తముఖమల్ స్లిప్పర్సు... సన్నగా, పొడవుగా, పచ్చగా, దర్పంగా, ఠీవిగా-నిండైన విగ్రహం-కాశీమజిలీ కథల్లో సర్వత్రా కనపడే రాకుమార్తెల పోలిన సౌందర్యం. చప్పున నండూరి సుబ్బారావు గారి రసాత్మకవాక్యం జ్ఞప్తికివచ్చింది-"రాజోరింటికైనా [illegible]వు తెచ్చేపిల్ల."

విధి తమాషా కాకపోతే-ఆమెకు నేనా భర్తను!

అతిసామాన్యంగా నేను.

ఆగర్భశ్రీమంతురాలిగా ఆమె.

ఆమె భర్తను నేనని వాళ్ళెలా అనుకుంటారు?

నేను నానోటిమీదుగా చెప్పినా వాళ్ళెలా నమ్ముతారు?

ఇంతవరకు నన్నూ, పంక్యను ఇట్లా

ఎప్పుడూ పోల్చుకు చూడలేదు. చూసిన కొద్దీ చూసి ఆలోచించిన కొద్దీ—ఆ మొహం, నాకూ బాగా పరిచయమైనట్లు కన్పించింది. అసలు రైల్లో నేను భర్తగా అర్హుడని కాదేమో ననిపించింది. అలా అనిపించిన కొద్దీ మనసు మరీ కుంచించుకుపోయింది. తల పాతాళంలోకి వాలిపోయింది. శ్రీమతి మొహంవంక చూడలేకపోయాను.

ఆడవాళ్ళతో వచ్చిన చిక్కు, ఇది! ఏమన్నా ప్రయాణాలు వచ్చేటప్పటికి ఆడవాళ్ళు అలంకారాలతో, ఆడంబరాలతో ఉన్న దానికి వెయ్యింతలుగా బయటకు కనపడతారు. మగవాడేమో ఉన్నంతలోనే ఉంటాడు. దాంతో భార్యాభర్తలకు వెయ్యి మెళ్ళ భేదం కనిపిస్తుంటుంది. భార్యాభర్తలన్న ఊహకే అవకాశం ఉండకుండా పోయినా ఆశ్చర్యమేమీ లేదు.

"ఏం జరిగిందండీ?" మృదువైన శ్రీమతి కంఠం పలికింది.

నేను తలెత్తలేకపోవటం చూసి, ఆలా వుపాటాయన్ని ప్రశ్నించింది,

"నేను జాగ్రత్తలో లేకపోతే చాలా జరిగేది. ఇప్పుడేమీ జరగలేదులే కంగారు పడకమ్మా."

"మరి ఇదంతా ఏమిటండీ?"

"నువ్వు నిద్రపోతున్నావా?—మెల్లగా నీ మెడలోని యీ నెక్లెసు తీసి, నీచేతి వంకీ తీస్తుంటే పట్టుకున్నాను. యీ దొంగ వెధవను."

"దొంగెక్కడండీ"? చుటూ చూసింది శ్రీమతి భయవిహ్వలయై.

'ఇదుగో ప్రబుద్ధుడు–" అని నన్ను కాస్త ముందుకు తోశాడు.

"ఈయనా..." శ్రీమతి కంఠమే కాదు కళ్ళుకూడా తేలిపోయినాయి.

"నమ్మలేకుండా ఉన్నావు కదూ–పిచ్చి తల్లి! ఈ రోజుల్లో దొంగను కనుక్కోవటం చాలా కష్టం. దొరలవలెనే ఉంటారు. ముప్ఫయ్యేళ్ళ సర్వీసున్న వాణ్ణి కాబట్టి వీడిని ఇవ్వాళ నే పట్టుకోగల్గాను. కాని ఎంత తెలివిగా. ఎంతజాగ్రత్తగా. ఎంత సున్నితంగా దొంగతనానికి ఉపక్రమించాడని! నేను కనుక ఆద మరిచినట్లయితే, రెండు క్షణాల్లో జారిపోయేవాడే; వయ్యారూపాయలసొమ్ము యేటిపాలై పోయే. ప్రయాణాల్లో చాలా జాగ్రత్తగా ఉండాలమ్మా."

శ్రీమతి దిమ్మరపోయినట్లయింది. తల మీద బలమయిన గాయం తగినట్లు. ఉలుకూ, పలుకూ లేదు. అలాగే కొయ్య బారిపోయింది.

నాకు ఇప్పుడు అంతులేని ఆశ్చర్యం వేస్తుంది. ఆ సమయంలో నానోరు నొక్కుకు పోయిందేమో అని. "నే నామె భర్తను" అని మొదట్లోనే ఒక్క మాటంటె గోళ్ళతో పోయేది కదా! ఆ ఒక్క మాట అందామని పదివేలసార్లు ప్రయత్నించి విఫలుడనై పోయాను. పెదవిదాకా వచ్చిన అక్షరం, అక్కడే కరిగి పోయింది కారణం?

చివరకు శ్రీమతే తెప్పరిల్లింది. గుండె దిటవు పర్చుకుంది. గొంతు సవరించుకుంది. ఫాన్ గాలికి ఎగిరిపడే ముంగురులను సర్దుకుంటూ అంది: వారు...వారు...మావారు.

వృద్ధకాయుని గుండె జారిపోయినట్లయింది. కళ్ళు తేలిపోయినయి. నా రెక్కను గట్టిగా అదిమిపట్టుకున్న ఆయన గుప్పెడు చప్పబడిపోయింది; మెల్లగా విడిపోయింది. నా మొహంలోకి తీక్షణంగా చూశాడు. నా కళ్ళు నేలను చూసినయి. శ్రీమతి వంక చూసినట్లున్నాడు.

"మా వారేనండీ." మళ్ళీ అంది నిబ్బరంగానూ, నిశ్చలంగానూ.

సిగ్గుపడుతూ తలయెత్తాను.

ఆయనకళ్ళు తళుక్కుమన్నాయి–"నిజమా?" అన్నట్లు.

అంతలో బాబు లేచాడు. ఈ గందరగోళానికి.

కళ్ళు నులుముకుంటూ బర్త్ మీదనుంచి దూకి, బిత్తరపోయి, వచ్చీ రానిమాటలతో "నాన్నా...నాన్నా' అంటూ నా కాళ్లను చుట్టేసుకున్నాడు.

పెట్టెలోని ప్రయాణికు లందరూ వెల వెల పోయారు. ముక్కుల మీద వేళ్ళేసుకున్నారు. ఎవరి నోటాన మాటరు చుక్క లేకపోయింది. చేజిక్కిన నిధి జారిపోయినట్లు అందిన అదృష్టం అంతలోనే అంతర్ధానమైనట్లు బాధపడ్డారు ఒక దొంగను పట్టుకున్న ఖ్యాతిగానీ, పట్టుకున్నామన్న ఆత్మ సంతృప్తిగానీ దక్కనందుకేమో!

కాని అంతకుమించి వారందరూ అమితాశ్చర్యపోయారు - నేనలా ఎందుకు చేశానని? అలా ఎందుకు ప్రవర్తించానని? ఆ ఆశ్చర్యం వాళ్ళకళ్ళల్లో, మొహాల్లో ప్రస్ఫుటంగా ప్రతిబింబిస్తూనే ఉంది. ఒకళ్ళనొకళ్ళు ప్రశ్నించేవారేకాని జవాబిచ్చేవారే లేరు.

కూడబలుక్కుని చివరకు ఒకాయన ప్రశ్నించారు. "అసలు సంగతేమిటండీ" అని.

జరిగిందంతా చెప్పాను. నా ఆలోచనలూ, అనుభూతులూ సహా.

వచ్చిన చిక్కేమిటంటే–మేము రైల్లో ఎక్కినప్పు డున్నవాళ్లంతా దిగిపోయారు. తర్వాతవచ్చి ఎక్కినవాళ్ళు మా ఇద్దరిని గురించి ఊహించడానికయినా వీల్లేకుండా మేము ఒక్క ముక్కయినా మాట్లాడుకోలేదు. శ్రీమతి మేలుకొన్నంతసేపూ మూతి ముడుచుకుని, పెడ మొహం పెట్టుకుని కూర్చుంది. రైల్లో ఎక్కటప్పటి చిన్న సంఘటనకే.

వింతఘటన వివరంగా విన్న శ్రీమతి పకపకా నవ్వేసింది.

శ్రోతలకల్పారు మిగతావాళ్ళంతా. రిటయిర్డ్ సి. ఐ. డి ఇన్‌స్పెక్టరుగారి అపూర్వమూ, అద్భుతమూ అయిన ప్రతిభా సంపత్తి లాఫింగ్ గాస్ గాపనిచేసింది నేనూ నవ్వాపుకోలేకపోయాను.

ఆయనవంక చూశాను. మొహం చిన్నబుచ్చుకొని శూన్యంలోకి చూస్తున్నాడు నా మనసు చివుక్కుమంది.

"ఎక్స్‌క్యూజ్ మి" నవ్వడానికి ప్రయత్నిస్తూ ఆయన అన్నాడు. నిన్ననవసరంగా అనుమానించి, నీమాటను సరిగా అర్థం చేసుకోలేక, లేనిపోని అలజడి కలిగించి, మీకందరికీ నిద్రాభంగంకూడా కలిగించాను."

"ఫర్వాలేదులెండి–దాని దేముంది?"

"కాని మొత్తానికి బలేవాడివోయ్. నా జీవితంలో తొలిసారిగా పరాజయం తినిపించావు" పకపకా నవ్వి మళ్ళీ అన్నాడు. "ఓడిపోయీ మనసారా నవ్వడం ఇదే మొదటిసారి. అసలు నేనునవ్విన సన్నివేశాలే–నా జీవితం మొత్తంమీద–వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు."

ఆయన్ను చూస్తే–ఆ విషయం ఆయన నోటిమీదుగా రానవసరం లేదు.

చిన్నగా నవ్వి అన్నాడు–"నిన్నెలా అభినందించాలో అర్థం కావటం లేదు."

"ఆ ఘనత నాది కాదండి. దాన్ని గప్‌చిప్‌గా కొట్టేస్తే నిజంగానే నేను దొంగనవుతాను."

ఆయన విరగబడినవ్వాడు.

"—అదిగో ఆమెది, జేబుదొడ్డ నోటికష్టం పెట్టుకుని ముసిముసినవ్వులు నవ్వుతుండే నే–ఆమెది. నన్ను నన్నుగానే అయితే మీరు

# ★ ఆడవాళ్లతో వచ్చిన చిక్కే ఇది ★

అనుమానించేవారే కాదు. ఆ మెథర్డ్‌గా నన్ను నమ్మలేకపోయారు - అంతేనా? నే సదా చెప్తుంటాను-ఒక సామాన్యుని భార్య ఇలా అసామాన్యంగా ఉండకూడదూ అని. నామాట చెవిని నాటితేనా? ఈ ఆడవాళ్ళతో వచ్చిన ఇబ్బందే, ఇది! ఏమంటారు?"

ఆయన మొహంలోకి చూశాను - ఆయన అమూల్యాభిప్రాయంకోసం.

శ్రీమతి అప్పటికప్పుడే మొహం నయాపైసా చేసుకుంది. అది కనిపెట్టి ఆయన నామీద దాడిచేశాడు.

"చిన్నతనం లేవోయ్. ఏదో ముద్దూ ముచ్చటా. అలంకారాలమీద ప్రేమా, ఆభరణాలమీద మోజూ ఇప్పుడుగాక ఇంకెప్పుడు! మీ అమ్మనో, దొడ్డమ్మనో బ్రతిమిలాడు-యీ అలంకారాలు చేసుకోమని-చేసుకుంటారేమో. లేకపోతే నీవు స్వయంగా రేపుదయం బజారుకు తీసుకెళ్ళి మీ అమ్మకు కొత్త స్లిప్పర్లూ, మీ దొడ్డమ్మకు అందమయిన న్యూమోడల్ రిస్టువాచీ కొనిపెట్టు—"

శ్రీమతి ఫక్కుమంది. పెట్టి ఘొల్లుమంది.

నేనూ వచ్చేనవ్వు బిగపట్టుకుని అన్నాను: "మరి మీరే ఇంత నాటకానికి సూత్రధారి అయితిరిగదా!"

"ఏదో నాదే పొరపాటయిందిలేవోయ్ ఇంతమాత్రంచేత అమ్మాయి నీమీ అనకు. దీనివల్ల నీకేమయినా మనస్సుకు కష్టం కలిగితే నన్ను నిందించు. అయినా జీవితంలో యీమాత్రపు ఘటనలు లేకపోతే జీవితం ముద్దుపారిపోదు - మాకులాగ. అటువంట జీవితాలు శాపగ్రస్తాలని యిన్నాళ్ళే నేనభిప్రాయపడుతున్నాను. మీరు నవ్వకుండా ఉంటే ఒక విషయం చెప్తాను..."

"చెప్పండి."

"రామాయణంలోని ఒక ముఖ్యఘట్టం నాకళ్ళకు కట్టునది ఇప్పుడు."

మా అందరి చెవులూ నిక్కబొడుచుకున్నాయి.

"అవతారపురుషుని పాదస్పర్శమాత్రం చేత రాయి రమణిగా మారిపోయింది"

సందర్భం అర్థంకాక ఆయనో్న టివంకే చూస్తూ ఉండిపోయాము, మేము నోళ్ళు తెఱచుకుని.

"...అంతకంటె వింతగా ఇవాళ్టి యీ సంఘటనతో ఎన్నోయేళ్ళుగా బండబారిన నా గుండె చివురించినట్లయి - నా మనసు హర్షపులకాంకితమయిపోతున్నది."

నిజంగా నే-ఏదో అలౌకికానందంలో తలమునకలౌతున్నట్లున్నాడు.

నా మనసులోనూ ఏవేవో భావాలు మిసమిసలాడుతూ గుళ్ళుతిరిగి-అర్థమైపోయింది. సమాధానం చెప్పడానికి ప్రయత్నించలేదు. రైలాగింది.



ఆయన కిటికీలోగుండా బయటికి చూసి "అరెరె-ఇదేనోయ్ నేదిగేస్టేషను. వస్తానోయ్. అప్పుడప్పుడు ఈ ముసలాడిని తలుచుకుని నవ్వుకుంటూ ఉండండి. మరిచిపోకండేం? వస్తానమ్మాయ్...వస్తా బ్రా బుజ్జీ-" అంటూ బాబు బుగ్గలుగిల్లి దిగిపోయినాడు.

ఎక్కేజనం, దిగేజనంతో అంతా గోలాహాలమైపోయింది.

శ్రీమతి అంతరంగంలో నవ్వు అణుచుకోలేకపోతున్నట్లుంది. లేకపోతే ఆ కాటుక కళ్ళలో ఆ వెలుగు జిలుగు లెందుకు? ఆ ఎర్రని పెదవులకు అన్ని వంకర్లూ వయ్యారాలూ ఎందుకు?

రేపటినుంచి యీ సంఘటన చిలవలూ-పలవలతో ఎన్ని చెవులకు విందుచేయాలో! మరి ఆడవాళ్ళనోట్లో నువ్వుగింజ నానదు అంటారు. అందుకు శ్రీమతిమాత్రం ఎందుకు మినహాయింపవుతుంది? ★

# చదరంగం

## దురాశ దుఃఖానికి చేటు

"క్రీడి"

నిత్యజీవితంలో జ్ఞాపకం పెట్టుకోవలసిన సత్యాలను చదరంగంలో మరచిపోకూడదు. దురాశకొద్దీ ముందూ వెనుకా చూసుకోకుండా ఎత్తు వేసేవారికి మొదటికే మోసం రావచ్చు. ఇది ఋజువు చేయడానికి తార్కాణాలు కోకొల్లలు. ఈమధ్య ఆంధ్రా ఛాంపియన్‌షిప్ పోటీలలో బహుమతి పొందిన ఈ క్రిందిఆట కూడా దానికే నిదర్శనంగా ఉంటుంది. (తక్కువఎత్తుల్లో ఆట కట్టినందుకు దీనికి బహుమతి ఇచ్చారు.)

| తెలుపు. | నలుపు. |
|---|---|
| మురంపూడి భాస్కరరావు. | పి. రామమోహనరావు. |
| 1 బ—రా 4, | బ—రా 4 |
| 2 గు—రాశ 3, | గు—మశ 3 |
| 3 శ—శ 4, | బ—మ 3.? |
| 4. కోట, | శ—గు 5 |
| 5. గు—శ 3, | గు—మ 5? |
| 6 గు×బ!, | శ×మ 5? |

నలుపు దురాశకొద్దీ ఈ ఎత్తు వేయడమైంది. ఇది దుఃఖానికి చేటు.

| | |
|---|---|
| 7. శ×బ పా, | రా-రా2 |
| 8. గు-మ5. పా ఆటకట్టు | |

అంతర్జాతీయ చదరంగంతో పరిచయం లేని వాళ్ళకి ఈ కేళి ఆశ్చర్య జనకంగా ఉండకతప్పదు! దీనిని 'లీగల్స్ మేట్' అంటారు. డి. కెర్మూర్ డి-లీగల్ (1710-1792) అనే ఫ్రెంచిదేశపు ఆటగాడు ఈ శాణీని ఆదరణలో పెట్టాడు. అందుచేత దీనిని అతని పేరుతపిలుస్తారు. 1959 లో ఆంధ్రదేశంలో బహుమతి పొందిన ఉదాహరించిన కేళి ఎనిమిదిఎత్తులలో ముగిసింది. గాని 1750 ప్రాంతాలలో పారిస్ నగరంలో జరిగిన ఈక్రిందిఆట ఏడు ఎత్తులలోనే ముగిసింది.

| తెలుపు | నలుపు |
|---|---|
| డి-లీగల్ | ఎవరో తెలియదు |
| 1. బ-రా4, | బ-రా 4 |
| 2. గు-రాశ 3, | బ-మ 3 |
| 3. శ-శ 4, | శ-గు5 |
| 4. గు-శ3, | బ-రాగు3? |
| 5. గు×బ!, | శ×మ??? |
| 6. శ×బ పా, | రా-రా2 |
| 7. గు-మ 5 పా ఆటకట్టు | |

ఈ 'లీగల్ మేటు' సాధారణంగా ఆట మొదటి పదిపన్నెండు ఎత్తులలో సాధ్యమవుతుంది. ప్రత్యర్థియొక్క మంత్రీ, రాజాన్ని పుశగటూ పుట్టుగళ్ళలో వుండిపోయినప్పుడే వీలవుతుంది. ఈ ఆటకట్టుయొక్క నమూనా అచ్చుగుద్దినట్టు జ్ఞాపకం పెట్టుకోడానికి ఈ క్రింది చిత్రం పాఠకుల సౌకర్యార్థం మిగతా బలాన్ని మినహాయించి ఇస్తున్నాము.



గమనిక: ఆధునిక అంతర్జాతీయ టోర్నమెంటులలో ఈ ఆటలోని క్రమంలో మొదటి ఎత్తులు వేయడం మానేశారు. 3. శ-శ 4 వల్ల తెల్లబలంలో మొహరా ఆటలోనికొచ్చినా అందువల్ల ఫలం పాటులేదు. ఇది రా 4 లోని నల్లబంటు మీద దాడికి తోడ్పడదు. శాస్త్రవేత్తరెటి ఈమాదిరి ఎత్తులు సిఫార్సుచేయడు! మూడవ ఎత్తులో తెలుపు శ-శ 4 వేసినప్పుడు నలుపుదానికి సరైన జవాబుగా గు-శ 3 వేస్తే ఏ ఇబ్బంది ఉండదు. రాశ 3 లో ఈ నల్ల గుర్రమున్నంతకాలం తెలుపు 'లీగల్ మేటు' సాధించ లేదు.

★

### సమస్య 1 పరిష్కారం

కీలకం ఎత్తు : 1. శ×బ

దీనికి జవాబుగా నలుపు వేయగలిగిన ఎత్తులు మూడే మూడు ఉన్నాయి. ఏ ఎత్తు వేసినా మూడో ఎత్తులో ఆటకట్టే క్రమం ఇది.

(అ) 1......... శ×శ
2. బ—గు 3 రా—గు 3
3. శ—ఏ 3 తెరచిరాజా ఆటకట్టు

(ఆ) 1......... బ—గు 6
2. శ×శ తెరచిరాజా రా×శ
3. గు—శ 3 పా కట్టు.

(ఇ) 1......... శ—ఎక్కడికైనా.
2. శ—(శశ పగలోకి) రా—గు 3 తెరచి రాజా
3. శ×శ పా కట్టు.

ఈ సమస్యని పరిష్కరించడంలో చాలా మంది ఉత్సాహం చూపారు. పార్సిక్ సంకేతంలో జరిగిన అచ్చు తప్పని సరిదిద్దాను. అందుకు కృతజ్ఞుణ్ణి. (ఇకమీదట అచ్చు తప్పులురాకుండా ఉండాలని ప్రయత్నిస్తాను) సరియైన పరిష్కారం పంపినవారు. శ్రీయుతులు (1) ఈ. కామేశ్వరశర్మ, మంగినపూడి (2) కె. వి. టి. రావు నాగపూర్ (3) ఎన్. వీరభద్రరావు సికింద్రాబాద్ (4) వి. పెరుమాళ్ళరావు-మద్రాసు (5) పి. రాధాకృష్ణారెడ్డి (ఇల్లూరు, అనంతపురం జిల్లా), (6) ఎస్. కె. వి. రామానుజాచార్యులు (ద్వారకా తిరుమల) (7) ఎస్. రామగోపాలశర్మ(మద్రాసు) (8) టి.బి. వి. ఎస్. రావు (కొవ్వూరు). ఒకే ఒక్క ఉపశాఖని సరిగ్గా పంపినవారు: పి. కె. కుమారి, మద్రాసు. మిగతావారందరూ తప్పు జవాబులే పంపారు. ఇంత ఉత్సాహంతోనూ మిగతా సమస్యలు పరిష్కరిస్తారని ఆశిస్తున్నాను.

### సమస్య 3

రచన: జె. జె. ఓకీఫ్

1గ/2 తెబ 3 నబ 1/2 నబ 3 తెబ నబ/ నరా 1 తెబ 4 తెరా/నబ 1 తెబ 5/ తెశ 7/ నశ 1 తెవి 5/ మూడెత్తులు.

నలుపు (6) ★



తెలుపు (7)

[ తెలుపు ఆడి మూడెత్తుల్లో కట్టాలి. ]

### సవరణ

5-8-59 తేదీ సంచికలో "ఒకసారి డాక్టర్ అలెఖైను అయిదు మంత్రులు ఉంచాడు" అన్నది దయచేసి ఒకసారి డాక్టర్ అలెఖైన్ ఆడిన ఆటలో అయిదు మంత్రులు ఉన్నాయి." అని దిద్దుకోనండి.



# కాలదోషం పట్టని ప్రవచనాలు

## “స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః”

ఆడదంటే అబల కాదని చెబుతున్నారు నేటి సోదరీమణులు. ఏ సత్యకాలంలోనో అన్నది ‘ఆడది అబలా’ అని—ఆడది అబల కాదన్నది-మహాబల అన్నది అనుభవ పునరుక్తి. బలం కేవలం దేహబలం అయితే ఆడది అబలే నేటికీ! ఇక చెప్పాల్సిన అవసరమేం లేదు కూడా.

విత్తమూ, బుద్ధి కూడా అధమాధమమూ, ప్రళయాంతకమూను అవి స్త్రీవైతే!

అంతెందుకు ఆడవాళ్ళే చల్లని తల్లులు చెబుతారు అడగండి! ఆడదానికన్న మగవాడే నయమనిపిస్తాడు అత్తగారిలా అనేక సందర్భాల్లో’ అని.

అయితే ఆడదానివల్ల మగవాడూ, మగవాడివల్ల ఆడదీ చేతకానివాడూ, దుష్టులూ అవుతున్నారనే కార్యకారణ సంబంధ ప్రబంధపు లోపలి పుటల్లో అన్నీ తర్జన భర్జనలే- తెగని వాదనలే!

ఒక్క మాట! ఓపిగ్గా వినండి—నిజానిజాలు గ్రహించండి! నిష్పాక్షిక విషయ విచారణ చేయండి. కొన్ని సందర్భాల్లో ఆడది ప్రవర్తించినంత సంకుచితంగా, నీచంగా, కఠినంగా, కఠోరంగా, నిష్కర్షగా, నిర్దాక్షిణ్యంగా, అవమానంగా మగవాడు మాత్రం ప్రవర్తించలేడు. అతడు మగవాడుగా ఉండి ఆ ప్రవర్తనలో పరాకాష్ఠ ఎప్పుడూ అందుకోలేడు ముమ్మాటికీ!

చైనా దేశంలో ఒక సూక్తి ఉంది. “ఆడవాళ్ళల్లో సహృదయులంటూ ఉంటే రెండే రకాలు. ఒకటి. అసలు పుట్టనివాళ్ళు, రెండు, చచ్చిపోయినవాళ్ళు.”

సవతితల్లి తనంలో కొన్ని చోట్ల ఆడదాని దౌష్ట్యం అందుకున్న పరాకాష్ఠ చూస్తే చాలు. వేరే చెప్పాల్సిందేముంది. ఆడబిడ్డలుగా, అత్తగార్లుగా, తోడికోడళ్ళుగా అవతారలెత్తాలు ధరించడంలో స్త్రీలు అంత దారుణంగా ఉండటంలో కారణం ఏమిటో తెలియదు. తెలుసుకోడం సాధ్యం కాదు.

ఒక జీవిత గాథ—

నేను ఒక సంసారం ఎరుగుదున్నాను. అన్నదమ్ముల ఉమ్మడి కుటుంబం-ఉమ్మడి మాటగా ఇంటికి సంసారం. తరతరాలుగా అమృతలహరి పొంగారులు వారి పాలక చలివంటి ఆ కుటుంబంలో పడింది విషపు చుక్కలా ఒక స్త్రీపాత్ర.

తల పూర్తిగా నెరసిన అన్నదమ్ముల్లో ఒకాయన కూతురు గారాబంగా పెద్దదైంది పాపం. విదేశీ పౌషన్ కొద్దీ ఫ్యాషన్ స్నో మీరి ఆమె అమ్మ దిద్దిన తిలకం నవ్వులకు వడుతూ, గాజులు తిరగ్గానే చేత్తో తుడిచివేసుకునేది.

ఆమెకు పెళ్ళయిన ఏడాదికే విధికూడా ఆమె పసుపు కుంకుమ తుడిచివేసింది.

### రామరాజామాత్య

నిజంగా ప్రపంచమంతా ఎంత జాలిపడాలంటాగా ఆ అభాగినిని చూస్తే! తల్లి తండ్రులు ఆమె దీనతకు కృంగిపోయారు. పైగా ఆమెకు ఒక మగపిల్లవాడు పసిగుడ్డు.

కాలం గడుస్తోంది—

అన్నలూ, తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ, అక్కలూ, వేలువిడిచినవారు, సజ్జా సంతూ అంతా నవనవోన్మేషంగా అభివృద్ధిపథంలో పురోగమిస్తూ భావినిగూర్చి కమ్మని కలలు కంటున్నారు.

వదినలు. తోడికోడళ్ళూ అక్కలూ ఇత్యాదులు భర్తలతో కమ్మగా వర్తమానం ‘కలయో నిజమో’ అంటూ అనుభవిస్తున్నారు.

హృదయంలో గుర్తుగా పెట్టిన వాతప్రాత గుర్తు కదిలితే కనిపిస్తోంది తల్లిదండ్రులకి.

గతాన్ని తలచి క్రుంగిపోతూంది అభాగిని.

ఋతువులే కాదు మతులు కూడా మారుస్తుంది కాలం—

ఆమెను రాను రాను ఆమెకు తెలియకుండానే ఒక అసూయ. “అంతా హాయిగా ఉన్నారు. అనుభవిస్తున్నారు.”

ఒక చింత. “ఇహ నా జీవితమింతేనా—మోడైపోయిందా చిగురించదా. పూతపట్టదా! నా జీవిత యామినిలో రజని తొంగిచూడదా?”

ఒక ఆలోచన. “నా బిడ్డడి గతేంకాను. వాడి మొహం అమ్మ నాన్న ఉన్నంతవరకు సరే-తరువాత యేమిటి?”

ఒక ఆందోళన. “అయ్యో ఎట్లా. నేను సుఖం మధ్యలో ఉండి అనుభవించలేను. నేను మళ్ళీ గారాబంగా ఉండాలి-హోదా అనుభవించాలి-విధి చెరపినవి కావాలి—”

“అంతా కిలకిలలాడుతూ కులాసాగా ఉండటమేం. నేనిలా కడుపులో కొలిమితో తహతహలాడి కుమిలిపోవడమేం—”

జీవితం భారమే మోయడానికి—భారతం చదవడానికి.

చాడీలు ముఖ్యమయిన ఆయుధాలు. తండ్రి వాత్సల్యంతో కన్నుకానని ధృతరాష్ట్రుడు-అతని నూర్గురు కుమారులు కర్ణ శకున్యాది గుణ్ణపగల చిత్తవృత్తి మొత్తంగా పుణికి పుచ్చుకుంది అభాగిని. చాడీల గాండీవాలు ఆమె సవ్యసాచిలా ప్రయోగించడం మొదలెట్టింది.

మగదిని వదినని (వేలువిడిచినవాళ్ళు) చనువుగా ఉంటారని చనువు అనువుగా తీసుకుని, కళ్ళలో లోతులతో, పెదవులపై శుష్క నవ్వుతో “నాన్నా ఇద్దరూ తోడుదొంగలే! ఇహ తలెత్తుకు తిరగక్కర్లేదు!” ఇదీ కృత్యాది.

కూతురుమాట వేదవాక్యంగా నమ్మేవాడు తండ్రి. పైగా కావాలని ఆమెను దగ్గర కూర్చోపెట్టుకుని చెప్పించుకుని వినేవాడు అంత నమ్మకం పాపం కూతురంటే. పైగా ఆమె తన దౌర్భాగ్య దీనతతో, కన్నీళ్ళతో, పస్తులతో, ఇత్యాద్యవస్థతో తండ్రి[illegible]జయించింది

అనుమానాలు. అపార్థాలు అపోహలు. ప్రవాదాలు, ప్రమాదాలుగా వ్యాపించి, దక్షత, శాంతి, గౌరవం నశించి రేగడయి-పోయింది సంసారం. పెద్దవాళ్ళు హరి అనడంతో. పండు ముగ్గిపడినవంటి సంసారం పగిలి ముక్కచెక్కలైంది

పొలం పుట్రా చెంబూ చెట్రా నగా నట్రా ఆమె నోముకుంది. కాదు కాదు దోచుకుంది.

ఆమె అల్లకల్లోలంగా ఆ సంసారసాగరం

# పెళ్ళిళ్ళు - కాపురాలు

త్రము తమ ఇళ్ళల్లో ఒక అమ్మాయిగాని, అబ్బాయిగాని బయలుదేరి కొంచెం చిన్న చిన్న మాటలు చెప్పడం ప్రారంభించినది మొదలు ఇంట్లోని అవ్వలు, అత్తలు, అమ్మలు వాళ్ళు సరదాకు అన్నట్టుగా "అమ్మా నీ మొగుడేడీ? పల్లకీలో నువ్వేలా కూచుంటావు?" అనీ ఈలోగా ఏ మగపాపాయినో వాళ్ళదృష్టిలో పెట్టుకొని అడుగో నీ మొగుడు అనీ, ఇదిగో నీ పెళ్ళాం అంటూ చిన్న చిన్న పెళ్ళి సంభాషణలు నేర్పిస్తారు. అది కారణంగా ఆమెకు గాని, అతనికి గాని లేక ఇద్దరికీ కూడా కాస్త పది పన్నెండేళ్ళు వచ్చే వరకు మొగుడు పెళ్ళాం అనే ఆలోచనలు బయలుదేరి దినదినాభివృద్ధి పొందుతుంటాయి. సరే పెళ్ళివయస్సు వచ్చేసరికి కొంతమంది ఈ సరదాకబుర్ల ఫలితంగా ప్రేమపాశాలు అల్లించుకుంటారు. ఈ రోజుల్లో కాకపోయినా ఇంతకంటె కొంచెం ముందు రోజుల్లో (ఎక్కువగా మన తెలుగువాళ్ళల్లో) నానాయాతనాపడి సంబంధాలు వెతకడం అబ్బాయి తాలూకువాళ్ళడిగిన వాటికన్నింటికీ ఊఁకొట్టి ఏదో స్థిరపరచటం కద్దు. కొన్ని కొన్ని కుటుంబాలలో వాళ్ళఅవసరాలను బట్టి దగ్గరసంబంధాలని పనిలోపని జరిగిపోతాయనీ సదరు యువకుడుగాని, యువతిగాని అంగీకరించక పోయినప్పటికీ బలవంతంగా నయానో, భయానో నచ్చజెప్పి నచ్చచెప్పినా వినిపించుకోకపోతే బలవంతం చేసి వాళ్ళ కార్యక్రమాలను నిర్విఘ్నంగా కొనసాగించుకొంటారు. అక్కడితో వాళ్ళబాధ్యత తీరిపోయింది కనుక "హమ్మయ్య కష్టం ఫలించింది; ఒక పెళ్ళి చేయించేము' అని మహాసముద్రం దాటొడ్డుకు చేరుకున్నంత సంబరపడతారు. అంతటితో వాళ్ళకర్తవ్యం తీరిపోతుంది. తరువాతఘట్టం భార్యభర్తలకు సంబంధించినది ప్రారంభం అవుతుంది. పెళ్ళిలో వారికీ వీరికీ అంటే ఆడపెళ్ళివారికీ, మొగపెళ్ళివారికీ మధ్య లావాదేవీలు లేకుండా, పేచీలు రాకుండా పోతే ఆ వధూవరులు ధన్యులే! కాని ఒక్కొక్కప్పుడు ఇచ్చిపుచ్చుకోవడాలలో భోజనం పిలుపులదగ్గర, అప్పగింతలలోనూ, వడ్డనలలోనూ అనుకోనివిధంగా పట్టుదలలు

**రచన: "శ్రావణి"**

ప్రారంభమౌతాయి. ఇంక అవి సద్దుమణగడానికి ఎవరెన్ని ప్రయత్నాలు చేసినా వాళ్ళూ, వీళ్ళూకూడా ఎక్కిన గుర్రాన్ని దిగరు. అక్కడితో పెళ్ళి పెళ్ళిలా జరిగిపోయి తరువాత కార్యక్రమాలకు బ్రేకు పడుతుంది.

శోభనం చేసుకోమని అమ్మాయి తాలూకు వాళ్ళూ ఫలానా విషయం మీరు భర్తీ చేస్తేనేగాని మేము అంగీకరించేది లేదని అబ్బాయి తరఫువాళ్ళు వ్రాసుకుంటు ఆ భార్యాభర్తలను కూడా బాధపెడతారు. కొంత కాలానికి వాళ్ళకు కూడ ఒకరిపై మరొకరికి అంతవరకు వుండిన ప్రేమ, ఆప్యాయత సడలిపోయి వాళ్ళ పరస్పర అనురాగం తగ్గడం, అశ్రద్ధ హెచ్చడం ప్రారంభమౌతాయి. ఈవిధంగా రోజులు, నెలలు సంవత్సరాలు గడచిపోయే కొలది అబ్బాయి అక్కడా అక్కడా కనుపించే అప్సరసల వైపుచూస్తు నోరుతడి చేసుకోవడం మొదలకు తప్పని సరి తంటాలుపడుతుంటాడు. ఇంత అమ్మాయి ఏకో పల్లెటూరిది, కాస్తంత భయభక్తులు కలది అయితే భగవంతుడా నాకింతే రాసేవురా! నేనేం చేసేది? ఇచ్చట వీళ్ళూ అచ్చటవాళ్ళు పట్టుబట్టుకుని కూర్చున్నారు అభానపడుతూ దేవుడి పీఠం దగ్గర గడపడం, కృశించి పోషణం లేక చివరికి ఏ అఘాయిత్యానికో పాల్పడడమో జరుగుతుంది. కొంచెం చదువుకున్నది, బస్తీలో తిరిగేది అయితే పెద్దల కోసం అణిగి మణిగి కొంతకాలం మాత్రం ఉంటుంది. ఎంతకాలానికి ఆ సమస్య విడే అవకాశం లేకపోతే వేరేదారి చూసుకోవడానికి ప్రయత్నించి తీరుతుంది. ఏకో భగవంతుడు రక్షించి వాళ్ళు వీళ్ళు మధ్యవర్తుల ద్వారా రాజీకి ప్రయత్నించినప్పటికీ చిన్న చిన్న మనస్పర్థలు పాతుకుపోయి వుంటాయి రాజీ జరిగిన తరువాత తిరిగి ఆగిపోయిన కార్యక్రమం ప్రారంభమవుతుంది. మొదటిరాత్రి వేడుకగా జరిగించే పద్ధతిలో అన్ని ఏర్పాట్లు జరుగుతాయి. అంతా బయటకురాగా అమ్మాయి అబ్బాయి మొదటిసారిగా గదిలో వుంటారు. ఆ క్షణం వాళ్ళ మనస్తత్వాలు, ఆ రాత్రి ఒకరినొకరు గ్రహించుకొన్న రీతి, వాళ్ళ వాళ్ళ ప్రవర్తన మీద ఆధారపడి వుంటుందంటారు. ఆనూతన దంపతుల భావిజీవితం. భర్తను చాలకాలం తర్వాత చూడ్డంతోనే ఆమెకు పెళ్లినాటి సంఘర్షణలు. గొడవలు గుర్తుకువస్తాయి. ఒక్కసారి ఆమెలో సిగ్గు భయం కొత్తదనం బాధలు రేగుతాయి. వెంటనే ఆమె ఘనీభవించి ఒకమూలగా నిలబడుతుంది చలనం లేకుండా, (ఈ రోజుల్లో కూడా సిగ్గు, భయం ఉన్న ఆడవారు లేకపోలేరు) అతను కాస్త చురుకైనవాడు తెలివైనవాడు అయితే ఆమెలోని ఆందోళనను అర్థం చేసికొని జరిగినవన్నీ మర్చిపోయినట్టుగా, ఆమెను లాలనగా చేరదీస్తే తను ఎంత క్రూరుడో అనుకున్న భర్త ఇంత మంచివాడా! అని తన అభిప్రాయం మార్చుకుంటుంది. అందుకు తోడు ఆ భర్త "జరిగినవన్నీ మర్చిపో. పెద్దవాళ్ళకు బుద్ధులు లేక, వాళ్లలో మానవత్వం నశించడంచేత, ఇంతకాలం నిన్ను కష్టపెట్టవలసి వచ్చింది" అని చెప్పగలిగితే ఆమె కూడా వెంటనే "మీలాంటివారు నాకు భర్తగా లభించడం నా భాగ్యం. మా వాళ్ళు కూడ మంచి చెడ్డలు తెలియకుండ పెళ్ళిలో మిమ్మల్లను అగౌరవపరచేరు. ఇంతకూ నా అదృష్టం కొద్దీ......" అంటూ ఇంకా ఆమె ఏవేవో చెప్పబోతూంటే అతను ఆమెతో "అబ్బ పోనిద్దూ ఇంకా ఎందుకు. ఆ మాటలన్నీ చెప్పి కాలం పాడు చేస్తావూ"? అంటాడు క్రీగంటచూస్తూ. ఆమె అమితానందంతో అతని వశమవుతుంది! కోడి కూస్తుంది! తెలవారుతుంది! బాగా పొద్దెక్కుతుంది! అలసిసొలసిన ఆ అనురాగ దంపతుల హృదయాలు మేలుకుంటాయి.

---

మధించి కాకోలం అందరికీ పంచి అమృతం తను సేవించిందని అంతా అనుకున్నారు. ఆమె ప్రమేయం లేకుండా—క్లియోపాత్రా నిగూఢవ్యూహాలు రువ్వి సామ్రాజ్యాలు ధ్వంసం చేసిందనీ. మంథర, కైకేయి చేసిన దౌష్ట్యమే రామాయణంగా పర్యవసించిందని చెప్పినా—దానికి సద్వ్యాఖ్యానావకాశం ఉంది.,

కాని అభాగిని కుటుంబ విభాగిని కావడంలో సద్వ్యాఖ్యానం ("ఫెయిర్ కామెంట్") ఏమిటో తెలీదు

ఏ మహానుభావుడు ఎప్పుడు ఉచ్చాటన చేశాడోగానీ ఈ ప్రవచనం. "స్త్రీబుద్ధిః ప్రళయాంతకః" నిత్యం అనుసరించే-అనుభవానికి అనువదించే కాలదోష మెరుగని మహా సత్యవచనం.

(దుర్మార్గానికి అంతు ఉన్నట్టే దాని వర్ణనకూ కథనానికి అవధి వుంది. కాని ఆద్యంతాలు లేక మానవుడు ఆకళించుకోలేని మహా దుర్మార్గులకు వ్యాఖ్యానం ఎట్లా? ఏం రాసినా ఆ దౌష్ట్యాన్ని చిత్రించినట్టే కాదు. అనుకుంటే తెలిసేది కాదు. అనుభవంలో తెలిసేది—ఈ దౌష్ట్యం! ఆమెది అబలకాదని ఘంటాపథంగా చెప్పనివారు లేరు. కాదని నిరూపించే బాధ వారి కనవసరం. అందుకనే!!!!










# పెళ్ళిళ్ళు–కాపురాలు

అది మొదలు వారిలో ఒకరిపై ఒకరి అభిమానం పెంపొందుతుంది. మొదటిరోజున పునాదివేసిన ఆ అనురాగం శాశ్వతంగా వర్ధిల్లుతుంది. అయితే సంసారంలో మామూలుగా అప్పుడే వచ్చే చిన్నచిన్న తగాయిదాలు లెక్కలోనివి కావు. ఇది ఒక రకం జంట.

ఇంక రెండవ తరహా: ఇది చాల విచారకరమైన పరిస్థితులను తెచ్చిపెడుతుంది చూసే వాళ్ళకూ వినే వాళ్ళకు కూడ, పెళ్ళిలో గొడవలు పడిన తరువాత మిగత కార్యక్రమాలు వెంటనే జరుగవు. తరువాత అనేక మంది పెద్దలు అనిపించుకొనే వాళ్ళ చేత రాయబారాలు నడిపించి ఎలాగో పెళ్ళి అయిన రెండుసంవత్సరాలకైనా భీష్మించుకొని కూర్చున్న అబ్బాయి తల్లిదండ్రులను, అబ్బాయిని శోభనం చేసుకొనమని ప్రతిమాలి, ఏదో వాళ్ళడిగిన నాలుగిటిలో ఎంతో మళ్ళీ ముట్టచెప్పి సంధాన పరుస్తారు. అయితే వయస్సు వచ్చిన తరువాత పెళ్ళి చేసికొని మధ్యలో రెండు సంవత్సరాలు గొడవలు పెట్టుకొని ఒకరి నొకరు చూచుకొనక పోవడంతో అమ్మాయికి భర్త అంటే ఒక యముడులాగనూ, అబ్బాయికి భార్య అంటే ఒక దాసీది లాగనూ కనుపిస్తారు వీరి విషయంలో కూడ మొదటి రాత్రినే ఉదాహరణగా తీసికొనవచ్చు. స్త్రీకి సామాన్యంగా సిగ్గు, భయం, అణకువ వుండవలసిన లక్షణాలు కాబట్టి ఈమెకు కూడ ఆ గుణాలు ఉన్నాయి అనుకుందాము. ఇంక ఆ భర్త మంచం మీద పడుకుని కాలు మీద కాలువేసుకొని ఊపుతో ఎదురుగా నున్న ఫోటోలవైపు చూస్తూ కాలక్షేపం చేస్తాడు. లేకపోతే తలుపుతీసికొని బయటకు వెళ్ళి నలుగురితోనూ చేరి పేకాట మొదలు పెడతాడు. తరువాత వచ్చేసరికి కూడ ఆ భార్య క్రుంగిపోయి అలాగే నిలబడుతుంది. అప్పుడు సాధారణంగా రెండవ వర్గంలో మూర్ఖులైన భర్తలు "ఏం ఇంకా బుద్ధి రాలేదా? ఎందుకు అలా మూల ఇరుక్కుపోతున్నావు" అంటూ చెయ్యిపట్టుకొని బరబర తన మంచం దగ్గరకు లాగేస్తాడు. ఆ కేకలు వినేసరికి ఆమెకు సగం ప్రాణం పోతుంది. ఇంకా ఆ భర్త "మీ నాన్నకున్న పొగరుమోతుతనమే నీకువచ్చింది. చెవిటేనీక్కాదూ? ఇలారా పడుకో" అంటూ మళ్ళీ కసురుతాడు. ఆమెకు మరీ భయంకలుగుతుంది. మాటైనా చెప్పకుండా ఆమె క్రింద చాప వేసుకుని పడుకుంటుంది. కాని ఈ భర్తకు మాత్రం లోపల రగులుకుంటూ వుంటుంది.

నవ్వు చెప్పడం చేతగాదు. మళ్ళీ ప్రారంభిస్తాడు. ఏం ఇలా మంచంమీదకు రమ్మంటే అలా కించేదుస్తావే...ఇలా పైకివస్తావా, ఏమున్నాతగలాలా" అంటు ఘర్జిస్తాడు 4 సం॥ల పాటు కాపురంచేసిన పెళ్లాం మీద కసరినట్లు. ఇంకా ఆదెబ్బలో ఆమె లేస్తుంది. అతను బలవంతంగా ఆమెను మంచంమీదకు లాగుతాడు. ఆమె పెనుగులాడుతుంది. చివరకు మగవాడు కాబట్టి అతనే జయించి అతనికోరిక నెరవేర్చుకుంటాడు. ఆమె కుమిలి దుఃఖిస్తుంది. ఎవరో క్రొత్తవ్యక్తి, తనను తిట్టి బాధించటంతో ఆరోజునుంచీ ఆమెభర్త అంటే ఒకయమదూతలాగ భావిస్తుంది. ఆరోజునుంచే తను ఇటువంటి భర్తతో ఎంతకాలం కాపురం చెయ్యగలను అని ఆవేదనతో మనస్సు వికలం చేసుకుంటుంది. తన కార్యక్రమం పూర్తి అవడంతో సైనా ఆమెను లాలించకుండా అతను సుఖంగా నిద్రిస్తాడు. ఆమె అలాగే ఏడుస్తూ జాగరం చేస్తుంది. ఆ మూడు రోజులు మూడు యుగాలు అనుకుంటుంది. మళ్ళీ తన జీవితమంతా ఈ వ్యక్తితోనే కాపురం చెయ్యాలి కాబట్టి తనకాపురం ఒకనరకంగా భావిస్తుంది. ఇంకా ఆమెమనస్సు చలించేక సంసారంలో సుఖ మెక్కడుంటుంది. భార్యభర్తలు ఒకరినొకరు అర్థం చేసికోలేరు. ఆ భర్తకు భార్యను చూసినప్పుడల్లా మామగారు పెట్టినగొడవలో, అత్తగారు చేసిన అవమానమో, లేక భార్య పెండ్లి అయిన తరువాత రెండు సంవత్సరాలు కాళీగా ఇంటిదగ్గర గడిపిందిగదా. అప్పుడు సరిగ్గా ప్రవర్తించిందా? అయిన వయస్సు వచ్చినది ఎలా ప్రవర్తించగలదు. ఇటువంటి వేధనతో మళ్ళీ నేను కాపురంచెయ్యాలా అనుకుంటూ భార్యను హీనంగా చూస్తాడు. ప్రతీ చిన్న విషయంలోనూ ఆమెపై తప్పును చూచిస్తాడు. ప్రతి సంఘటనకు లేనిపోని అర్థాలు చేసుకొని ఆమెను సాధిస్తాడు. ఇరుగుపొరుగు అమ్మలక్కలకు సానుభూతి సాధారణంగా వుండదు సరిగదా ఎకసెకలు పకపకలు ప్రారంభిస్తారు ఒక రెండుమూడు నెలలు కాపురంచేసే సరికి అతనికి చీరాకెక్కువయి కొట్టడం ప్రారంభిస్తాడు. ఇంక ఆభార్య కొంచం ధైర్యం తెచ్చుకుని ఎదిరించబోతే ఆమెను చిత్రవధ చేస్తాడు. తల్లిదండ్రులకు ఉత్తరంవ్రాస్తే తనతో కాపురం చెయ్యనంటాడు. తను

ప్రాసివాళ్లు చేయగలిగేదే మంటుంది. అని మళ్ళీ ఊరుకుంటుంది. ఆమె భర్తను మంచి చేసుకోవడానికి ప్రయత్నించనవచ్చు. కాని మొదటిరాత్రి సంఘర్షణలు వారిలో ఒకరిపైఒకరికి విశ్వాసాన్ని కలుగనీయవు. భర్తమరీ క్రూరంగా ప్రవర్తిస్తే ఆమె సహించ

# ★ ఉత్తరాలు ★

( 2-వ పేజీ తరువాయి)

## ఇంజనీరింగ్ పదాలు

6-8-69 తేదీ వారపత్రికలో రాజధాని కబుర్లు అనుశీర్షికలో 'భూమ్యంతర్భాగంలో మురుగునీటి పారుదల సౌకర్యాలు ఉన్న ప్రతినగరంలో రోడ్లప్రక్కన 'మేన్ హోల్స్' అనబడే రంధ్రాలుంటాయి...రాజధానిలో నగర పాలక సంఘోద్యోగుల వ్యాపార నిర్వహణాను రక్తివల్ల ఆ రంధ్రాలకు మూతలు కరవడ్డాయి' అంటూ ప్రవీణ్ వ్రాశారు. ఆయన వుద్దేశ్యం బాగానేవున్నా, వున్న విషయాన్ని సరిగ్గా ప్రజలకు అందజేయలేకపోయా రనటానికి విచారిస్తున్నాను. "మేన్ హోల్స్" సాధారణంగా రోడ్డుకు మధ్యలో ఉంటాయి కాని రోడ్డుప్రక్కగా ఉండవు. ఎటువంటి ప్రమాదపరిస్థితిలో గూడా వాటిమూత తీసివుంచరు. ఎందుచేతనంటే వాటిక్రింద కనీసం ఒకమనిషికిపైగా లోతు కట్టడం వుంటుంది. అందుచేత అవి ఎప్పుడైనా తీయవలసి వచ్చినా ఎర్రజండాలు అవీ వుంచుకొని పనిచేసేవారు ప్రమాదములను గుర్తుతెస్తారు. ప్రవీణ్ గారు వ్రాయదలచుకొన్నది రోడ్లప్రక్కన వర్షపునీరు పోవుటకుగాను ఏర్పాటుచేయబడే 'కాచ్ వాటర్ బేసిన్స్' అనేవాటిని గురించి. ఇవి సుమారు రెండు రెండున్నర అడుగులలోతు వుంటవి. అందుచేత అప్పుడప్పుడు శుభ్రం చేయడానికి వాటికి మూతలు తీయబడుతూ వుంటవి. మీ వుదాహరణ నేను ఒప్పుకుంటాను. అవి సరిగా జాగ్రత్తగా మూయకపోతే చిన్నపిల్లలకేగాదు, పెద్దవాళ్ళకు కూడా ప్రమాదం. ఇంజనీరింగు పదాలు వాడేటప్పుడు కొంత ఆలోచించి వ్రాయడము మంచిదేమో. ఇందువలన మన రాజధాని నగర పరువుప్రతిష్ఠలకు భంగం కలుగవచ్చుకదా! కాబట్టి ఇకముందు మీరు తగు జాగ్రత్త తీసుకుంటారని ఆశిస్తున్నాను.

రామకృష్ణశర్మ-తుంగభద్ర.

* * *

రాజధాని కబురులో 'శ్రీకృష్ణ జన్మస్థానం' చెప్పికథలు చాలా బాగుంటున్నవి. ప్రవీణ్ గారికి నా ధన్యవాదాలు.

యస్. దామోదర్ రెడ్డి, నల్లగొండ.

* * *

## పెళ్ళిళ్ళు-కాపురాలు

ఈరోజుల్లోకూడ భార్యభర్తలు ఒకరినొకరు అర్థంచేసుకోకుండా ఎంతోమంది ఉన్నారు. తల్లిదండ్రులు తమతమ పిల్లలకు వివాహాలు జరిగించేటప్పుడే కొంచం మంచిచెడ్డా చూసుకొని అమ్మాయి కాపురానికి వెళ్ళేవరకూ ఏ విధమైన లోటుపాటులు, మనస్పర్థలు లేకుండా వుండేందుకు ప్రయత్నించాలి. అబ్బాయిలు కూడ కొస్తోకూస్తో 20 వ శతాబ్దానికి చెందినవారు కాబట్టి అనురాగాలు దగ్గరయ్యేలాగ ప్రవర్తించాలి. పెళ్ళిళ్ళు చేసేటప్పుడు డబ్బునిలవ, స్థిరాస్థి వ్యాపారం మాత్రమే భోగటా చేయడంకాగు. సాంప్రదాయం, చదువు, ఉద్యోగం, గుణం ఇవి ప్రధానంగా విచారించి తెలుసుకోవాలి. తమ అంతస్తుకు తగిన ధనవంతుడైన అల్లుడికొరకు ప్రయత్నించేకంటే చాలబీదవాడైన గుణవంతుని అల్లునిగా చేసుకొని తమ అంతస్తుకు అతనిని లేవదీయవచ్చును. స్త్రీఎప్పుడూ భర్తగుణాలను ముందు కోరుతుంది. అయితే వస్తువులు వాహనాలుకోసం ఎగబడేవాళ్ళు కూడ లేకపోలేదు క్రమేపివారిలో అపేక్ష్చ పెరిగించి భర్త మంచివాడైతే అన్యోన్యంగా జీవితం గడుపుతుంది. ఈవిషయంలో అమ్మాయిల తల్లిదండ్రులే సరియైన నిర్ణయము చేసికొని కార్యక్రమాల్లో దిగవలసియుంటుంది. ★

## పుస్తకసమీక్ష

మీ పత్రిక ప్రతివారం విడువకుండా 'పుస్తక సమీక్ష'ను ప్రచురించుచున్నది. ఈ శీర్షిక క్రింది ఉత్తమ సాహిత్యగ్రంథాలు పాఠకలోకానికి పరిచయం గావింపబడుచున్నవి. తద్వారా సాహిత్య వినీలాకాశంలో విహంగముల వోలె స్వేచ్ఛగా విహరించడానికి సాహిత్యాభిమానులకు సదవకాశం లభ్యపడుచున్నది. సాహిత్యాభివృద్ధికి యీ.ప్రోత్సాహ్యం గీటురాయి వంటిది. సాహిత్యసేవకులుగా పత్రికాసంపాదకులు ధన్యులు. మున్ముందు కూడా ఉత్తమ సాహిత్య గ్రంధాలను, పాఠక హృదయాలకు పరిచయం చేస్తూ వుంటారని సంపాదకులను కోరుచున్నాను.

కుంటపల్లి రాధాకిషన్ రావు, సంగెం.

* * *

## అబద్ధం

స్వామి గారు వ్రాసిన వ్యాసం "ఆడవాళ్ళు ఉద్యోగము చేయనా? ఊళ్ళు ఏలనా?" పఠించాను. వారితో ఏకీభవించలేను. ఆడవాళ్ళు ఉద్యోగముచేసి భర్త సంపాదనలో సహాయపడి సంసారాన్ని స్వర్గధామంగా చేస్తారనేది శుద్ధ అబద్ధం.

మోతుకూరి వెంకటేశ్వర్లు, (సూర్యాపేట)

* * *

అమ్మమ్మలేగాక చదువుకున్నవాళ్ళలో కూడ ఈ అభిప్రాయముండుట చాలా శోచనీయము. ఇకనైనను వీరి అభిప్రాయాలు మార్చుకుంటే మంచిది.

జయప్రద, (ఒంగోలు.)

"మత తమ సెవులలు", ఇటీవల వనితాలోకంలో వచ్చిన వ్యాసాలన్నిటిలోకి చాలా బాగున్నది. అంటే అర్థవంతముగాను, చిన్నపాఠమువలె, చక్కగ ప్రారంభించి, మనిషి జీవితంలో చేసేపను లన్నీ లెక్కకట్టి ఆఖరుచేశారు. ప్రమీలాదేవి గారికి నా ధన్యవాదాలు.

సుజాతశర్మ, (కర్నూలు)

* * *

"తమ తమ సెవులలుతప్పిన" వ్యాసం చాలా బాగుంది. శీర్షికకూడా స్థలంమార్చి చక్కగా వ్రాశారు.

బండి దేవి, (కవుతరం)

* * *

"మత తమ సెవులలుతప్పిన" చాలా బావుంది. రచయిత్రి బాగా నవ్వుపుట్టించేటట్లు వ్రాసినారు. నా అభినందనలు.

సి. ఇందిరారెడ్డి, (హైదరాబాదు)

* * *

"కాటుకను" తయారుచేయు విధమును గూర్చి వ్రాసిన శ్రీమతి టి. రామలక్ష్మిగారికి నా అభినందనలు. శేరున్నర ఆముదమునకు ఒక చిన్న చెంచాడు కటుకపొడి వచ్చునని వ్రాసినారు. బహుశ అచ్చుపొరపాటేమో. ఒక అరసోల అనగా (1/8 శేరు) ఆముదమునకు ఒక అమృతాంజనము డబ్బాడు కాటుక వస్తుంది. అందుచే అరసోల ఆముదముతో మొదట ప్రయత్నించి చూడుమని వనితలకు నామనవి. కాటుకముద్దను తయారుచేసిన తరువాత ఆముదను ఒకపళ్ళెంనిండా నీళ్ళుపోసి గ్లాసు అడుగుతో మర్దించిన కాటుక చాల మెత్తగ అయి కళ్ళకు చలువచేస్తుంది.

వేపా కృష్ణవేణి, (నరసాపురం)

* * *

సి. ఉత్తరగారు వ్రాసిన "బాల వ్యాకరణం" చాలా బాగుంది, నాకు బాగా నచ్చింది.

శ్రీమతి అంజి (కాకినాడ)

* * *

కూతురు మాటగాద అల్లుడు నడవాలని, కొడుకుమాత్రము కోడలుమాట వినకూడదని అనేవాండ్లకు యీ శీర్షిక బాగా గుణపాఠం నేర్పుతుంది.

ఎ. రాజేశ్వరి (నెల్లూరు)

* * *

బాలవ్యాకరణం అనే శీర్షికక్రింద సి. ఉత్తరగారు ప్రథమ పురుష, ఉత్తమ పురుష గూర్చి వ్రాశారు. అది ఎందుకు వ్రాశారో, ఎవరికి ఉపకరిస్తుందో నాకేం తెలియటంలేదు. వి. ఎస్. నాథ్ (హైదరాబాద్) ★

# ★ కమలం - కనకం ★

(23 వ పేజీ తరువాయి)

భగవంతుడికవిూదనయినా నిన్ను చేరదీసి ఆద రించే మంచిమనసు మనిషిని ఒకర్ని చూపిం చకపోడు. నువ్వు లక్ష్మిలా ఎవరింటికివెళ్లినా యిల్లల్లా వెలుగేకద. నువ్వు తన యింట్లో ఉండటం నీ ఉపకారం అని భావించేవాడు సౌందర్యాన్ని చూడలేని గుడ్డివాడు...'

గలగలా నవ్వింది కమలం. 'కడుపు ఏడు స్తున్నా నోరు కవిత్వం పలుకుతూందే! ఎక్కడైనా ఉన్నదేగా. కవిత్వం చెప్పే వాడికడుపు అప్పడంలా ఉండడం. కాని యిక్కడింకా అంతకరువు రాలేదు. ఈ ఆవగపిండి గనక పనికొస్తే ఒక్క పావు గంటలో తినడానికి తెస్తాను. కూర్చో" అని లేచింది.

డబ్బుఅనే కొలనులో యీదులాడే చేప లకి ఆ కొలనులోనే అంటీఅంటనట్టు నిశ్చ లంగా వుండే కమలం సౌందర్యమూ, సౌర భమూ దక్కే అదృష్టమెక్కడిది? పైనుంచే ఎవ్వడో రావాలి. వచ్చి యీ కమలాన్ని తీసుకుని తన ఆరాధనామందిరంలో ప్రతి ష్ఠించుకుంటాడు.

పిచ్చిగీతల కాగితాన్ని అవతల పారేసి పద్యాలు రాయడం మొదలెటాను. భావ పరంపరతో కలం పోటీపడలేకపోతోంది. అరె! టీ, పక్కోడీ దగ్గరాలేవి లేకుం డానే యీకలం అరేబియా సుద్రం అయి పోయిందేమిటి? ఇన్ని ఫ్రెంచ్ అంటారే అది ఇదే కాబోలు! "నన్ను ఇన్స్పైర్ చెయ్యగల పరిపూర్ణ స్త్రీ కమలం!

* * *

ఒక వర్షాకాల మధ్యాహ్నం. నా గది కిటికీదగ్గర కూర్చున్నాను. కాళీబుర్రతో, హృదయంలో అవ్యక్తమయిన వేదనతో, నా కవితావాహిని నన్నేముంచేసేటట్టు ఉంది. ఎప్పుడూ ఏదో వెలితి, వేదన. నా సర్వస్వం అయిపోయింది.

'తోడునీడ అంటూ ఎవ్వరూ లేకపోయి నందువల్లే నీకింత మనోవ్యధ" అన్నారు ఒక రిద్దరు. నిజమే కావచ్చునని నాకూ అనిపిం చింది, కాని ఏంలాభం? సహచరిణికోసం నేను చేసే ప్రయత్నం ఒక్కటీఫలించ లేదు.

మామిడితోపుని ఇంకా వీడిపోని కోకిల ఆసారి విషాదగీతాలని వింటూ కుర్చీలో వెనక్కివాలాను. పైన మేఘాలకంటె దట్టంగా చీకటిగావున్న ఆ తోపు జాత్తు విర బోసుకుని విలపిస్తున్న బాలవితంతువుని జ్ఞప్తికి తెస్తోంది. "వసంతం ఏనాడో వెళ్ళి పోయింది. మల్లెల పరిమళమూలేదు నువ్వూ వెళ్ళిపోతే, ఓకోకిలా, నేనెలా బతకను? నువ్వు కమలం కంఠానివి" అక్రోశించింది నా హృదయం.

గొడుగులో వలెటూరి పోస్టుబంట్రోతు వచ్చి నాకోకవరు అందిస్తూ "ఏంబాబూ! అలా చిక్కిపోయారు!' అని పరామర్శించి వెళ్లాడు.

కవరు విప్పుతూంటే నాకు ఆనందాశ్చర్య భయాలు ముప్పిరిగొన్నాయి. కమలం ఇదివర కెన్నడూ నాకు ఒక్కముక్కయినా రాయ లేదు. "నాటికోనాడైనా నీక్షేమం రాయ కూడదా?' అని నేను ఎన్నిసార్లు ప్రతిమాలా ననీ? 'రాయకపోవడమే క్షేమంగా ఉన్నట్ట నుకో. నాకైనా ఇబ్బందివొస్తే నీకుగాక మరెవరికి రాసుకుంటాను?' అనేది కమలం. ఆమె జీవితం ఇప్పుడేదైనా సుడిగాలిలో చిక్కుకోలేదుకద!

కవరు విప్పగానే నా ఆశ్చర్యం ఇనుమ డించింది. కాగితం అంతటికీ నాలుగు వంకర పంక్తులు!

"చిరంజీవి సూర్యానికి, ఆశీర్వచనాలు.

"క్షేమం. వీలయితే నువ్వోసారి ఇక్క డికిరా. మొన్న మీ పూరతను కనిపించి నువ్వు జబ్బుపడ్డమనిషిలా అయిపోయావని చెప్పాడు. చాలాకాలంనుంచి నీ క్షేమం తెలియలేదు. నాకు చాలా బెంగగావుంది. నేనక్కడికిరాలేనుగదా. పంజరంలోపక్షిని. నువ్వొస్తే చాలా సంగతులు మాట్లాడు కుందాం.

నీ శ్రేయోభిలాషిణి, వదిన,<br>కమలం.'

తల్లి జబ్బు గురించి టెలిగ్రాం వచ్చిన పిల్లవాడిలా అయిపోయాను.

నా క్షేమ సమాచారం తెలుసుకోవడం కంటె ముఖ్యమైన పనేదో వున్నట్టు 'పంజ రంలో పక్షిని' అన్న ఆ వాక్యమే చెబు తోంది.

ఆలస్యం చెయ్యక ఆ సాయంత్రమే బయలుదేరాను. రేల్లో కమలం కూర్చిన ఊహాలే. నేను వెళ్లేటప్పటికి కమలం విచార వదనంతో ఉంటే నేను తట్టుకోగలనా?

కాని అలా జరగలేదు. కమలం ఎప్పటికి మల్లే చిరునవ్వుతో పలకరించింది. రమా కాంత్ దంపతుల్లో మట్టుకు మార్పు కన బడింది. తమ దేదో దోచుకుంటున్న వాడిని చూసినట్టే చూశారు నన్ను.

కమలం తన వ్యవహారమేదో రమాకాంత్ తో పరిష్కారం చేసుకున్నట్టూ, ఆ విష యాలు నాతో చెప్పడమే తరవాయి అన్నట్టు ఉంది. నాకేం బోధపడలేదు.

'ఏమిటి సంగతి కమలం?' అడిగాను— ఏకాంతం చూసుకుని.

'ఏవుంది. నేనిక్కడ ఉండలేను. నీ యింట్లో నీతోబాటే వుండాలనుకుంటు న్నాను' అంది, అదేదో అతి సామాన్యమైన విషయమైనట్టు.

నేను తెల్లబోయాను. 'నువ్వా!'

'ఆఁ నేనే' అంది కమలం దృఢంగా.

కొంత సేపటిదాకా నాకు నోట మాట రాలేదు. ఆ పాముకొంపలో ముమ్మగొట్టుకు పోయిన పుస్తకాలూ, కాగితాల మధ్య కమలం! ఊహిస్తేనే భయంగావుంది. అదీ గాక ఇంకో ఆలోచనకూడా పోయింది. ఎంతైనా కమలం నాకు మేనమామ కూతురు.

'నువ్వొస్తే ఆ వల్లెటూళ్ళో నలుగురూ ఏమనుకుంటారు కమలం?' అనడిగాను. సిగ్గు వేసింది ఆ మాట అడగడానికి.

కమలం ఒక్కసారిగా నవ్వులో పడి పోయింది. 'అసలు "నలుగురూ" ఉన్నారని ఎప్పుడు తెలిసింది కవిగారూ నీకు?'

'నువ్వు నా లోకజ్ఞానం లేకపోవడాన్ని హేళన చెయ్యక్కర్లేదులే' అన్నాను. వితంతువు పెళ్ళికాని వాడితో ఉండడమనే విషయాన్ని అంత తేలికగా తీసుకున్నందుకు కోపం వచ్చి.

'లేకపోతే ఏమిటి సూర్యం! వలభై ఏళ్ళు నెత్తికొచ్చిన నేను నీతోవుంటే ఏమనేవాను కుంటారు?.

'ఆ సమానం నీకు వలభైఏళ్ళని ఎందుకు అబద్ధం ఆడుతావు కమలం? అసలు వయసు చెప్పినా నీకు అన్నేళ్లుంటాయని ఎవరూ నమ్మరు. మనదేశంలో భర్తలేని స్త్రీలకి తమ వయస్సు ఎక్కువ చెప్పుకోవడం జబ్బుపట్టు కుందేమో?'

తను చాలాచిన్నదానిలా కనబడుతున్నా నని నానోట విని కమలం కొంచెం సిగ్గు పడుతూ దానిలో సంతోషం దాచుకో లేకపోయింది. వికసిస్తున్న గులాబీలపై ఉదయపు లేతయెండ పడుతున్నట్టుంది ఆ శోభ. ముసు పెన్నడూ నేను సందర్శించనిది.

'ఎక్కువేముంది సూర్యం! ముప్పయి దాటాయిగా. అయినా ఏళ్లతో పనేముం దిక. ఈ జన్మకి చెయ్యవలసింది ఆ చివరి

# ★ కమలం-కనకం ★

యాత్ర ఒక్కటే కదా. అది నీ చేతులమీదుగానే జరుగుతుందేమో అని ఆశ.'

నాకు దుఃఖం వచ్చింది. భర్త పోయిన స్త్రీ చేయవలసిందల్లా ఆ ఒక్క 'చివరి యాత్రేనా?' ఆహా! యుగయుగాల సంప్రదాయం!

'అది సరే. ఇంత సౌందర్యం తనయింటిని వొదలి పోవడానికి ఒప్పుకుంటాడూ మీ అన్నయ్య.'

కమల ముఖం గంభీరమైంది. 'తమకి అవసరం లేనిదాన్ని నేనెక్కడికి పోయినా ఎవరికీ పట్టదు. నా డబ్బులోనే వచ్చింది చిక్కు.' అంది.

'ఏం నీ డబ్బు నిన్ను తీసుకోనియ్యడా అన్నయ్య?'

'తీసుకోనియ్య డనుకో.'

'ఆఁ!' అని ఆశ్చర్యపోయాను. సుమారు అయిదారువేల రూపాయలు! ఆడకూతురు సొమ్ము! మనువు పుట్టిన దేశంలో అవతరించిన మా మేనమరది!

'నా డబ్బు లేకపోతే నువ్వూ నన్ను గుమ్మం తొక్కనివ్వవు కాబోలు!' అంది నిందాగర్భితంగా.

ఈ అఘాతం నా హృదయాన్ని ముక్కలు చేసేదే. కాని కమలానికి నా స్వభావం తెలుసు. డబ్బుని వేటాడేవాళ్ళని మనసులో పెట్టుకుని అన్నమాట అది—నన్ను కాదు.

కమలం చెప్పసాగింది: మొన్న అమావాస్య చిట్టికి జబ్బు చేస్తే బెజవాడ వెళ్ళాలి అన్నాను—అన్నయ్యతో. ఆ వేళ రెండో తారీఖు. నాదగ్గర ఒక్క కానీ లేదన్నాడు. చూడు! కన్నతల్లి కంటె ఎక్కువగా పెంచాను చిట్టిని. వాడు చావుబతుకుల అవస్థలో ఉంటే, నా డబ్బు అంటూ కొంత బేంకిలో ఏడుస్తున్నప్పటికీ, వాణ్ణి చూసుకునే వీలు లేదు నాకు. చిట్టికి నేను చేసిన ఉపచారాల్లో పదోవంతయినా వాళ్ళమ్మ చెయ్యక పోయినా, కన్నది కాబట్టి, వాణ్ణి ఒక్క క్షణమైనా వదిలివుండవలసి బాధ దానికి లేదు. నాకో నాల్రోజులూ నిద్రాహారాలు లేవు. కునుకుపడితే కలలో చిట్టి. ఆ రామచంద్రమూర్తి దయవల్ల కుర్రనాగమ్మకి నిమ్మళించిందనుకో. కాని నా మనసు విరిగి పోయింది. చిట్టిని చూసుకుంటూ అక్కడ వుండామంటే లచ్చు సంగతి నీకు తెలుసుగా. ఏళ్ళు తేడా తప్ప నీకూ చిట్టికీ యింకో భేదం లేదు. సరియైన సంరక్షణ లేక నువ్విలా అయిపోతుంటే నా మనస్సెంత తల్లడిల్లిపోతూ వుందో ఆ పరమాత్ముడికే తెలుసు, నేను డబ్బున్నదాన్నయినా, లేనిదాన్నయినా నువ్వొక్కలాగే నన్ను ఆదరిస్తావనే నమ్మకంతో...'

నా వ్యథ అధికమైంది. కమలం ముఖం కొన్ని క్షణాలు నవ్వులేకుండా ఉంటే హఠాత్తుగా పూర్ణిమచంద్రుడు ఆరిపోయినట్టు బాధపడతాను. దానికితోడు ఈ డబ్బు ప్రసక్తి ఒకటి.

'నేనేదైనా నీపట్ల అపరాధం చేస్తే యీ డబ్బుమాట తప్ప యింకో ఆయుధం లేదా కమలం నన్ను శిక్షించడానికి? నువ్వు నా యింటికి రావడం నా అదృష్టం. నువ్వు నన్ను ఇన్‌స్పయిర్ చెయ్యగలవు కమలం...'

కమలం మళ్ళీ మామూలుగా నవ్వుతూ 'నా మొహం! మూడో క్లాసయినా చదవని నేను ఇంస్పయిరూ అదీ చేసినా చెయ్యక పోయినా ఇంత ఉడకబెట్టి వడ్డెయ్యగలను గదా?'

ఈ పద్ధతిలో సంభాషణ ఎలా సాగుతుంది?

తర్వాత కమలానికి వాళ్ళన్నయ్యకీ మధ్య జరిగిన వివాదం వివరాలు తెలిశాయి.

రమాకాంత్ వింతమనిషి. డబ్బుమీద ప్రేమజాస్తి. అంతరాత్మని అతను గయ్యాళి భార్యగా ఎంచుతాడు. తనని వీధిని పడేసి నలుగురిలో నవ్వులపాలు చేస్తుందేమో అన్న భయం ఉన్నప్పుడు మాత్రమే దాని మాట ప్రకారం నడుచుకుంటాడు. 'నలుగురూ' ఏమనుకుంటారో అన్న భయం అతనికి నిద్రలో కూడా ఉంటుంది.

కమలాన్ని అతను ఇంకోచోట ఉంచనివ్వడు—ఆమె డబ్బు ఆమెకిచ్చెయ వలసివస్తుంది. డబ్బు లాగుకుని తోడబుట్టినదాన్ని తగిలెయ్యడానికి అతనికి మనసొప్పదు. అదీగాక లోకం తననోట గడ్డిపెటదూ?

వ్యక్తులు తమతమ స్త్రీలగతి ఎట్లావున్నా పట్టించుకోరు. వాళ్ళే సంఘం అయేటప్పటికి ఆ ఆడదాన్ని అన్యాయం చేసిన మొగాణ్ణి దుమ్మెత్తి పోస్తారు.

రమాకాంత్ భార్య ఒంటిపొద్దులూ, చేస్తుంది. ఆమెకి పాపభీతి ఎక్కువ. ఆఖరికి ఎలాగో రమాకాంత్ కమలం డబ్బు తీసుకుని ఆమె యిష్టం వచ్చినచోటుకి వెళ్ళడానికి అనుమతించాడంటే అందుకు అతని భార్యే కారణం. ఆమె డబ్బు ఆమెకిచ్చెయ్యమని భర్తకి గట్టిగా రికమెండ్ చేసింది. అంటే, రమాకాంత భార్యకి డబ్బు కాపీనం తక్కువనిగాదు, ఆడబొట్టె డబ్బు పడేసుకుంటే ఆమె ఉసురు తమకి ఎక్కడ తగులుతుందో అనే భయం ఎక్కువని.

ఆ దంపతులు కమలంతోవున్న కనకాన్ని వదలలేక మానలేకపడ్డ అవస్థని విని నాకు జాలివేసింది.

కమలానికి నేనో సూచన చేశాను.

దాని ప్రకారం కమలం వాళ్ళన్నయ్య దగ్గరికి వెళ్ళి 'పిల్లల చదువుకయినా మరి దేనికయినా పనికొస్తుంది. ఈ సొమ్ము ఉంచు అన్నయ్యా' అంటూ వెయ్యి రూపాయిల నోట్లబొత్తి బల్లమీద పెట్టింది.

రమాకాంత్ ముఖం జేవురించింది. 'ఇప్పుడు అక్కర్లేదులే. వాళ్ళ చదువులయేదాకా నేను బతికి ఉండకపోతే...' అన్నాడు కటువుగా.

'అవేం మాటలన్నయ్యా. వాళ్ళకి ఈ పాటి యిచ్చుకుని ముచ్చటపడేహక్కు మేనత్తనయిన నాకు లేదా?'

'అలా నొచ్చుకోకండి వొదినా. ఆయన మాటలకేమిటి పేగు సంబంధమా మరోటీ మరోటీనా? ఎవ్వరొద్దన్నా మీరు పిల్లలకి అప్పుడప్పుడు ఇవ్వకుండా ఉండగలరా ఏమిటి?' అని నోట్లకట్ట జాగ్రత్త చేసింది రమాకాంత్ భార్య.

చిట్టికో తొక్కుకునే కారూ కొన్ని బట్టలూ కొన్నాం. బెజవాడవెళ్ళి ఓ పూట సరదాగా గడిపి విచారంతో విడిపోయాం. లచ్చు కమలానికి సాక్షాత్తు చెల్లలన్నమాట మా కిద్దరికీ ఒక్కసారె గుర్తొచ్చింది.

రైలు ఆ సుందరనగరాన్ని వదిలేస్తూంటే నా హృదయం వేదనతో ఒరుపక్కింది—తోటలమధ్య కలకలలాడే ఇంటిలో సెలయేటి జలజలశబ్దం వింటూ గడపబోతున్నాను అనే తృప్తి వున్నాను.

'ఏవిఁటీ ఔదార్యం? ఇంకా "నలుగురూ" ఏమనుకుంటారో అనే ఆలోచిస్తున్నావా?' అంది కమలం నవ్వుతూ. రైలు ధ్వనితో కలిసి ఆ నవ్వు మరింత శ్రావ్యంగా ఉంది.

'ఛ! నేను నలుగురికి కాదు లక్షమందికైనా భయపడను కమలం! నీపట్ల నా ప్రేమని ప్రపంచం అర్థం చేసుకోలేదు.

'నా రచనా వ్యాసంగమనే తెరచాప పడవకి నువ్వు గాలివి. కాల ప్రవాహంలో ఆ పడవ ముందుకు సాగుతూంటే చూసి సంతోషించేవాళ్లు నిన్ను కానలేకపోవచ్చు. కాని నావికుణ్ణయిన నాకు మాత్రం తెలుసు, నువ్వు లేకపోతే పడవ ఎంత మందగతిని వెళుందో.

'నా కవిత తోటకి జలానివి నువ్వు కమలం. తోటలో విహరించవచ్చిన వారికి నీ జాడ కనబడకపోవచ్చు. కాని తోటమాలినైన నాకు తెలుసు, నువ్వు లేకపోతే తోటే లేదని.

'ఒక్క మాటలో కమలం, నువ్వు నాలో కవికి ప్రాణం!'

ఆనందాన్ని పట్టలేక 'చాలిద్దూ నీ కవిత్వం' అంది కమలం.

* * *

నాటికీ నేటికీ నేను అవివాహితుణ్నే. కమలం మట్టుకు నా కోసం సంబంధాలని చూస్తూనే వుంది.



# ఆరుద్రగళ్లనుడికట్టు 14.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 | 2 | | ■ | 3 | 4 | 5 | ■ |
| 6 | | | ■ | 7 | ■ | 8 | | 9 |
| 10 | | ■ | 11 | | 12 | ■ | 13 | |
| | ■ | 14 | | ■ | 15 | 16 | ■ | |
| ■ | 17 | | ■ | ■ | ■ | 18 | | ■ |
| 19 | ■ | 20 | 21 | ■ | 22 | | ■ | 23 |
| 24 | 25 | ■ | 26 | 27 | | ■ | 28 | |
| 29 | | 30 | ■ | | ■ | 31 | | |
| ■ | 32 | | | ■ | 33 | | | ■ |

## ఆధారాలు

### అడ్డము

1. మనిషి మొదటి గుర్తో దీర్ఘంతీస్తే మేధావి అవుతాడు.
3. ఈవార ఫలించడంలో వెనుతిరిగిన ఇబ్బంది.
6. మొదటి మొఘల్ చక్రవర్తి పుట్టికొక్కితే మన్యభారం!
8. గ్రహణం వదలిపెట్టడం ఆట ముందుంటే సెలవు.
10. మజా గుర్తించడంలో ఆలస్యం.
11. ఈ లత పేరు తిరోగమించిన విషయం.
13. ఇది నిజంగా కల!
14. ఆనిజాలు ప్రారంభంలో ఉంటే తోటు.
15. వసాలంచు మొదలే బోల్తాకొట్టిన పడవ.
17. జాబాలి తలక్రిందై చివరను వాయించేది.
18. తలతిరుగుడు పాకుతుంది.
20. వాడియొక్క నీయొక్క రకరకాలు.
22. పాచికల మొదట అశుభం.
24. మొదట పంతితి చెప్పకొంటే వేద పాఠం.
26. మిథ్యామార్గం వ్యాప్తము లు తెని గిస్తే గర్భశత్రువులు.
28. ఆకారంగల వాంఛ.
29. అపవాదును మనవు మధ్యలో చంపు.
31. వింత పటము.
32. అవుర! భల్లాణ్జాతిలో వ్యవహార నామవాచకం గుప్తంగా ఉంది.
33. విత్తనము మధ్యన పోతే ధనము!

### నిలువు

1. వలవల కాగే చాటు ప్రదేశం.
2. రెండు కొమ్ములున్న నువ్వు ఒక్క కొమ్ముతోనే ఉండాలంటే ఎలా పిలవాలి?
4. చిరవికాసంలో దినమణి.
5. వాడు మొదలెట్టే సంప్రదాయం.
6. రమ్యమ చక్రవర్తి చివరనుంటే విపణి వీధి.
7. వినోబా ధర్మోపదేశంలో నొప్పి!
9. అనవిరుంకం ఫుల్లకృతువా!
11. తలలేని యజమాని.
12 అవినాభావంలోని అభావం పోగా మినహా.
14. తురుష్కసాగారం.
16. మురలులోని చిలవ తలకిందు లవుతుంది.
19. వడమటిసందు అందంగా ఉన్నది.
21. వింటితాడు ఆడది.
22 మురిపాలు చివర కొంతభాగం.
23. సంస్కృతంలో 14 నిలువు.
25. అతను పురితీతలో దేహం మన్య కెళ్లాడుతుంది.
27. ఇరవై మణుగులు జనించి ఒకప్పుడు మునుగవచ్చు.
28. ఆత్రుత.
30 మార్యతంశము రచించుటందు చాని మాలపుటమ్మ.
31. ఇంతే సంగతులు తరవాత మొదలయ్యే పత్రం!

★

## 13-వ నుడికట్టుకుజవాబులు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఆ | దో | 2 ని | ■ | ■ | 3 సం | భా | వ | 4 న |
| సు | ■ | 5 హా | ట | ము | గ | ■ | ■ | ష్ట |
| ప | ■ | ర | ■ | ■ | 6 ర | త | 7 న | ము |
| 8 త్రి | 9 కో | ణ | ము | ■ | ము | ■ | ర | ■ |
| ■ | దం | ■ | ■ | ■ | ■ | ■ | బ | ■ |
| ■ | డ | ■ | 10 అ | ■ | 11 పూ | 12 మా | లి | 13 క |
| 14 పా | ము | కో | ర | ■ | ■ | గో | ■ | ల |
| దు | ■ | ■ | 15 చే | దు | మా | త్ర | ■ | హా |
| 16 క | ను | దో | యి | ■ | ■ | 17 ము | దు | రు |

## విధినిర్ణయం

(14- వ పేజీ తరువాయి)

"అలాగే......ఇందిరా ఈసారి మీరు మా ఇంటి కొచ్చేసరికి బాగా లావుకావాలి ఏం?" రమ నవ్వింది.

ఇందిర నవ్వుతూ 'ఊఁ' అంది.

ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా "ఆ మధ్య నువ్వు కథలూ అవీ రాస్తుంటే దానివి కాదూ?"

"ఊఁ" రమ తలవూపింది.

"మానేశా వెందుకని?"

"ఊరికే నే"

"మళ్ళీ రాస్తుండరాదూ అక్కయ్యా!" ఇందిరమెల్లిగా రమచేతిని తాకుతూ అంది.

"నిజంగా నే వ్రాసేరచనలు బాగుంటాయా...?"

ఎవర్ని వుద్దేశించి ఆమాటలందో గ్రహిం

"నే చాలాచదివాను...ఎంతో బావుంటాయి...మళ్ళీ రాస్తుండరాదూ?" మధు కళ్ళల్లోని ప్రార్థనాభావాన్ని గమనించి రమహృదయంలో ఎక్కడో దాగివున్న ఉద్రేకం కట్టలు తెంచుకుంది.

"రాస్తాను ... కథలు రాస్తాను ... మనసులోని ప్రతి అణువులోని ఆవేదనా నా కథల్లో కురిపిస్తాను...ప్రతి రక్తబిందువులోని ఆక్రందనా కలంలో నింపుతాను...!" ఇంకా నిబ్బరపోతూ చేతులు తీసుకుంది. కైలు కదిలిపోయింది.

ఆరాత్రి మొట్టమొదటిసారిగా ఇందిరను దగ్గరకు తీసుకుంటూ మధు అన్నాడు: "నీ మనస్సును అర్థంచేసుకోలేక నిన్ను క్షోభ పెట్టాను ఇందిరా! నన్ను క్షమించవూ!"

ఆ ఆదరణకు ఉప్పొంగిపోతూ, హృదయావేగాన్ని ఆనందాశ్రువుల రూపంలో అతని హృదయంమీద కురిపించేసింది ఇందిర.

కనీ, మనసు...

మీదట ప్రేమనుకూడాచవిచూస్తావిందిరా!"

అనురాగ పూరితాలైన ఆ చల్లటి మాటలతో, అనుతప్త హృదయభారాన్ని దించి వేసుకుని మృదుకంఠస్వరంతో అంది ఇందిర: "కారణంలేకుండా ఆవేశపడి ఉద్రిక్తత చెందేదాన్ని! ఒక్కరమ అక్కయ్యే కనుకున్నాను...కానీ మీరుకూడా...!"

నవ్వుతూన్న ఆ అమాయికపు ముఖంవేపు చూస్తూ 'తాత్కాలికోద్రేకం కాదు ఇందిరా భగవంతునిమీద ప్రమా..."

మృదువుగా అతనినోటిని తన చేతి వేళ్ళతో మూస్తూ అల్లాగే హృదయంమీద వాలిపోయిందామె.

★

**పిచ్చికగూళ్లు జవాబులు:**

బందము, అతుకు; విలయము, నిపాదము; ప్రాయము, స్వాంతము; వెల, కలితి; వధువు, మలపు:

# పుస్తక సమీక్ష

## కడలిమీద కోన్‌టికి

ఇంగ్లీషు రచన: థార్ హెయర్‌డాల్. అనువాదం: విద్వాన్, దేవరకొండ చిన్నికృష్ణశర్మ. ప్రకాశకులు: ప్రేమ్‌చంద్ పబ్లికేషన్స్, విజయవాడ. (దక్షిణ భాషాపుస్తక సంస్థ సహకారముతో ప్రకటితము.)

ఇది సాహసయాత్రలకు సంబంధించిన గ్రంథం. మనం ఎప్పుడూ చెప్పుకుంటాము: మన ఆంధ్రులు ధీరులు, వీరులు. మలయా, సింగపూర్, ఆఫ్రికాలకు సముద్రాలమీద వలసవెళ్లారు, అక్కడ వుండిపొయ్యారని. అది ఎప్పటి సంగతో, ఏమో! కాని ఇప్పుడు మటుకు మనం ఊరుకదలం. అందుకనే ఇలాంటిపుస్తకాలు చదివి విషయాలు తెలుసుకోవటం ఎంతో అవసరం.

ఎవరెస్టు ఎక్కడం అనేదికొండలకు సంబంధించిన సాహసయాత్ర. కడలిమీదకోన్‌టికి సముద్రానికి సంబంధించినది. అంతులేని పసిఫిక్ సముద్రంమీద 100 రోజులు ప్రయాణంచేశారు—నాటుపోటుమీద—4000 మైళ్ళకుపైగా. ఆ అనుభవాలు వాళ్ళ ఆరుగురికే తెలియాలి.

ఒక్కొక్క అనుభవం చదువుతూంటే భయంవేస్తుంది. అదిగాక ఈజట్టువెళ్ళి తిరిగి బ్రతికి ఎలావచ్చిందా అని అనిపిస్తుంది. యాత్ర మొదట్లోనే కెరటాలతో 60 గంటలు తెరిపిలేకుండా ఎలా పోరాటం జరిగిందో—విశదంగా వారు ఎదుర్కొన్న విధానం వివరించారు. మంచినీళ్లు అయిపోయినప్పుడు వర్షంమీద ఆధారపడ్డారు. సముద్రమధ్యంలో మంచినీటి ఇబ్బందిలేదని తెలుస్తుంది. పక్షులు, సముద్ర ప్రవాహాలు వీళ్లకు అప్పుడప్పుడు వుత్సాహం కలుగచేశాయి. నిర్ణీత స్థలానికి సమీపిస్తూ వున్నట్లుగా. ఒకచోట కెరటాల్లో చిక్కుపడ్డారు. "ఆ భయంకరస్థితిలో మా స్థితి ఎలావున్నదో చెప్పటానికి వీలు లేదు." దీవులు సముద్రమధ్యంలో ఉన్నవారికి 'ఆకుపచ్చని గంపలాగా' కన్పిస్తవి.

ఈస్టర్ ద్వీపంచేరి అక్కడి సంస్కృతినిగురించి ఇట్లా చర్చించారు. "నేటి గొప్పగొప్ప ఇంజినీర్లకు గూడా అశక్యంగా కన్పించే క్లిష్ట సమస్యలను పరిష్కరించిన ఆనాటి శిల్పశాస్త్రజ్ఞుల కళా నైపుణ్యము—బుద్ధిబలము ఎటువంటిదో!" రకరకాల మత్స్యాలను తిమింగలాలను పరిశీలించారు. దక్షిణ సముద్రంమీద ద్వీపాలలో మానవ జీవితం ఎలావుంటుందో స్పష్టీకరించారు.

కోన్‌టికి చివరకు శిథిలమైపోయింది. కాని దానిచరిత్ర, కీర్తిమాత్రం చెక్కు చెదరలా. తొమ్మిది బాల్సాదుంగలతో తయారుచేయబడిన తెప్ప ఇది. చక్కటి ఫొటోలతో ముచ్చటగా ఉంది ఈ పుస్తకం.

[ రా. మూ. ]

# భారతి

## 1959 ఆగస్టు సంచిక

### కవిత:



### వ్యాసాలు:



### కథలు:



### కలగూరగంప:



### గ్రంథవిమర్శనము:



## వెల రు. 1-0-0

మేనేజర్, భారతి 7, తంబుచెట్టివీధి, మద్రాసు -1.


Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd. by S. Radha Krishna at The Andhra Patrika Press 6 & 7 Thambu Chetty Street Madras-1 Editor S. Sambhu Prasad



అల్లిక

—చిత్రం : రావాడ కృష్ణ.

**Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.**